

"గ్రామసింహాలు"లో శ్రీదేవి, రజనీకాంత్




## ముఖచిత్రం

4.6.82 ముఖచిత్రం 'సుమలత' ఎంతో బాగుంది ముఖచిత్రాలకై మీరు తీసుకుంటూన్న శ్రద్ధ అభినందనీయం.

పులపర్తి శ్రీరంగ (మొగల్తూరు)

* * *

4.6.82 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం నూతననటి సుమలత ముగ్ధ మనోహరంగా వికసించిన గులాబిలా అత్యంత ఆకర్షణీయంగా ఉన్నది.

మల్లెం వెంకటేశ్వరరావు (ఖమ్మం)

## సీరియల్స్

4 6 82 మీ(మా)పత్రికలో కొత్త సీరియల్ కాలం కరిచాక చాలా బాగుంది. పాపం మీనాక్షి మురళిచేతుల్లో తన బ్రతుకునుపండించుకుంటుందో మోస పోతుందోనని మరోవారం పత్రిక కొరకై ఎదురు చూచేలా చేస్తుంది. రచయిత్రికిఅభినందనలు.

మొహ్మదు లతీఫుద్దీన్ (రాజమండ్రి)

* * *

సుమలత ముఖచిత్రంతో వెలువడిన — 4.6 82వ తేదీ ఆంధ్రసచిత్ర వారపత్రికఎంతో ఆకర్షణీయంగా నున్నది. మనసుకథ సీరియల్ భరించలేని సస్పెన్స్‌లో సాగుతున్నది. కాలం కరిచాక, సీరియల్ ప్రారంభం బాగుంది.

రాపోటి వీరభద్రరావు, బేహాడ నాగేశ్వరరావు, (ఖర్గపూర్)

* * *

4.6.82 నటి సుమలత ముఖచిత్రంతో వెలువడ్డ ఆంధ్రసచిత్ర వారపత్రిక చాల ప్రశంసనీయంగా వుంది. సీరియల్ మనసుకథ చాల బావుంది ముందు ముందు, ఏమవుతుందో అని ఆత్రుతతో ఎదురు చూస్తున్నాను.

జి. రమణిమోహన్ (కడప)

4 6.82 ఆంధ్ర సచిత్ర వారపత్రిక నటి సుమలత ముఖచిత్రం చూడముచ్చటగా ఉంది. మనసుకథ చాలా బావుంది. ఇంకా ఏమవుతుందో అనే ఆత్రుతతో ఎదురు చూస్తున్నాము.

వై. కుమార్ చౌదరి (కాశీబుగ్గ)

* * *

నటి సుమలత ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో ప్రారంభమైన సీరియల్ కాలం కరిచాక బాగుంది. మురళి పన్నిన మోహపు వలలో చిక్కిన మీనాక్షి బ్రతుకు ఏమవుతుందో తెలియడంలేదు.

ఎస్. ఇందుముఖి (హైదరాబాద్)

* * *

మనసుకథ ఏడడుగులు సీరియల్స్ బాగుగా సాగిపోతున్నాయి. 'కాలం కరిచాక' సీరియల్ చాలా బాగున్నది. రచయిత్రులకు నా కృతజ్ఞతలు.

కె. ఈశ్వరజ్యోతి (బైపల్లి)

* * *

4 6.82 తేదీ పత్రిక ముఖచిత్రం నటి సుమలత బాగుంది. ఇందులో ఈవారం ప్రారంభమైన క్రొత్త సీరియల్ కాలం కరిచాక ప్రారంభంలోనే వో కొత్త మలుపు తిరిగింది.

ఎస్. అన్సర్‌హుస్సేన్ (గిరింపేట)

* * *

కొత్త సీరియల్ 'కాలం కరిచాక' సీరియల్ ఆరంభంలోనే నన్నాకట్టుకుంది. సంభాషణలు చాల బాగున్నాయి. నిజజీవితంలో కూడా యిటువంటి సంఘటనలు మనం రోజూ ఎన్నో చూస్తూనేఉన్నాం కదా! మరువాడ సూర్యప్రకాశం (కాశీబుగ్గ)

## కథలు

4.6.82 నటి సుమలత ముఖచిత్రము వారపత్రిక అత్యంత సుందరముగా ఉంది. కథలలో అనురాగదేవతనీవు, నీకు పెళ్లి — నాకు శిక్ష కథలు మా ఇంటిల్లిపాదికీ నచ్చాయి.

ఎ. సౌభాగ్య, ఎ. మంజుల (నాగర్‌కర్నూల్)

* * *

సుమలత ముఖచిత్రంతో వెలువడిన4.6.82 సంచిక అద్భుతంగా అలరించింది. రామసూరిగారి 'అరాచకీయం' కథ తక్కువ స్థలంలోనే ఎక్కువ నీతిని బోధించింది.

బి సుభాష్ (శ్రీకాళహస్తి)

* * *

4 6.82 నాటి పత్రికలో విధివిపరీతం, అరాచకీయం కథలు చక్కని సెంటిమెంట్‌తో కూడి ఉన్నాయి

ఎం. పద్మావతి, ఎం. సాయిగనేష్, పి. వి. వరలక్ష్మి (సంపర)

* * *

సుమలత ముఖచిత్రంతో వెలువడ్డ 4.6.82 తేదీ మీ(మా) ఆంధ్రసచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా వుంది. కథలలో ''నీకు పెళ్లి నాకు శిక్ష, అరాచకీయం'' రచయిత లిరువురికీ నా ధన్యవాదాలు.

కె. ఈశ్వరరావు, కె. ఆనందరావు, కె.వైకుంటరావు (బైపల్లి)

* * *

ఈ వారం పత్రిక పై ముఖచిత్రం సుమలత విద్యుల్లతలా శోభిల్లి, ఆకర్షణీయంగా ఉంది.

రామసూరి 'అరాచకీయం' కథలో రాజకీయ పక్షాల రోదన ఎంచక్కా స్పందింప చేయగలిగారు. మిగతా కథలు మూడూ బావున్నాయి.

పెన్మత్స సూరిబాబు, ప్రభాకర్ రాజు, (హైదరాబాద్)

* * *

4.6 82 సంచికలో ప్రచురితమైన 'అరాచకీయం' మా హృదయాలకు హత్తుకొని పోయేలా వుంది. వైరైటీగా కథను తీర్చిదిద్దిన రామసూరి గారు అభినందనీయులు.

మూలపూరి వెంకటరమణ (ఖమ్మం)

* * *

4.6.82 సుమలత ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది 'అనురాగదేవతనీవు'లో చిరంజీవివంటి వ్యసనాల పరుడికి కార్యవాది సుబ్బలక్ష్మి చెప్పిన గుణపాటం బాగుంది. 'నీకుపెళ్లి—నాకుశిక్ష' ఆదర్శంగా వివాహం చేసుకుందామన్ని ముందు వస్తున్న యువకులకు లేనిపోనిలోపాలు అంటగడుతున్నఈరోజుల్లో పార్వతి వంటివారు సాహసించి కొందరైన ముందు వస్తే కట్నాల బెడద కొంతైనా తగ్గుతుంది. రచయితలకు నా ధన్యవాదాలు.

కుమారి కొవ్వూరి గౌరి విజయలక్ష్మిరెడ్డి, (కొత్తపేట)

( 74వ పేజీ చూడండి )



ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 - 1972]
శుక్రవారం : 2-7-'82
దుందుభినామ సం. ఆషాఢ శు. ద్వాదశి
సంపుటము 75 : సంచిక 43
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్ట్‌లో ఏడాది చందా రు. 85-80
ఆరు మాసాల చందా రు. 42-90
విడి ప్రతి వెల రు 1-50
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక



ముఖచిత్రం
నటి హేమమాలిని
(ఫోటో : జగ్‌మోహన్)



లోకంపోకడ * డామెన్









కొత్త సీరియల్ ప్రారంభం

# ప్రేమదేవత

భీశెట్టి శారదాలక్ష్మీరావ్

## సంధ్యా సమయం -

పరాజయం పొందిన భీరువులా సూర్యుడు సాగరుని గర్భంలో తల దాచుకునేందుకు పరుగెడ్తోంటే, విజయం పొందిన వీరునిలా వీర విహారం చేస్తూ, అంతవరకూ సూర్యుని ఆధీనంలో ఉన్న ప్రకృతిని ఆక్రమించు కుంటోంది - చీకటి.

సూర్యుని స్థానాన్ని గెల్చుకున్న చీకటికి చల్లని పిల్ల వాయువులతో వింజామరలు వీస్తున్నాడు - వాయు దేవుడు.

వాతావరణం ప్రశాంతంగా ఉంది.

'శివ బాల'లు సర్వ ప్రపంచాన్నీ మరిచి పోయారు

ఆ ఏకాంతంలో మన్మధుని వాడి పూబాణాలకు వేడి నిట్టూర్పులు విడుస్తోంటే - దూరాన ఉన్న శివాలయం లోంచి 'జేగంటలు' మ్రోగాయి.

'శివ'-'బాల'లు తుళ్ళిపడ్డారు.

కన్నూ కన్నూ కలుపుకున్నారు.

చెయ్యీ చెయ్యీ పట్టుకున్నారు.

శివాలయం వేపు దౌడు తీశారు.

శివ వయస్సు ఇరవైనాలుగు. బాల పద్దెనిమిదేళ్ళ పడుచు.

*　　*　　*

శివాలయం —

పూజారికి శివ - బాల లంటే ప్రాణం. ఆడి, పాడి-కలిసి మెలిసి ఆనందంగా తిరిగే ఆ ముచ్చటైన 'జంట' ఏ నాటికైనా ఒక్కటి కావాలన్నది అతని ఆకాంక్ష

శివ - బాలలు పసి ప్రాయం నుండి కలిసి ఉన్నారు.

మనసూ మనసూ కలుపుకున్నారు.

ఒకే బడిలో చదువు కున్నారు

ఒకే గుడికీ అంకిత మయ్యారు.

అందుకే —

పూజారికా 'జంట జవ్వను'లంటే అంత యిష్టం.

*　　*　　*

'శివ' చక్కని చిత్రకారుడు.

'రవివర్మ' అందాలకు సహితం అందని అంతర్యాలను గ్రహించి. చిత్రాలను ప్రాణ ప్రతిష్ట చేయగల దిట్ట.

కొమ్మమీద కోయిలమ్మ పాడినా—

కొమ్మల్లో కోతి కొమ్మచ్చు లాడినా—

వినీలాకాశంలో వింత సోయగం కనిపించినా ...

'శివ' చిత్రలేఖనంలో ఆ రేఖలు ప్రాణం పోసుకుంటాయ్ !

అది చూసి, గల గల పారే సెలయేరులా తుళ్ళుతూ, తూలుతూ గజ్జె ఘల్లుమనిపించి — ఒళ్ళు ఝల్లు మనిపించే నాట్య మయూరి అవుతుంది-బాల.

ఆమె ఆట పాటలకు 'ఆది శంకరుడే దిగి వచ్చాడా, అన్నట్టు 'శివ' డమరు వాయిస్తూ శ్రుతి కలుపుతాడు.

ఫలితం ...

ఆ పవిత్ర ప్రేమ మూర్తుల ప్రణయ, నృత్య గానాలకు ముక్కోటి దేవతలు ముచ్చటపడి చిరాయువుగా దీవిస్తారు.

ప్రకృతి పులకరించి, మతారంగా పలకరించి పూల అక్షింతలు కురిపించి, పరవశిస్తోంది.

*　　*　　*

కొండల్లో, కోనల్లో, చేలల్లో, చెట్లల్లో— ఎక్కడ బాల కాలు కదిపినా, అక్కడ శివ ఊహా సుందరి గీతం రూపంలో సాక్షాత్కరిస్తుంది.

వాళ్ళ అనుబంధం—

కొండ కూ - సెలయేటికీ -

చెట్టుకీ - గట్టుకీ వున్న సంబంధం.

వసంతానికీ — కోయిలకూ వున్న రాగానుబంధం ...

'శివ' స్వాతి చినుకులా కనిపిస్తే—ముత్యపు చిప్ప అవుతుంది—బాల.

'శివ' సూర్యునిలా క్రీగంట చూస్తే కలువలా నవ్వుతుంది- బాల.

*　　*　　*

మేనత్త — మేనమామ బిడ్డలు — వాళ్ళిద్దరూ.

## 2

కోటమ్మ ఇంట్లో —

లాంతరు చూరుకు తగిలించి, గుమ్మం

దగ్గరకు వచ్చి నిలబడింది-కోటమ్మ.

ఆమె కళ్లు చీకట్లను చీల్చుకుంటూ శివ కోసం ఎదురు చూస్తున్నాయ్.

"ఏం కోటమ్మా! మనవడింకా రాలేదా?" దారంట వెళ్తున్న రాజయ్య కేకేసి మరీ అడిగాడు.

"లేదు రాజయ్యా! వాడి కోసమే చూస్తున్నాను" చూపు మరల్చి చెప్పింది కోటమ్మ.

రాజయ్య అన్నాడు :

"ఒకచోట, రెండు చోట్లా! అంతా శివ మయమే..." అంటూ నవ్వుతూ కాలు కదిపాడు - రాజయ్య

"పొద్దు పోకముందే యిల్లు చేరుకోరా... అంటే వినడు గదా; సూర్యుడితో వెళ్తాడు— చంద్రుడితో వస్తాడు. ఏరికిబాగులోడు ..." తనలో తాను గొణుక్కుంటూ చూపును మరో వేపు మరల్చింది కోటమ్మ.

ఆమెకు అరవై ఏళ్ళు!

శివ—ఆమె మనవడు.

శివను కన్న తర్వాత అతని తల్లి పార్వతమ్మ —శివకు ఐదో ఏట తండ్రి నీలకంఠం—కన్ను మూయడంతో, శివకు తల్లీ తండ్రీ అంతా తనే అయి పెంచు కొస్తోంది-కోటమ్మ.

కోటమ్మకు మనవడు తప్ప మరో ప్రపంచం లేదు.

ఆ వూళ్ళో రైతుల పొలాలకు "మంచె" కాపలా దారుడు—శివ

పగలు —

వరి పొలాలకు, అవి కోసిన తర్వాత — మొక్కజొన్న తోటలకు కాపలా కాస్తూ చిలకలు. పక్షులు కాయ ధాన్యాలు తినేయ కుండా రేకు డబ్బా వాయించుకుంటూ, 'తాడు ఉట్టి'తో రాయిని విసిరి కొట్టిడుస్తూ పక్షుల్ని అదిలిస్తుంటాడు

రాత్రులు పంది కొక్కులు, నక్కలు చేలకు పంటల్ని నాశనం చెయ్యకుండా కాపలా ఉంటాడు—మంచె మీద.

ఇలా ఐదారు మంచెల దగ్గరకు తిరుగుతూ, రాత్రీ పగలూ, పంట పొలాల్ని రక్షించడం, రైతులిచ్చిన కొద్దో గొప్పో ధాన్యాలు, రోజు కూలీ తీసికోవడం అతని వృత్తి.

మంచె మీద కూర్చున్నప్పుడు అటుగా బాల కనిపిస్తే ... "అదిగో, గోలది ... ఎక్కడే...?" అని డబ్బా వాయిస్తూ గొంతెత్తి కేకేస్తే, ఆ చుట్టు పట్ల ఉన్న

కాలువ గట్లంట, కొండ వాలుల్లో ఎక్కడున్నా...ఏం చేస్తున్నా, 'నే నిక్కడే,' అడవి లేడిలా చెంగు చెంగున పరుగెత్తు కొస్తుంది-బాల సుమారం మంచి బాల రావడం గమనించి, గబగబా మంచె దిగి ... పొలంలో నుండి పొంచి పొంచి పాకు కుంటూ యింకో మంచె దగ్గరకు పోయి-కన్పిస్తాడు- శివ. బాల అక్కడికి పరుగెత్తుకెళ్ళేసరికి... యింకో మంచె దగ్గరికి మాయమై అక్కడ ప్రత్యక్ష మవుతాడు శివ.

శివ కంటికి బాల ఒక ప్రబంధ కన్య. ఆమె నడిచి వస్తుంటే ... నీల నాగు పాకు తున్నట్టు, సెలయేరు పారుతున్నట్టు అన్పిస్తోంది.

పిక్కల వంటి ఉన్న లంగా — అందంగా ఆమె పచ్చని పాదాలకున్న గజ్జెలు, మయూరి నాట్యం లాంటి ఆమె నడకకు లయబద్ధమైన తాళం వేస్తాయ్.

పడుచు భారాన్ని మోయలేక చిగురు టాకులా అల్లాడు తుంటుంది ఆమె సన్నని నడుం. ఉన్నతమైన ఆమె వక్ష ద్వయం— రెండు కొండ గుట్టల నడుమ పారే సెలయేటిలా ఉన్న వల్లెవాటు గాలికి రెక్కలు విప్పుకున్న శ్వేత విహంగంలా ఎగిరెగిరి పడుతుంటుంది.

పిరుదులు దాటిన నల్లని జడ కోడె తాచులా కదులాడు తుంది.

గళంలో పీడలు ప్రకృతిలోని పీరెండలా మెరుస్తాయ్.

ముద్దొచ్చే ముద్దబంతి లాంటి ఆమె ముఖ పద్మంపై, ముసిరిన గండు తుమ్మెదలా నల్లని ముంగురులు సుతారంగా కదులాడ్తాయ్.

అప్పుడు — పడి లేచే కెరటంలా ఆమె గుండె ఎగిసెగిసి పడుతుంటుంది, కోటేరు లాంటి ముక్కు, ఆరపండిన దొండ పండు లాంటి అధరాలు, కలువరేకుల్లాంటి కళ్ళు. శిరసు నుండి సిరిపాదం వరకూ ఒక్కసారి చూస్తే ఎక్కుపెట్టిన విల్లులా — నీలా కాశంలో విరిసిన అందమైన హరివిల్లులా తోస్తోంది.

అందుకే —

శివకి ఆమెలోని ప్రతి అణువూ — అందం గానూ, ఆరాధ్యనీయంగానూ కన్పిస్తుం టుంది.

"అమ్మమ్మా : ఏమిటే అలా చీకటోకి చూస్తూ నిలబడ్డావ్ ?"

— శివ గొంతు వినడంతో ఒక్కసారి ఉల్కిపడి తిరిగి చూసింది- కోటమ్మ

శివ ఎదురుగ్గా నిలబడి వున్నాడు, మనవణ్ని చూడ్డంతో ఒక్కసారి ఆమె కళ్ళు తళుక్కుమన్నాయ్.

"అబ్బా! ఎన్నిసార్లు చెప్పాల్రా నీకు ? కాస్తంత పొద్దుగూకక ముందు కొంపకు చేరుకోరాదూ! ఈ చీకట్లో పురుగూ పుట్రా తిరుగాడు తుంటాయ్. కన్ను పొడుచుకున్నా ...కానరాని చీకటి..." అంటూ యింట్లోకి కదిలింది కోటమ్మ

"ఏందుకే అంత భయం. ఆ పురుగూ, పుట్రకూ — నాకు జీవనాధారం ఆ గట్లూ, పుట్టే కదా! అందుకని అవి నన్నేమీ చేయవులే..." అంటూ ముసలమ్మ అమాయ కత్వానికి నవ్వేశాడు శివ

గబ గబా నూతి దగ్గర స్నానం ముగిం చాడు శివ ఈ లోగా 'గిన్నెలో' అన్నం పెట్టి, సిద్ధంగా కూర్చుంది కోటమ్మ

క్షణాలు, నిమిషాలు దొర్లిపోతున్నాయ్.

శివ అన్నం దగ్గరకు రాలేదు.

"ఒరే.. శివయ్యా!"

కేకేసింది - కోటమ్మ

జవాబు లేదు.

పైకి లేచింది. పక్కగదిలోకి వచ్చింది

'శివ' పెద్ద అట్ట మీద - బొగ్గుతో 'బొమ్మ' గీయడంలో నిమగ్నమై వున్నాడు.

బొమ్మ పక్కనే కిరసనాయిలు బుడ్డి ఉంది. చుట్టూ ఉన్న చీకటిని తన శక్తి కొలదీ — దూరంగా తరిమెయ్యాలని విశ్వ ప్రయత్నం చేస్తూ వెలుగుతోంది.

కోటమ్మ 'బొమ్మ' వేపు కళ్ళు చిట్లించి దగ్గరకు వచ్చి మరీ చూసింది·

ఆ 'బొగ్గు' బొమ్మలో— 'బాల' రూపం జీవం పోసుకుంటోంది ..

* * *

బాల పిల్లిలా ఇంట్లోకి అడుగు పెట్టింది.

ఆమె నెత్తి మీద 'చీపురు పుల్లల కట్ట' ఉంది.

పొందికగా వాటిని పట్టుకుంది. చుట్టూరా చూస్తూ, అడుగులో అడుగు వేసుకుంటూ మరొక్క అడుగు ముందు కేసింది.

"బాలా!"

ఉరుము లాంటి పిలుపు! ఉలిక్కిపడింది బాల.

చప్పున తల తిప్పింది

లోపల్నుంచి గబగబా బయటకు వచ్చాడు - సత్యం.

సత్యం బాల అన్నయ్య.

వయస్సు ఎనభై ఏళ్ళుంటాయ్.

"ఇంత సేపూ ఏం చేస్తున్నావ్? వెక్కడున్నావ్? ఆ 'శివ' గాడితో ఆడుతూ, పాడుతూ, గెంతుతేనూ వుంటే తెలీదను కున్నావా? చూడలేననుకున్నావా?" సత్యం చిందులు తొక్కుతూ గర్జిస్తోంటే బాల - బేలగా ఆమె ముఖం చిన్నబోయింది. కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయ్. నెత్తి మీదున్న చీపురు పుల్లల కట్ట అప్రయత్నంగా జారి నేలమీద పడింది.

- బాల ఆ ఊరి పరిసరాల్లో, వున్న - కొండల్లో, కోనల్లో చీపురు పుల్లలు విరుకు వస్తే - వాటిని కట్టలు కటి - సంతలో అమ్మకు రావడం సత్యం పని- అదే- వాళ్ళ వృత్తి.

"రోజా మొత్తుకుంటున్నాను. పొద్దు గుకేముందు కొంపకు చేరమని - అసలు నా మాటంటూ ఎవరైనా వింటేగా! అలికి భయమూ లేదు చెల్లెలికి భక్తీ లేదు'- అని అంటానని గదూ అదిరిపోయావ్ ...! పిచ్చి చెల్లెమ్మా ...!" అంటూ పగలబడి నవ్వేశాడు సత్యం.

అదిరిపోయి...

బాల ఒక్కసారి గాఢంగా నిట్టూర్చింది.

"అబ్బా! చంపేశావ్ గదన్నయ్యా!" అంటూ చుట్టూరా కలియజూసింది వెంటనే సత్యం వేపు తల తిప్పింది "అన్నయ్యా' వదిన ఎక్కడ?" అని ఆత్రుతగా అడిగింది!

"రామకోవెలకు వెళ్ళింది పురాణ కాల క్షేపం జరుగుతుందో ఏమో.. తిష్ఠవేసుకొని కూర్చుని వుంటుంది" అన్నాడు - భార్య ఆ సమయంలో యింట లేనందుకు సంబరపడి పోతూ.

సత్యం భోళా శంకరుడు.

భార్య కనకం అంటే అతనికి సింహస్వప్నం. ఉరిమి గద్దించిందంటే ఊగాతల పడతాడు. కనుసన్నల్లో తే పులిలా ఉంటాడు కళ్ళెదుట ఉంటే పిల్లిలా అయిపోతాడు

"అయితే వదినె యింట లేకపోవడం అన్న మాట యీ అన్నయ్య ఆనందానికి కారణం"

ఆంటూ సంతోషంతో ఎగిరి గంతేసింది బాల.

"మరేమనుకున్నావ్!" అని-"అదీ చూడమ్మా! ఏ క్షణాన్నైనా గుడికి వెళ్ళిన మీ వదిన రావచ్చు ఆమె రానంతవరకు పుణ్య కాలం. ఈలోగానే పట్నంనుండి నీకేంతెచ్చానో చూపిస్తానుండు" అంటూ గబగబా ఓ చిన్న అట్టపెట్టె తెచ్చి తెరిచాడు.

జడ కుచ్చులు!

బాల కళ్ళు తళుక్కుమన్నాయ్.

ప్రపంచమంతా 'ఇంద్రధనస్సు'లా కనిపించింది

కోటివీణల మధురరాగం వినిపించింది.

శతకోటి చంద్రుల చల్లదనం అనిపించింది.

ఆమె మనసు తేలి మబ్బుపై తేలి పోయింది'

"అబ్బ! ఎంత అందంగా వున్నాయ్!" అమాంతంగా జడకుచ్చులను చేతిలోకి తీసికొని ఎగిరి గంతేసింది బాల.

చెల్లెలి ముఖంలోని ఆనందాన్ని తృప్తిగా చూస్తూ నిలబడిపోయాడు - సత్యం. ఇన్నాళ్ళకు బాలకోరిక తీర్చగలిగినందుకు అతని మనసు కూడా ఎంతో తేలిక పడింది.

"అమ్మా బాలా! ఒక్కసారి 'ఆ జడ కుచ్చులు పెట్టుకొని నా కళ్ళకు కని పించవూ!"

"అలాగే అన్నయ్యా!" చెంగున గెంతు కొని లోనికి పరుగెత్తింది - బాల.

బాల వెళ్ళిన తర్వాత సత్యం ఆలోచనల్లో పడ్డాడు.

'వదినకు తెలీకుండా పెట్టుకో బాలా' అని చెల్లెలికి చెప్దామనుకున్నాడు. కాని, ఈలోగానే బాల లోనికి పరుగెత్తింది.

వద్దంటే ఆమె మనసు ఎంత గాయ పడు తుందో!

ఒకవేళ - కనకం వస్తే,

అమ్మో! తనను బతకనిస్తుందా? రాచి, రంపాన పెట్టదూ! పట్నం వెళ్ళి చీపురు కట్టలు అమ్మితెచ్చిన డబ్బేదని అడిగితే తనేం సమాధానం చెప్పాలి? అసలు 'జడకుచ్చులు' కొనాలనే ధైర్యం ఎలా వచ్చింది?

చెల్లెలి కోర్కె తీర్చాలనే తపనా?

అన్నగా తనామాత్రం చేయలేనసే మొండి ధైర్యమా'

ఏమో!

పట్నంలో షాపులో - అందంగా 'జడ కుచ్చుల' కనిపిస్తే కొనేశాడు

నిమిషాలు దొర్లిపోతున్నాయ్! ఆలోచనలు మాత్రం తెగలేదు.

"అన్నయ్యా!"

అమాంతంగా ఊహలోంచి తేరుకున్న సత్యం తల తిప్పి చూశాడు.

బాల!

'జడకుచ్చులు' ధరించిన తన చెల్లెలు.

పచ్చపావడా కట్టుకొని, ఆ దేరంగు వణి వాటు వేసుకొని, పూల జడతో- జడకుచ్చులతో కళ్ళెదుట కనిపిస్తోన్న బాలను చూడ్డంతో ఒక్కక్షణం తనను తానే మరిచి పోయాడు సత్యం.

"ఈ బంగారుపువ్వు ... నా రక్తం పంచుకు పుట్టిన చెల్లెలా...!" అంటూ తదేకంగా బాలను చూస్తోంటే, ఆమె నెమ్మ దిగా వచ్చి సత్యం పాదాలకు నమస్కరించింది.

సత్యం హృదయం ద్రవించింది.

"నా బంగారు తల్లీ! నూరేళ్ళు వర్థిల్లమ్మా!" అంటూ చెల్లెల్ని పైకి లేవనెత్తి హృదయానికి హత్తుకున్నాడు సత్యం.

అతని మనసు ఒక్కసారి గతంలోనికి జారు కుంది.

తనను ఒక యింటివాణ్ని చేసి తండ్రి కన్నుమూశారు కనకంతో కాపురం మొద లెట్టిన సంవత్సరం తిరగకముందే కన్నతల్లి మంచం పట్టింది తిరిగి లేవలేదు. బాలను తన చేతికప్పగించి, "ఒరే సత్యం! ఇకపై బాలకు తల్లీ, తండ్రీ అంతా నువ్వేరా! ఎలా చూసుకుంటావో!" అని చెప్పి. ఆమె ఈ లోకంనుండే వెళ్ళి పోయింది.

తేనెపట్టును ముసిరిన తేనెటీగల్లా తన మనసును గజిబిజిగా ఆక్రమించుకున్న ఆలో చనల్లోంచి తేరుకొనేసరికి సత్యం హృదయం బరువెక్కింది.

సరిగ్గా అదే సమయంలో—

దూరంనుంచి మృదుమధుర, మంజుల మనోహర గానంతో 'శివ' గొంతెత్తి పాడడం లీలగా విన్పించింది.

ఒక్కసారి సత్యం తేరుకున్నాడు.

బాల మనసు వావ పాటవేపు మరలింది

"అమ్మా! బాలా! మంచె దగ్గర్నుండి శివ నీకు సంకేతం పంపాడు. వెంటనే వెళ్ళి

ఒక్కసారి ఈ జడకుచ్చులతో కనిపించి రామ్మా!'' అనాడు వెల్లెలితో సత్యం.

బెదిరింది బాల. బేలగా చూసింది.

''నేనా!''

''అవునమ్మా! నిన్నీరూపంలో శివచూస్తే, బింతో ముచ్చట పడతాడు వెంటనే వెళ్ళి, మీ వదినె వచ్చేలోగా వచ్చేసెయ్ తల్లీ!'' అంటూ తొందర చేశాడు

అంతే! బాల మనసు తొలిమబ్బులా తేలిపోయింది పూలరథంలా పరుగెత్తింది.

పంజరంలోని రాచిలక రెక్కలు విప్పుకొని వినువీధిలో విహరించినట్లు—మనసు శివసన్నిధి కెగసిపోయింది.

పున్నమి కాంతను చూసి, పొంగిపోయే సాగరం ప్రియునిలా ఉవ్వెత్తున ఉప్పొంగింది.

చెట్లూ, గట్లూ దాటి తూనీగలా ఎగిరి పోయింది మంచెమీదున్న శివదగ్గరకు.

*   *   *

పండువెన్నెలో —

పూలపందిరిమీద నిలబడి 'పూబాల' రాక కోసం ఎదురుచూసే తుమ్మెదరాజులా వెయ్యి కళ్ళతో చూస్తూ—కోటి వీణల రాగ మాధుర్యంతో పాటలో నిమగ్నమై వున్నాడు శివ.

ఆ గంధర్వ గానానికి—

నీలాకాశ లోవున్న తారలు ఒక్కసారి తళుక్కుమని తొంగిచూశాయ్ తమ్ము తాము మరిచిపోయాయి. ఒక్కక్షణం తర్వాత తమను కాదని తెలుసుకొని చిన్నబోయి మరల మబ్బుల చాటుకు మాయమయ్యాయి.

ఆ సహజ సజీవ మధుర రాగాలాపనకు పిల్లవాయువులు ప్రాణం పోసుకొని పరుగెత్తి వెళ్ళి, బావకోసం తరలి వస్తోన్న బాలకు ఉత్తేజం కలిగింది ఆమె నడకకు మరింత వేగం హెచ్చించేలా చేశాయ్.

గుడిలో జేగంటలు—

నెలరాజు రాకను చూచి, తమ తమ నెలవులకు చేరుకుంటున్న పక్షుల సమువాయం, శివ పాటకు మైమరచి తమ్ము తాము మరిచి పోయాయి.

కొండలు ప్రతిధ్వనించి, కోనలు మురిసి పోయాయి.

సెలయేళ్ళు తమ పరుగును మర్చి పోయాయి.

మొత్తం ప్రకృతే...పులకించి పోయింది.

దూరం నుంచొస్తున్న 'బాల'కళ్ళు ఒక్క సాగి 'మ చెమీదున్న బావను చూశాయ్.

కలువకన్నె కటాక్షం కోసం లేచిన నెల రాజులా.

సప్తాశ్వాల రథంమీద అఖిల చరాచర ప్రపంచాన్ని పరిపాలించే సూర్యదేవునిలా...వెలిగి పోతున్నాడు—శివ.

బాల, ప్రకృతి కాంతలా పులకించింది.

అంతవరకూ బాల, కంటబడకపోవడంతో శివ మరింత వేగంతో రాగాన్ని ఆలపించి, మేఘాలతో ప్రాధేయపడ్డాడు.

అప్పుడు—

మేఘాలు చంద్రుని దగ్గరకు పరుగెత్తి ఒక్కసారి ఆ ప్రియుని కోరిక తీర్చమని నెల రాజును అర్థిస్తే —ఆ చల్లని చంద్రుడు తారా మణుల బిగి కౌగిలినుండి విడివడి, చిరు నవ్వుతో ముందుకు వచ్చాడు.

అంతే!

పూర్ణచంద్రోదయ వింతకాంతుల సోయగాలతో 'బాల' రూపం తళుక్కుమంది.

బాలకంటబడడంతో ఒక్కసారి శివగంధర్వ గానం మరిన్ని మలుపులు తిరిగి, సొంపులు సంతరించుకుంది.

ఒక్కుదుటున మంచెమీదనుండి కిందికి ఉరికాడు—శివ.

ఒకవేపు బాల—

మరోవేపు శివ—

.. వాళ్ళిద్దరూ ఏకమైతే కనులపండువుగా చూడాలనే తపనతో పైన చంద్రుడు ...ఒకర్ని మించిన వేగంతో మరొకరు పోటీ పడుతుంటే.. తారలు పరుగెడుతున్నాయ్.

పూబాలలు పొంచి చూశాయ్.

అమాంతంగా ముందుకు వచ్చిన శివ ఒక్కసారి—జడకుచ్చులతో పచ్చపావడతో—హాఫ్ శారీలా

అజంతా సుందరిలా...

అపురూప సోయగాలతో దివ్యదేవతా మూర్తిలా సాక్షాత్కరించిన బాలను చూడ్డంతో కళ్ళు తళుక్కుమన్నాయ్.

బాల చుట్టూ తిరుగుతూ ఆమె అంద చందాలను కళ్ళతోనే జుర్రుతూ కొన్నిక్షణాలు ప్రపంచాన్నే మరిచిపోయాడు శివ.

''బాలా!'' అంటూ చేతులు ముందుకు చాచాడు.

''బావా!'' అంటూ బాల బావ గుండెలపై వాలిపోయింది

ఎందరో ప్రేయసీ ప్రియుల ఆలింగనాలకు అభియోగం కల్పించిన నెలరాజు మావీ, మాధవీ లతల్లా పెనవేసుకున్న శివ—బాలల సుందర దృశ్యానికి సిగ్గుపడి, మబ్బుతెరల చాటుకి తప్పుకున్నాడు ఒక్కక్షణం.

శివ బాలల ఆనందానికీ ప్రకృతిమాత పరవశించింది. అశ్వని దేవతలు శుభాశీంతలు



## ప్రేమ దేవత

కురిపించారు. గుడిలో జేగంటలు ప్రతిధ్వనించాయ్. ముక్కోటి దేవతలు ఒక్కటై దీవించారు.

"శివ—బాలలు" "శివ — పార్వతు"లాలయం చేరుకున్నారు గుడిబయట 'ఆకాశ దీపం' వెలుగుతోంది.

ఆ ప్రేమ జీవుల ముద్దు — ముచ్చటకు ఆదిదంపతులు ఆచ్చెరువొందారు.

అతని ఊహాలోకం బాల!

బాల కలల పంట బావ!!

"బాలా! ఈ జడకుచ్చులతో నిన్ను చూస్తుంటే ప్రపంచాన్ని జయించినంతటి సంతోషంగా ఉంది నాకు" అంటూ బాలను అమాంతంగా హృదయానికి హత్తుకున్నాడు

బావ ఒడిలో బాల సిగ్గులమొగ్గై పరవశించిపోయింది

"బాలా! ఊహ తెలిసిన వయసునుండీ ఈ దేవాలయం దగ్గరే ఆడుకున్నాం. పాడుకున్నాం. పెరిగి పెద్దవాళ్ళమయ్యాం ఆ శివపార్వతులే మనకు అప్తులయ్యారు. ఈ శివాలయ ప్రాంగణమే మనకు నివాసమైంది. అందుకు ఈ ఆదిదంపతులే సాక్ష్యం..." అని శివ అంటే—"ఒక్క శివ పార్వతులే కాదు. ఈ దేవాలయం గోడమీద నువ్వు గీసిన బొమ్మలన్నీ సాక్ష్యాలే" అంది బాల నవ్వుతూ.

ఆమె 'జడకుచ్చు'లను శివ తన చేతిలోనికి తీసికొన్నాడు.

వాళకు ఎదురుగా వున్న కోతిబొమ్మ దగ్గరి కొచ్చారిద్దరూ!

"నీకు గుర్తుందా బాలా! ఈ కోతి బొమ్మ ఎప్పుడు గీశానో..."

"నా పదో ఏట ..!"

—శివదృష్టి ఆ పక్కనే జడకుచ్చులతో వున్న 'చినారి బాల' బొమ్మమీద పడింది.

"ఇదీ?" రెండో బొమ్మను చూపిస్తూ ప్రశ్నించాడు—శివ.

"నా పన్నెండో ఏట! 'జడకుచ్చులు' కావాలని ఇంటి దగ్గర మారాంచేసి వచ్చేస్తే, నువ్వు బొమ్మగీసి నన్ను సంతోష పెట్టావు...

ఇలా ...!

ఆ పల్లె ప్రేమికులు గత మధుర స్మృతుల్ని తలంచుకుంటూ తన్మయులై వుండగా —

(ఇంకా ఉంది)

### పి. ఎస్. జె. పుష్పల తాడేపల్లి

నా ఫ్రెండు ఒకతన్ని ప్రేమించింది. అతను కూడా ప్రేమించాడు. వాళ్లిద్దరూ యిప్పుడు జూనియర్ ఇంటర్.

చాలు చాలు. సినిమాలు పాటం బాగానేచెప్తున్నాయి! భానుమతీ రామకృష్ణ గారన్నట్లు కిండర్ గార్టెన్ ప్రేమకథలకు చాలా చేరువలోనే ఉన్నట్లు అనిపిస్తోంది. సిగ్గుచేటు.

### వి. జి. ఆర్. రామండి

నాకు పరిచయం లేని అమ్మాయితో మాట్లాడుట జరుగుటకు నేను ఏమి చేయవలయును? ఆమె మంచి చెడు గురించి ఎట్లు తెలియును?

మీ మగాళ్లతో చాలా చిక్కయ్యా! మీరు పల్కరిస్తే అమ్మాయి పల్కితే — ముక్కూ మొఖం తెలియని వాడు పల్కరిస్తే మాట్లాడింది. మంచిదెలా అవుతుందంటారు! పల్కరించక పోతే ఎంత పొగరు అంటారు, ఎలా?

### పి. ? ఆర్. నడగాం

ప్రజాభివృద్ధి కోసం నాయకులవుతున్నారా? లేక స్వార్థం గూర్చి అగుచున్నారా?

స్వార్థమూ లేక సౌఖ్యము లేదు. విన లేదా? అయినా, తనకు మాలిన ధర్మం, ఇంట చూపని దాన గుణం వుంటాయిటయ్యా పిచ్చి గాని.

జ్ఞానం గూర్చిచదువుతున్నామా? ఉద్యోగం వస్తుందనా?

డిగ్రీ వుంటే ఉద్యోగం ఖాయం అన్న దీమా వుంటే అనుకోవచ్చు. ఇప్పుడా బెంగ లేదు కదా. ఇక జ్ఞానం పాఠ్య గ్రంథాలలో వుంటుందా? చెప్తున్న గురువర్యులలో వుంటోందా? నేటిలో వున్నా— విద్యార్థులకి కుతూహలం వుందా?. . . చదువీ రోజుల్లో కాలక్షేపం!

### కె. ఆర్. ఎస్. బెంగుళూరు

ఆడది ఎప్పుడూ స్వార్థ పరురాలు. ఆడదాన్ని శారీరకంగా మానసికంగా సగం చంపేస్తే గాని ఆ సంసారం సుఖంగా ఆనందంగా వుండదు అని భరించలేనంత బాధ కల్గిస్తూ వుంటే భర్తని ఏమనాలి?

రాక్షసుడు. సగం చచ్చిన మనిషితో — సుఖం ఆనందం చూడ కల్గిన వ్యక్తి — రాక్షసుడి కంటే హీనం. మెంటల్, ఫిజికల్ క్ర్యూయెలిటీ భరించరానిది. పదిళ్లలో అంట్లు తోమినా బ్రతకవచ్చు అటువంటి భర్త పంచన పడివుండేకంటే?

### వి. ఎన్. - నునబెడ

కొందరు మగవాళ్లు ఆడ పేర్లు పెట్టుకొని కథలు ఎందుకురాస్తారు?

ఆడపేరు వల్ల కథ అచ్చవుతుందన్న భ్రమతో కొందరు, అసలు పేరుతో అలాంటి కథలు రాస్తే పరువుపోతుందని కొందరూ, ఆడ పేరుతో ఏం రాసినా ఫరవాలేదన్న దీమాతో కొందరూ ఉద్యోగం ప్రభుత్వం దయితే— ముప్పు రాకుండా కొందరూ. . . . ఇలా ఎన్నో కారణాలు.




### పి. ఆర్. డి. గుంతకల్

మా స్నేహితులు ఫ్రెండ్ సహాయంతో గుళ్లో పెళ్లి చేసుకున్నారు. ఇప్పుడు ఇరుగుపొరుగులు కోర్టు కెడతామని భయపెడుతున్నారు.

పెళ్లి అబద్ధం కానప్పుడు — ఆ గ్రూపు ఫోటోలో వద్ద మీ కెందుకు భయం? ఇలాంటి పిరికి తనం వల్లనే — ఒక తప్పుకి నాల్గు తప్పులు చేయడం జరుగుతుంది.

### ఎస్. ఎన్. కవిగిరి

ప్రేమించిన వాడు తన ప్రియురాలికివ్వవలసిన మొట్ట మొదటి కానుక ఏది?

గౌరవం. అదివ్వలేని నాడు ఎంత విలువైన కానుకలిచ్చినా ఒకటే!

### పి. పి. పి. ఎన్. ఇల్లెందు

మన దేశంలో అరాచకాలు ఎప్పుడు నశిస్తాయి?

ఏ దేశంలోనూ ఇవి పూర్తిగా నశించిపోవు. పరిస్థితులను పొలిటీషియన్లను పట్టి — హెచ్చుతూ తగ్గుతూ వుంటాయి!

### పి. హెచ్. ఆర్. భీమవరం

అన్నిటికంటే రక్త సంబంధం గొప్పది. అంటారు. కాని ఆస్తి కోసం ఉన్న ఒక్క కొడుకుని దూరం చేసుకున్న తల్లి తండ్రుల నేమనాలి?

దూరదృష్టి కలవారు. ఆస్తి చేతికి వచ్చాక పుత్ర రత్నం ఆదరిస్తాడన్న గ్యారంటీ ఏమిటి?!

### కె. వి. కె. ఆర్. - కొండూరు

ప్రేమకు నిర్వచనం తెలియని వారు, తెలిసిన వారిని ప్రేమిస్తే?

శుభం. తెలుసుకోవచ్చు!

### ఆర్. ఆర్. ఆర్. - ఆదోని

రచనలు వ్రాయడం నాకు హాబీ. . .

నాకు కాదు!

నటసామ్రాట్ డా. అక్కినేని నటన పై మీ అభిప్రాయం?

నటనలో డాక్టరే!

### శేఖర్ - తిరుపతి

జీవితం అనిర్వచనీయం. అది అంతులేని ఎడారి. ఇది నా అభిప్రాయం.

ఏమిటి? ఎం. ఏ. చదువుతూ ఎంత ఉత్సాహంగా ఆలోచిస్తున్నావయ్యా బాబూ. జీవితాన్ని ఛాలెంజి గా తీసుకోవాలి మరీ అలా డల్ మొంగోజా ఒక టర్ఫ్ లాగా వుండ కూడదు. బిల్ అవ్ గ్రేయం వాన్,

### డి. వి. వి. ఎల్. - కాకినాడ

అబద్ధాన్ని నిజంగా నిజాన్ని అబద్ధంగా నిరూపించ కల్గుతున్న నేటి యీ సమాజంపై మీ అభిప్రాయం?

మనుషుల్ని, అవసరాన్ని, అవకాశాన్ని పట్టి— మాట్లాడ్డం అలవాటు చేసుకోకపోతే, నెగ్గుకురాలేం అని చదువు చెప్పని బుద్ధులు నేర్పిస్తోంది.

### ఎస్. ఆర్. - వెంకటగిరి

మీరు ఎక్కువగా ఆడ వారిని సమర్థించి మాట్లాడుతారు. మీరు ఆడవారు కాబట్టే అను కొంటాను.

అప్పుడు స్వజాతి పట్లవైరం సహజం అనేమాట తప్పన్న మాటేగా. . న్యాయం ఎటు వుంటే అటు మాట్లాడాలని నా నమ్మకం.



# తోటు

కె.కె.రఘునందన



ముప్ఫైటగా ముప్ఫై యేళ్ళపాటు అనుభవించిన దాంపత్య జీవితం మూడేళ్ల క్రితం ముగిసిపోయినందుకు చింతిస్తున్న జానకమ్మ ఎదురుగా గోడకు వ్రేలాడుతున్న భర్త ప్రభాకరశాస్త్రి ఫోటోవంకచూస్తోంది.

భర్త ఫోటో చూసిన ఆమెలో ఏవో ఆలోచనలు ముసురుతున్నాయి. గుండెల్లో చిమ్మచీకటిలా ఆవేదన ఆవరించుకుంది.

వెను వెంటనే ఆమెకు— భర్త బ్రతుకు చీకటి అంచున నిల్చుని చెప్పిన మాటలు జ్ఞాపకొచ్చాయి.

"జానకీ! నేను పోతున్నానని నువ్వు బాధ పడకు. గడచిన జీవితం ఒక కల అనుకో. మన కలలకు ప్రతి రూపాల్లుగా నిలిచిన మన పిల్లల భవిష్యత్తుల్ని బంగారు బాటలో పయనింప చేయడానికి కృషిచేయి. అంతేగాని నేను పోయిన మరుక్షణం పిరికిపందలా నీ కెవరూ లేనట్టు— నీ చుట్టూ ఉన్న సమాజం నిన్ను వెలివేసిందనే భావనతో క్రుంగిపోకు. ఏ మనిషీ కలకాలం ఉండిపోడు. నేను బ్రతికి వన్నాళ్ళు జీవితాన్ని ఎలా నెట్టుకొచ్చానో నీకు తెలియనిది కాదు. నువ్వు కూడా ధైర్యంతో ముందడుగువేసి పిల్లలకు మంచి సంబంధాలు తెచ్చి పెళ్ళి చేయి."

ఒక్కసారిగా జానకమ్మ కళ్ళల్లో నీళ్ళు ఉబికాయి. మనసులో కలవరం రేగింది.

ఆమె మనసులో గతం నీలి నీడలు విశృంఖలంగా పరిభ్రమించసాగాయి. ఒకప్పటి భర్త జీవితం గుర్తుకొచ్చింది జానకమ్మకు.

* * *

ప్రతి మనిషిలో ప్రవహించే రక్తం ఒక్కటే అయినా ఆమనిషి ఏర్పరచుకున్న కట్టుబాట్లు ఆచార సాంప్రదాయాలు విభిన్నమైనవి.

సాంప్రదాయాన్ని అనుసరించి నడిచిన వాళ్ళే అధికం కాని సాధారణంగా దాన్ని ఎదురించిన మనుషులు అరుదుగా కనిపిస్తారు.

ఆ అరుదైన వ్యక్తుల్లో ప్రభాకరశాస్త్రి గారొకరు. ఉన్నతమైన బ్రాహ్మణ వంశంలో పుట్టారు. ఆయన తండ్రి శంకరశాస్త్రి ఆచార సాంప్రదాయాలను నరనరాల్లోంచి జీర్ణించుకున్న వ్యక్తి.

మనిషిలో ఉద్భవించే సహజమైన అహంకారానికి ప్రతినిధి. కులమత జాతి విభేదాలు పుష్కలంగా వున్నవాడు. అగ్రవర్ణాల వారితో సమానంగా నీచకులస్తులు జీవించకూడదనేది ఆయన సిద్ధాంతం.

తండ్రి అభిప్రాయానికి పూర్తి విరుద్ధం ప్రభాకరశాస్త్రి. తండ్రి మాటలనువీలప్పుడూ ఖండించేవారు. అన్ని జాతులు సమానంగా బ్రతకాలనేది అతని ఆశయం.

ప్రభాకరశాస్త్రి దిగువ జాతుల వాళ్ళతో స్నేహం చెయ్యటంతో— అదే శంకరశాస్త్రి గుండెల్ని భగ్గుమనిపించింది. లోకంలో తన కొడుకే యింత నీచంగా ప్రవర్తిస్తే కులంలో గౌరవం సన్నగిలుతుందని కొడుకును తన దార్లోకి తెచ్చుకునేందుకు శతవిధాల ప్రయత్నించారు. కాని ప్రభాకరశాస్త్రి లొంగలేదు.

అదే రోజుల్లో ప్రభాకరశాస్త్రి క్రాఫింగు పెట్టడం జరిగింది. అది బ్రాహ్మణ కులంలో తగనిపని కావటంవల్ల క్రాఫింగు తీసి- పంచశిఖలు పెట్టుకుంటేగాని వీల్లేదని భీష్మించుక్కూర్చున్నారు శంకరశాస్త్రిగారు.

తండ్రిని మించిన పట్టుదలకల ప్రభాకరశాస్త్రి 'క్రాఫింగు ఉంటే ఏమిటి తప్పు' అని వాదించడం మొదలెట్టాడు.

అప్పటికే లోకం నోళ్ళు నొక్కుకుని— గుసగుసలాడింది. ఎక్కడ చూసినా ప్రభాకరాన్ని వింత మృగంలా చూసేవారు.

పెళ్ళి భోజనాలకు పిలవటం మానుకున్నారు. ఊర్లో ఏ సందడి జరిగినా ప్రభాకరశాస్త్రి చేసిన పనికి— ఆ యింట్లో వాళ్ళని కూడా ఆహ్వానించడం మానేశారు. ప్రభాకరశాస్త్రి వీధిలో కెళితే తలుపువేసుకునే

# లోటు

వారు. అంటరాని వాడిలా అసహ్యించుకునేవారు.

కొడుకు చేసిన నిర్వాకానికి శంకరశాస్త్రి గారు తల దించుకోవలసి వచ్చింది. సంప్రదాయం అంటే ప్రాణాలర్పించే ఆయనకు కొడుకు నీచప్రవృత్తి ఆగ్రహావేశాన్ని తెప్పించింది.

వెంటనే ఇంట్లోంచి తగిలేసారు.

అటువంటి తండ్రితో కలిసి జీవించేకన్నా స్వేచ్ఛగా తన కాళ్ళ మీద తను నిలబడాలని నిశ్చయించుకుని కష్టించి పని చేయటం నేర్చుకున్నాడు ప్రభాకరశాస్త్రి.

ఆ రోజుల్లోనే జానకితో పరిచయం జరిగింది. ఆమె కూడా ఏ దిక్కూ లేని అనాధ కావటం వలన ఆమెపై మరింత ప్రేమ పొంగింది ప్రభాకరశాస్త్రికి. అది పెళ్ళి వరకూ దారి తీసింది.

ఓ శుభ ముహూర్తాన జానకిని గుడిలో నిరాడంబరంగా పెళ్ళి చేసుకుని ప్రశాంతమైన వైవాహిక జీవితంలోకి అడుగు పెట్టారు

అదే సమయంలో ఓ చిన్న వ్యాపారం సాగించాడు ప్రభాకరశాస్త్రి, జానకి అడుగు పెట్టిన వేళా విశేషమో ఏమో కాని అనతి కాలంలోనే వ్యాపారం పుంజుకుంది. లెక్కలేనన్ని లాభాలు వచ్చాయి.

మంచి యిల్లు, హోదా, పరువు అన్నీ ఒకదానివెంట ఒకటి వచ్చి ప్రభాకరశాస్త్రి జీవితాన్ని మరింత ప్రభావితం చేసాయి.

ముత్యాల్లాంటి ముగ్గురు పిల్లలు పుట్టారు.

పెద్ద కొడుకు ప్రకాశానికి మెడిసిన్ చెప్పించాడు.

రెండో కొడుకు శ్రీనివాస్‌కి ఎమ్. ఏ. బి. ఇడి. కానిచ్చి హైదరాబాదులో ఓ కాలేజీలో పలుకుబడి ఉపయోగించి లెక్చరర్ ఉద్యోగం వేయించారు.

నిర్మల కూడా ఇంటర్ వరకూ చెప్పించారు.

అయితే అందరి జీవితాలకూ ఓ వెలుగు చూపించిన ప్రభాకరశాస్త్రిగారి బ్రతుకు పక్షవాతం వచ్చి చీకటి అయిపోయింది.

ఎంత మందికో సహాయపడిన ఆయన నిస్సహాయుడవటం అందరికీ బాధని పించింది!

మంచంమీదున్నాకాని మహారాజులా జరిగిందాయనకు డబ్బుకు వెనుకాడకుండా అన్ని రకాల వైద్యాలు చేయించారు కొడుకులు

జానకమ్మ దురదృష్టమో, భగవంతుడి క్రూరత్వమో కాని ప్రభాకరశాస్త్రిగారు మంచంమీదున్న యేడాదిలోపే కాలం చేసారు.

జానకమ్మ అంతులేని దుఃఖంతో విలవిల్లాడిపోయింది. రాజుల దివాణంలా సకల సౌభాగ్యాలతో తులతూగిన ఆ యిల్లు ఒక్కసారిగా- దిక్కుమాలిన స్మశానంలా అయిపోయింది. జానకమ్మలో సౌభాగ్యాలు ముడుచుకుపోయిన దౌర్భాగ్యానికి అంతా విలపించారు ఆమెను మామూలు మనిషిగా చెయ్యడం ఎవ్వరికీ సాధ్యం కాలేదసలు.

అంత కష్టంలోనూ ప్రభాకరశాస్త్రిగారి అయినవాళ్ళు కాని- బంధువులుకాని ఎవ్వరూ వచ్చి ఓదార్చలేదు.

కొడుకులు తల్లిని చిన్నపిల్ల నూరడించినట్టు ఊరడించారు కాని ఆమె కన్నీటి వరదను ఆపలేకపోయారు. నిరాశా నిస్పృహలతో కృంగిపోయిన ఆమెలో రవ్వంతైనా చైతన్యాన్ని కలిగించలేక నిస్సహాయంగా నిలిచిపోయారు.

అదే సమయంలో- చీకటి కుహరాన్ని వెలుతురు రవ్వకాంతిమయం చేసినట్టు మాధవరావు ఆ యింట్లో దీపం వెలిగించడానికి నడుం కట్టాడు

మాధవరావెవరో జానకమ్మకు తెలీదు

ఓ రోజు ఒకాయన వచ్చి- "అమ్మా! నా పేరు మాధవరావు. నేను, ప్రభాకరశాస్త్రి చిన్ననాటి స్నేహితులం. వాడు ఎన్ని కష్టాలు అనుభవించి పైకొచ్చాడో నాకు తెలుసు. పిడుగులాంటి మనిషి చచ్చిపోయాడంటే నమ్మలేకపోయాము, ఏనాడు కుల పెద్దలకు కూడా లొంగని మనిషి విధికి తల వంచవలసి వచ్చింది. అమ్మా! నువ్వు బాధపడకు. మీ అమ్మాయికి తగిన సంబంధం చూసి పెళ్ళి చేయి"- అన్నాడు దుఃఖం పెల్లుబికిన గొంతుతో.

ఆయన మాటలు జానకమ్మలో సంచలనాన్ని సృష్టించాయి. నిండా ఏడాదైనా కానిదే యింట్లో వేడుకలా? దూరంగా వెళ్ళిపోయిన ఆయనను నిర్దాక్షిణ్యంగా మరచిపోయి మేళతాళాలతో- సంబరాలతో పెళ్ళి చెయ్యడమా??

"మీరలా ఆశ్చర్యపోవద్దు. నా మాటలు

అక్షరాలా సత్యం. పాడైపోయిన గుమ్మానికే పసుపు పయ్యమన్నారు పెదలు. వాలిపోయిన వింత టాకుల గుమ్మంలో పచ్చతోరణం తొడగటం మన విధి. మీ కభ్యంతరం లేకపోతే మా అబ్బాయి ఆనంద్‌కి మీ అమ్మాయి నిచ్చి పెళ్లి జరిపిద్దాం అలా చేస్తే నా మనసెంత శాంతిస్తుంది చివరిక్షణాల్లో వాడ్ని చూడలేకపోయాననే బాధ నన్ను వెంటాడుతూనే ఉంది'' అన్నాడు మాధవరావు.

అతను చెప్పిన మాటలు జానకమ్మను విభ్రాంతపరచినా కొంత నిజం లేకపోలేదనిపించింది

మర్నాడే సహాగం నిర్ణయించి పది రోజులో నిర్మల పెళ్లి జరిపించారు.

కూతురు పెళ్లి ఎంతో బాహాటంగా జరిగినా జానకమ్మ గుండెల మారు మూలలోంచి ఏదో చెప్పలేని వెలితి తొలుస్తూనే ఉంది

భర్తను మరచిపోతున్నానేమో నన్న అజ్ఞాతమైన భావన ఆమె హృదయాన్ని పట్టి పీడించసాగింది

రెండేళ్లలో ప్రకాశానికి — శ్రీనివాస్‌కు పెళ్లిళ్లు జరిగిపోయాయి.

జానకమ్మ ఏ కొడుకు వద్ద ఉండటానికి ఇష్టపడలేదు.

ఆ ఇల్లు ఏ దిక్కూ లేనట్టు అయిపోతుందని విడిచి పెట్టాలనిపించలేదు ఆమెకు.

తల్లిని వదిలిపోవటానికి ప్రకాశానికి, శ్రీనివాస్‌కి బాధే అనిపించినా ఉద్యోగరీత్యా వెళ్లిపోక తప్పలేదు

* * *

జానకమ్మ స్మృతిపథంలోంచి బైట పడేసరికి, గుమ్మంలో రిక్షా ఆగింది. అందులోంచి ప్రకాశం-భార్య, పిల్లలు దిగారు.

జానకమ్మ ఆనందానికి అవధి లేకపోయింది.

"ఏమ్మా! ఆరోగ్యం బాగుందా? ఏం అలా ఉన్నావు? ఈ రెండు నెలల్లో ఎంత చిక్కిపోయావో తెలుసా? ఒంటరిగా ఉండి చేతులు కాల్చుకుంటూ వంటావే తప్ప మా దగ్గరకు రావు" వస్తూనే తల్లిని పలకరించి అన్నాడు ప్రకాశం.

రిక్షావాడికి డబ్బులు యిచ్చివచ్చి అత్తగారి పాదాలకు నమస్కరించింది జీవన.

పిల్లలు బిలబిలా వచ్చి "నాయనమ్మ... నాయనమ్మ" అంటూ ఒడిలో వాలిపోయారు! వాళ్లని ఆప్యాయంగా కౌగిలించుకుని ముద్దు పెట్టుకుంది జానకమ్మ.

"ఇలా వస్తావని ఊహించలేదురా ప్రకాశం! ఎప్పుడొచ్చినా ముందుగా ఉత్తరం ముక్క వ్రాసేవాడివి కదా?" అంది జానకమ్మ కొడుకు వంక తృప్తిగా చూస్తూ

"అవునమ్మా! అనుకోకుండానే ఇలా వచ్చాం చానాళ్ల నుంచీ తిరుపతి వెళ్లాలనుకుంటున్నాం— రమేషుగాడికి పుట్టు జుత్తు యిస్తామని మొక్కుకున్నాం కదా! ఇప్పుడైనా తీరేదికాదు. ఎప్పుడూ పేషెంట్లు - హాస్పిటల్‌తోటే సరిపోతోంది. కొంత రిలీఫ్‌గా ఉంటుందని, బయలుదేరాం. ముఖ్యంగా నిన్ను కూడా తీసుకెళ్దామనే యిలా వచ్చాం" అన్నాడు ప్రకాశం.

కొడుకు మాటలు ఆమె మనసును ఆనందపరచినా, ఏదో అస్పష్టమైన వ్యధకు లోనైంది

ఒకప్పుడు తాను భర్తతో కలిసి తిరుపతి వెళ్ళింది ఆ రోజు ఎంత సరదాగా గడిచింది. ప్రసాదం తింటూంటే కోతులు తమని అల్లరి పెట్టడం-దర్శనం కోసం పడిగాపులు పడడం—ఇలా ఎన్నో విషయాలు గుర్తుకొచ్చాయి జానకమ్మకు

ప్రకాశం తల్లి కళ్లలోని కన్నీటి పొరల్ని గమనించాడు అతని హృదయం కూడా ఆర్ద్రతతో నిండిపోయింది.

**రక్షణ**

కంటికి
రెప్ప.
కాలికి
చెప్పు.
ఒకటి
భగవంతుని సృష్టి
మరొకటి
మానవుని సృష్టి.
రెండింటిలోను
ఒకటే
గుణం
రక్షణ

— ఆర్. సి. పుల్లయ్య

"అమ్మా గత జ్ఞాపకాలు నీలి నీడల్లాంటివి అతని మనసు మారు మూలలో తారట్లాడుతూనే ఉంటాయి. వాట్ని మరచిపోయి మామూలుగా బతకటం అలవరుచుకోవాలి. నువ్వు ఎక్కువగా ఆలోచించకు. నీకు ఏ లోటూ రాకుండా చూసుకునే బాధ్యత మాది" ఆర్తి నిండిన స్వరంతో అన్నాడు ప్రకాశం. ఆ గొంతులో అనురాగ రంజితమైన అనుభూతి నిబిడీకృతమైంది.

తల్లి అంగీకార సూచనగా తలూపటంతో తృప్తిగా నిట్టూర్చాడు ప్రకాశం.

మర్నాడు తిరుపతి ప్రయాణం అయ్యారంతా!

ఎందరి కోర్కెలో తీర్చి ఆపద మొక్కుల వాడిగా ప్రసిద్ధిచెందిన శ్రీ వెంకటేశ్వరుని తృప్తిగా దర్శించుకుని - ఆ సాన్నిధ్యంలో రెండు రోజులపాటు ప్రశాంతంగా గడపాలనుకున్నారు.

తిరుపతి కొండపై చూడవలసిన ముఖ్య ప్రదేశాలన్నీ ప్రకాశం అందరికీ చూపించాడు.

ఏది చూసినా జానకమ్మకు తృప్తిగా లేదు. ఏదో లోపం, ఏదో అనుభూతులు ... ఆలోచనలు సాక్షాత్కరించేవి ఆమెలో.

తల్లి ఎందుకంత విరాసక్తంగా ఉందో ప్రకాశానికి అర్థం కాలేదు. తల్లి గుండెల్లో సంతోషాన్ని తనెందువల్ల నింపలేక పోయానని బాధపడ్డాడు తానేం లోపం చేసినది బోధపడలేదు అతనికి.

రెండు రోజుల తర్వాత విశాఖపట్నం చేరుకున్నాడు.

తన వద్ద నాలుగు రోజులపాటు ఉండమని ప్రకాశం ఎంత బతిమిలాడినా జానకమ్మ ఉండలేదు.

ఇంటికి చేరుకునేసరకూ ఆ మనశ్శాంతి లే జానకమ్మకు తల్లిని దిగబెట్టి వెంటనే విశాఖ వెళ్లిపోయాడు ప్రకాశం.

* * *

కాలం మందంగా కదులుతోంది

సంక్రాంతి నెల రోజులుందనగా ఒకరోజు శ్రీనివాస్ హైదరాబాద్ నుంచి వచ్చాడు.

"అమ్మా! నెలనుంచీ నీకు ఉత్తరం వ్రాద్దామని అనుకోవటం అశ్రద్ధ అయిపోవటం జరుగుతోంది క్షమించమ్మా!" ఏదో తప్పు చేసినట్టు తల దించుకున్నాడు శ్రీనివాస్

'నువ్వే శ్రీనివాస్ కెంత నిర్లక్ష్యమో! నెలాళ్లై వెళ్లినా ఒక్క ఉత్తరం ముక్క

బ్రాసాడా!" అనేవాడు తన భర్త శ్రీనివాస్ మంచి ఉత్తరాలు రాకపోతే !

"పాపం! వాడికెక్కడ తీరిక లేదోనండీ" తను సమర్థించేది శ్రీనివాస్‌ని

పాత జ్ఞాపకాలు మనసుని ఛేదిస్తున్నాయి.

"అమ్మా! ఏంటమ్మా! ఆలోచిస్తున్నావ్? నాన్నగారు పోయి మూడేళ్ళయినా ఇంకా ఆలోచిస్తూనే వున్నావు! చనిపోయిన వాళ్ళు తిరిగి వస్తారా నీ పిచ్చి గాని. మేం చూడు రొటీన్ వర్కులో ఎలా మరచిపోయామో!" అన్నాడు శ్రీనివాస్ తన వాగ్ధోరణిలో.

షాక్ తగిలినట్లైంది జానకమ్మకు.

వీళ్ళంత తేలిగ్గా తనెలా మరచిపోగలదు ?

తన మనస్సులో నిలిచిపోయిన అమర స్మృతులెలా చెరిపేయగలదు ? ?

నిర్లిప్తంగా నవ్వి ఊరుకుంది జానకమ్మ.

"అమ్మా! ఈసారి కాదనకుండా నాతో హైదరాబాదు రావాలి. సంక్రాంతి నాటికి అన్నయ్యను కూడా రమ్మని వ్రాసాను, నువ్వు రావనడానికి వీలేదు. నాతో ఇప్పుడు వస్తే పండుగ వెళ్ళిపోగానే వచ్చేయవచ్చు" అన్నాడు శ్రీనివాస్

కొడుకు పిలిచినా వెళ్ళాలని లేదు జానకమ్మకు.

ఆమెకు ఇంటిని విడిచిపెట్టాలనిపించదు. ఒంటరితనంలోనే ఏదో ఓదార్పు లభిస్తుందామెకు.

"మొన్ననేకదా తిరుపతి వెళ్ళి వచ్చాను. నేను రాలేనురా!" అంది జానకమ్మ.

"అమ్మా! అలా అంటావని నాకు తెలుసు. నీకు ఏ లోటు రాకుండా చూస్తామగా!" చిన్నపిల్ల గడ్డం పట్టుకు బ్రతిమిలాడినట్టుగా అడిగాడు శ్రీనివాస్.

ఆఖరికి తల్లిని ఒప్పించాడు.

ఆరోజు రాత్రే కోణార్క్‌లో హైదరాబాద్ వెళ్ళిపోయారు.

* * *

జానకమ్మకు భాగ్యనగరం చూపించాలని వారం రోజులు సెలవు పెట్టాడు శ్రీనివాస్.

'పబ్లిక్ గార్డెన్, సాలార్‌జంగ్ మ్యూజియం, చార్‌మినార్, బిరా టెంపుల్ వంటి ముఖ్యప్రదేశాలను రోజుకొకటి చొప్పున చూపించాడు.

అంత సుందరమైన భాగ్యనగరాన్ని చూసినా తల్లి అదోలా ఉండటం శ్రీనివాస్‌ని కలవర పరచింది.

## లోటు

సంక్రాంతి ముందురోజు ప్రకాశం కుటుంబంతో సహా వచ్చాడు.

కలిగినింటి అమ్మాయి పెళ్ళి పందిరిలా ఇల్లంతా హడావుడిగా ఉంది.

సంక్రాంతి రోజు –

పిల్లలంతా ఆటలో మునిగిపోయారు.

ప్రకాశం, శ్రీనివాస్, జీవన, కరుణ పేకాట ఆడుకుంటున్నారు. ప్రక్కగదిలో ఒంటరిగా ఉన్న జానకమ్మ ఏదో ఆలోచిస్తోంది.

ఆట మధ్యలో ఏవో జోకులు వేసుకుంటూ హుషారుగా నవ్వుకుంటున్నారు.

అంతా వినిపిస్తోంది జానకమ్మకు.

"ఏమిటండీ! మీ అమ్మగారి ధోరణి, వచ్చినదగ్గర్నుండి చూస్తున్నాను. మూతి ముడుచుక్కూచుంటున్నారే తప్ప ఒక్క మాట మాట్లాడితే ఒట్టు. అయినా మనమేం లోటు చేసాంకనక : పండక్కి బట్టలు పెట్టలేదా అంటే మంచి చీరే కొన్నాం. హైదరాబాదులో చూడవలసిన ప్రదేశాలన్నీ చూపించాం, ఇంకా ఏమిటి కావాలో - నాకర్థం కావటే దు" అంది శ్రీనివాస్ భార్య కరుణ.

"జ్ఞానా శీనూ! నేను తిరుపతి తీసుకెళ్ళినప్పుడూ అంతే! ఉన్న రెండు రోజులూ రెండు యుగాల్లా గడిపింది. నాలుగురోజులపాటు ఉండమని ఎంత బ్రతిమిలాడినా ఎందుకుండలేదో నా కర్థం కాలేదు. ఎంతసేపూ ఇంటి ధ్యాసే దానికి" అన్నాడు ప్రకాశం అందుకుని.

"ఏలాగైనా ఈ మధ్య అత్తగారి మనసు ఏదో చికాకుగా ఉంది. ఒంట్లో నలతగా ఉందేమో!" అంది జీవన.

"అయినా రోగమొస్తే చెప్పకోవాలి కాని –ఇలా మౌనంగా సాధిస్తే ఛస్తామేమో!" కరుణ విత్తి పొడిచింది.

"అమ్మ కెప్పుడూ ఆలోచనే! హాయిగా ఏదోపుస్తకాలు చదువుకుంటూనో - రామనామ స్మరణ చేసుకుంటూనో ఉండక ఏమిటో ధ్యాస" శ్రీనివాస్ అన్నాడు ముక్కలు పంచుతూ.

ఇంతలో జానకమ్మ రాకతో ఉలిక్కిపడ్డారంతా!

అప్రసన్నంగా మారిన వాళ్ళ ముఖాల్లోకి చూస్తూ అంది జానకమ్మ.

"ఒరే! మీరంతా నా గురించే ఏవేవో మాట్లాడారని దానికి మిమ్మల్ని నిలదీసి తిట్టాలని యిక్కడికి రాలేదు. కాని ఒక్క సత్యం చెప్పి పోదామని వచ్చాను. ప్రతి స్త్రీకి భర్త ఒక వరం. ఆ వరప్రసాదాలే బిడ్డలు. వాళ్ళని పెంచి పెద్ద చేయటం తల్లిదండ్రుల కర్తవ్యం, మీరు పెరిగి పెద్దవాళ్ళై ఉద్యోగాలు చేసుకుంటూ బ్రతుకుతున్నారు కనుక మీకు ఏ లోటూ లేదూ! కాని నేను భర్తను కోల్పోయిన స్త్రీని. ఒకప్పుడు భర్తతో సహధర్మచారిణిగా జీవితాన్ని సాగించి - మధురమైన స్మృతులతో గడిపి – అనుభూతుల్లో తడిసి-ఆనందాలతో బ్రతికి ఎంత హాయిగా కాపురం చేసాను అలాంటి మధురమైన మనుగడ సాగించిన నేను నుదుట బొట్టు చెరిగిపోయిన దౌర్భాగ్యానికి మూడేళ్ళ నుంచి శిలలా గడుపుతున్నాను నన్ను మీరు ఏ లోటూ రాకుండా చూస్తామనటం కొడుకులుగా మీ ధర్మం.

కాని ఇది మీరు కల్పించిన లోటు కాదు. భగవంతుడు సృష్టించిన తీరని లోటు. సకల భాగ్యాలు కోల్పోయినా తిరిగి సంపాదించుకోవచ్చు – కాని తిరిగి రానిది సౌభాగ్యం ఒక్కటే.

నేను మీ దగ్గరా ఎక్కువ రోజులు ఉండకపోవటానికి కారణం మీ నిరాదరణ కాదు, నాకు మీరంటే గిట్టకా కాదు. మీ నాన్నగార్ని మీరు మరచిపోయినా- నేనా అమర స్మృతుల్ని విస్మరించలేను. అందుకే నాకు నాన్నగారున్న యిల్లు వదలాలనిపించదు మీరు హైదరాబాద్, తిరుపతి చూపించినా తీరని తనివి- నా యింట్లో ఉంటూ గడిచిన అనుభూతుల్ని నెమరువేసుకుంటే తీరుతుంది. అంతేగాని నేనెవర్ని అపార్థం చేసుకోలేదు."

జానకమ్మ గొంతుకలోంచి పరిపూర్ణమైన మానవత్వంతో వెలువడిన మాటలు వాళ్ళను నిర్వీణ్ణుల్ని చేసాయి.

వెంటనే క్షమించమని ప్రాధేయపడుతూ జానకమ్మ పాదాలపై పడి – కన్నీటితో అభిషేకం చేసారు నలుగురూ!

### అంకితం

నేనంటే ఎక్కువగా అభిమానించే సాహితీ మిత్రులు- శ్రీ వేమకోటి సీతారామ శాస్త్రిగారికీ కథ అంకితం. —రచయిత




పార్వతిని తొలి చూపులోనే ఆకర్షించేడు శేఖర్.

తొలిసారిగా అతనితో మాట్లాడినప్పుడు ఆ ఆకర్షణ రెట్టింపయింది. అది కాస్తా వికర్షించేదాకా వాళ్లిద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. ఒకరి "ఐడియాస్ అండ్ ఐడియాలజీస్" మరొకరితో ఎంతవరకూ సరిపోతాయో పోల్చి చూసుకున్నారు.

ప్రతినాణానికీ ఒక పక్క బొమ్మ మరోపక్క బొరుసు ఉండటం న్యాయం. ఒకే నాణాన్ని ఇద్దరు వ్యక్తులు రెండు వేర్వేరు కోణాలనుంచి ఎగరేస్తే ఇద్దరికీ బొమ్మే పడాలనేముంది!

అవకాశం అనే "అణాకాసు"కి "అభిమానం" అనే పైపూత పూసి పార్వతి శేఖర్ వైపుకి విసిరింది. శేఖర్ పార్వతిమీదకి గిరాటేసేడు.

నిరుద్యోగి శేఖర్‌కి బొమ్మపడింది. డబ్బుగల ఆసామీ ఏకైక పుత్రికతో పెళ్లికుదిరి ఫుల్ టైమ్ జాబ్ దొరికింది.

పార్వతికి బొరుసు. నిరుత్సాహం, నిట్టూర్పులు మిగులు.

"లవ్స్ లేబర్స్ లాస్ట్... లవ్స్ లేబర్స్ లాస్ట్ ... లవ్స్ లేబర్స్ లాస్ట్" తలుపులు బిగించుకుని వంటరిగా తన గదిలో మంచంమీద పడుకుని అశాంతిగా అటూ ఇటూ దొర్లుతూ వంద సార్లనుకుంది పార్వతి ఆ మాట.

అనుకున్నప్పుడల్లా గుండె కలుక్కుమన్నట్లయింది. అనుకోడం మానేద్దామన్నా వీలుపడటం లేదు. ఏదో బాధ ... ఏమిటో వేదన. గట్టిగా ఎలుగెత్తి ఏడుద్దామని మధ్య మధ్య కోరిక ...

అదేం ఖర్మమో – గుండె కుతకుతలాడుతోందే కాని కన్నీళ్లే రావడంలేదు. "ఇంకెక్కడున్నాయి కన్నీళ్ళు ... ఎప్పుడో ఇంకిపోయేయి. "అమ్మ తనని వంటరిదాన్నిచేసి చచ్చిపోయినప్పుడే సగం ఇంకిపోయేయి. మిగిలిన సగం నాన్న ఇహలోక యాత్ర ముగించుకుని పోతూ పోతూ పట్టుకుపోయేడు" అనుకుంది బాధగా.

ఇంక ఏడుద్దామన్నా కరువే. అయినా ఏడ్చే అవసరం కూడా రాలేదింతవరకూను.

"ఇప్పుడు కలిగింది ..."

"కలగలేదు. అసలయినా ఎందుకేడవాలి ..."

"భలే! తెలీనట్లడుగుతున్నావే ... చేతికందిన పండు జారిపోయింది కనక ... ఎక్కబోయిన గోడ మీది కాలు పట్టుతప్పి కిందపడిపోయేవు కనక ... హిహిహి ..."

"నోర్మూయ్! నేనే గోడా ఎక్కబోలేదు. అది రాతి కట్టడం కాదని వట్టి డొలకనీ ముందే తెల్సు ...కాబట్టి ముందే ఎక్కేపని మానేసేను..."

"ఛస్. అబద్ధాలాడక! నక్క ద్రాక్షపళ్ల కథ గుర్తుకి తెస్తున్నావ్..."

కొంచెంసేపలా ఆత్మసైతాన్లమధ్య యుద్ధం జరగనిచ్చి నెమ్మదిగా మంచం మీది నించి లేచింది పార్వతి. లైటు వేసి బీరువా కున్న నిలువుటద్దంలో మొహం చూసుకుంది.

జుట్టు రేగిపోయి ... బొట్టు చెరిగిపోయి ... కళ్లు ఉబ్బిపోయి నానా చిరాకుగాను ఉంది మొహం. అర్ధరాత్రి మంచి నిద్రలో నించి లేచినా కడిగిన ముత్యంలా ఉండే తనీరోజెందుకిలా వెగటు పుట్టించేలా తయారయిందో అర్థం కాలేదా అమ్మాయికి.

"ఎందుకేమిటి! మంచం మీద బోర్లాపడుక్కుని ఎక్కెక్కిపడి ఏడ్చేవు ..." మళ్లీ అందుకుంది పార్వతిలో పార్వతి.

అసలు పార్వతి అద్దంలో పార్వతి కేసి కోపంగా

చూసింది. గుండెలో మళ్ళీ గుబ గుబలాడి నట్లయింది.

"ఏడుస్తే ఏడుస్తాను, నీకేం. దెబ్బ తిన్నాను. అది మానేదాకా అరుస్తాను. నేనేం అతని ప్రేమకి దూరం అయిపోయి నందుకు పిచ్చెత్తి కొట్టుకోవడంలేదు."

అఫ్‌కోర్స్, ఎవరికయినా చేసిన పని తాలూకు ఫలితం చేజారిపోతే ఉడుకుబోత్తనం రాదూ! ఆ ఉడుకు చల్లారేక మళ్ళీ మామూలే ...

జుట్టు సవరించుకుని, బొట్టు సరిదిద్దుకుని, చీర కుచ్చెళ్ళు దులిపి మళ్ళీ మంచం మీద వాలి పోయింది పార్వతి. నిద్రపోవాలి, తెల్లారితే మళ్ళీ పెళ్లి పనులు ... హడావుడి.

అత్తయ్యకి సాయపడాలి. అవసరానికి కాకపోతే మంది ఉండి ప్రయోజనం ఏమిటి? ఆవిడ మొహం చూసి తన బాధ మింగేయాలి. చిరునవ్వులు చిందిస్తూ ... హుషారుగా తిరుగుతూ ఖంగు తిన్నట్లనలెవరికీ తెలియనియ్యకుండా గడిపేయాలి.

అసలు మనం 'ఖంగు' తినలేదు, అతన్ని ప్రేమించనూలేదు, అతని వెంటపడి పార్కుల్లోను, కాలవగట్ల మీద పరుగులు పెట్టలేదు.

మొదటి సారిగా అతను తనని పలకరించే దాకా ప్రతిరోజూ అతన్ని బస్సు స్టేజీలో చూస్తూనే ఉన్నా ... మొహం కేసి తేరిపారి చూడనేలేదు తను ... కాస్సేపు గతంలోకి పరుగెత్తింది పార్వతి మనసు.

ఆ రోజు తనెటో శూన్యంలోకి చూస్తూ నిలబడి ఉండగా – "పార్వతి ... కదూ" అని పలకరించేడతను. తన పేరు అపరిచితుడయిన అందగాడి నోటి వెంట వింటుంటే తనకేలాగో అయిపోయింది. కళ్లింతచేసి శేఖర్ కేసి చూసింది తను. ఆతడు చిరునవ్వులు చిందిస్తూ తను క్రిందటిరోజు బస్ స్టేజీలో మర్చిపోయిన పుస్తకం అందించేడు.

తను అతని మోహనరూపం చూస్తూ ఏం చెయ్యాలో తెలియక యాంత్రికంగా పుస్తకం అందు కుం.ది చాలా సేపటికి కాని అతనికి 'థాంక్స్' చెప్పాలని కూడా తోచలేదు తనకి. తీరా తోచాక తను ... సిగ్గుపడుతూ ... మెలికలు తిరిగిపోతూ "థాంక్స్" అనంగానే ... అతగాడు "డోంట్ బీ ఫార్మల్" అన్నాడు.

మత్తెకించే ఆ కంఠం, అతని మాటలు తన చెవుల్లో ఈ నాటికీ గింగురు మంటూనే ఉన్నాయి.

"మిమ్మల్ని రోజూ చూస్తూనే ఉంటాను. కాని మీ వివరాలు ... మీ పుస్తకం ధర్మమా అని నిన్ననే తెలిసేయి." నవ్వేడతను. తనూ నవ్వింది. ఆ క్షణంలో ఎన్నెన్నో ఆశలు ... ఎన్నెనో ప్రశ్నలు ...తన గుండెని దడదడ లాడించడం ఇప్పుడు కూడా గుర్తొస్తోంది.

అయితే అతను కూడా తన లాగే ... వివరాల సేకరణలో ఉన్నాడా! ... ఎందుకు? తనంత అందంగా ఉందా! పవిట సవరించుకుంటూ ... నవ్వుకుంటూ ... ఎటోచూస్తూ నిలబడింది.

ఇంతలో కాజీపేట – కాకతీయ యూనివర్సిటీ బస్సొచ్చింది. తనా బస్సులోనే ఎక్కి నయీమ్ నగర్ వొకేషనల్ ఇన్‌స్టిట్యూట్ దగ్గర దిగాలి. తనా ఇనిస్టిట్యూట్‌లో చేరిన దగ్గర్నుంచీ దాదాపు ప్రతిరోజు అతన్ని బస్సుస్టాండులో చూస్తూనే ఉంది. అతను తనని చూస్తున్నట్లు కూడా గమనించకపోలేదు. పలకరింపులు మాత్రం ఇదే మొదలు.

ఆ రోజంతా తను ఇంటా బయటా పరధ్యా నంగానే గడిపింది.

'పలకరింపులు వలపు తొలకరింపులకి దారి తీస్తాయని అనుకోలేద'ని పార్వతి తనని తాను మోసం చేసుకుంది కొంతకాలం.

"అబ్బే! వలపా ... పాడా ... ఊరికే స్నేహం జస్ట్ ఫ్రెండ్‌షిప్" అని మనసుని సద్దుమణిగిం చేసింది.

ఆశలు పెంచుకోవద్దు అనుకుంటూనే ఆశ పడింది. ఈ రోజిలా "కిక్కు" తిని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"ఛ. అసలతన్ని ఎక్కడికక్కడ 'కట్' చేసి ఉంటే బావుణ్ను. అతగాడితో తనకి పరిచయమే కాకుండా ఉంటే ఇంకా బావుణ్ను. తనీ వూరు రాకుండా ఉంటే మరీ బావుణ్ను."

దిండుకేసి తలబాదుకుంది పార్వతి.

కాని పార్వతికి ఈ వూరు రావడం తప్ప మరో మార్గంలేదు. అమ్మ తనని ఇంటికి ఆడదిక్కుచేసి చచ్చిపోయేక అయిదేళ్లపాటు నాన్నకి వండిపెట్టింది. ఆలనా పాలనా చూసింది. ఊళ్లోఉన్న హైస్కూలు చదువు ముగించి, ఇన్ని కష్టాలతోనూ ఓపిక చేసుకుని ఇంటర్ కట్టి పాసయ్యింది.

తనెంత బావటగా నిల్చినా తండ్రి, ఎలిమెంటరీ స్కూలు టీచర్ చేస్తూనే, అదమాయించే అమ్మ లేకపోవడంతో, సిగరెట్లు, బ్రాకెట్లు, మరెన్నో చిల్లర అలవాట్లు టోకున చేసుకున్నాడు. ఫలితం ఆర్థిక ఇబ్బంది, అల్సరువ్యాధి, అకాల మరణమూను. తను ఆ పల్లెటూళ్లో నా అనేవాళ్లు లేక కుళ్లికుళ్లి నశించిపోకుండా, నాన్న – కర్మకాండ జరిపించడాని కొచ్చిన మామయ్య కాపాడేడు కాబట్టి సరిపోయింది. బరువుగా ఊపిరి పీల్చింది పార్వతి.

పార్వతి మేనత్త లక్ష్మమ్మ, మామయ్య క్రిష్ణరావు కర్మ జరుగుతున్న రోజుల్లోనే పార్వతి భవిష్యత్తు చక్కగా ప్లాన్ చేసేరు.

"నా దగ్గరెలాగూ దీనికి ఈడయిన కొడుకు ల్లేరు. మా బావగారి అబ్బాయికి చేసుకోవచ్చు. మనం అడిగితే కాదనరు. ఆ కుర్రాడిప్పుడు 'పాలిటెక్నిక్' చదువుతున్నాడు. చదువు పూర్తయి ఉద్యోగంలో చేరితేనే కాని పెళ్లి చేసుకోడు. చేసుకున్నా కష్టంకదా! అప్పటిదాకా దీన్నెక్కడ ఉంచాలా అని ... మా యింట్లో గొడవ లోకానికి తెలిందేముంది! కడుపు చింపుకుంటే కాళ్లమీద పడుతుంది ... తమ్ముడి పిల్లే అయినా ... రావే... నీకేం భయంలేదు ... నా యింట్లో ఉండు ... అనేపాటి 'ఇది' లేదు నాకు."

పార్వతి కన్నీళ్లు తుడుస్తూ తన కన్నీళ్లొత్తు కుంది లక్ష్మమ్మ!

"మీరు మీ బావగారబ్బాయి సంబంధం చెదిరి పోకుండా చూడండి వదినా! దీన్నిప్పుడు నా వెంట తీసుకుని వెడతాను. ఆ కుర్రాడి చదువు పూర్తయి ఉద్యోగం వచ్చి ఆ కాస్త శుభం జరిగేదాకా పార్వతి మా యింట్లోనే ఉంటుంది. ఆ విషయంలో మీరు బెంగ పడనక్కర్లేదు. ఎటొచ్చీ ఈ సామాన్లన్నీ అంతదూరం తీసుకెళ్లడం కష్టం.

నువ్వేకదయ్యా– "మరీ పిల్లాడ్లా కనిపిస్తున్నాను– కాస్త పెద్దమనిషి తరహాలో కట్టుచెయ్యి" అని అన్నదీ....

మీ కేం భయపడకండి సార్!! నాదగ్గర టించెరు, దూది రెడీగా ఉన్నాయ్!!








తీసుకెళ్లినా అక్కడ ఇళ్లు ఇరుకు కదా!...'' నసిగేడు క్రిష్ణారావు,

తనింట్లో ఉన్న సోఫా కమ్ బెడ్స్, డ్రెస్సింగ్ 'టేబిల్', డైనింగ్ 'టేబిల్ మధ్య ఈ వెలసిపోయిన ట్రంకుపెట్టెలూ, నవారు తెగిపోయిన మంచాలు ఎక్కడ పెట్టాలని బెంగపడుతూ.

"సామానంతా ఎంత! ఒక నవారు మంచం, రెండు మడత మంచాలు, ఒక చెక్క కుర్చీ, రాగి డేగిసా, ఇత్తడిబిందె, రెండు స్టీలు కంచాలు, నాలుగు గ్లాసులు, ఒక చెంబు.

లక్ష్మమ్మ జాగ్రత్తగా గోనెబస్తాల్లో కట్టించి బండికేయించింది. ''రేపు పిల్ల మా బావగారింట్లో కాపురం చెయ్యడానికి వస్తుంది కదా, అట్నుంచి ఆటే దాని సామాన్లు దానికి అప్పగించేస్తాను. అందాకా మిద్దె మీద పడేసి ఉంచుతా. అవి నన్నేమయినా అన్నం అడుగుతాయా! ... వీళ్ళ కావాలంటాయా!!!

మామయ్య ఇచ్చిన అయిదు వందలతోటి, నాన్న చేసిన చిల్లర బాకీలు తీర్చి పెట్టె సద్దుకుంది పార్వతి.

లోకంలో మేనమామల భార్యల గయ్యాళి తనాలు కథలు కథలుగా విని ఉందేమో... పార్వతి శకుంతలమ్మ తనని 'ఛీ' కొడుతుందని భయపడింది. కాని కథ మరో మలుపు తిరిగింది.

శకుంతలమ్మ పార్వతిని కన్నబిడ్డలా కడుపులో పెట్టుకుంది. ''ఇంత చిన్నవయసులో నీ కెంత కష్టమొచ్చిందే తల్లీ...'' అని కౌగలించుకుని బావురుమంది. "పోనీలేమ్మా! నీకీ యింట్లో లోటుండదు. కడుపునిండా తిని కంటినిండా నిద్రపో'' అని ఊరడించింది. ''అదేమిటే... ఆ వెలిసిపోయిన లంగాలు, వోణీలూనూ. పెళ్లికెదుగు తున్న పిల్లవు. శుభ్రమయిన బట్టల్లేకపోతే ఎలా... మీ మామయ్యకి చెప్పి కొనిపిస్తాలే. అందాకా ఇవిగో ఈ చీరలు కట్టుకో.''

నిలవెత్తు బీరువాతెరిచి వరసలు వరసలుగా పేర్చిన మూడువందల అరవైఅయిదు చీరలుతీసి కిందపడేసి, వాటిలోవి — తనకి విసుగు పుట్టించినవీ, తను 'ఓల్డు మోడల్' అనుకున్నవీ పది చీరలు ఎంచి పార్వతికి అందించింది.

## లవ్స్ లేబర్స్ లాస్ట్

"నేను నాజూగ్గా ఉంటానుగా మరి!నా జాకెట్లు నీకు బిగువయిపోతాయి. కొత్తగా కుట్టిస్తాన్లే" వేళాకోళంగా నవ్వుతూ తన రుబ్బురాయి జబ్బలు తడిమి చూసుకుంది శకుంతలమ్మ. పాతఫాషను చీరలే బనారస్ జరీ చీరల్లా కన్పించాయి పార్వతి కంటికి. ప్రత్యేక తన గదిలో ఒంటరిగా ఉన్నప్పుడు పది చీరలూ ఒకదాని తర్వాత ఒకటికట్టి అద్దంలో చూసుకుని మురిసిపోయింది. శకుంతలమ్మ చూపిస్తున్న ఆదరణలో ఆర్నెల్లపాటు తనని తాను మర్చిపోయిన పార్వతికి నెమ్మదిగా అర్థం అయింది, మామయ్య బిజినెస్ టాక్టిక్సు!

శకుంతలమ్మ పట్టరోగిష్టిమనిషి. హై.బి.పి., చక్కెర బీమారీ, కీళ్లవాతం, ఒకటేమిటి సృష్టిలో

## "గజల్" సుఖం

ఎవ్వరి గజల్ సుధావాహిని
జాలువారే కంఠంలో కదులుతున్నదో?
'ప్రపంచం మాయబొమ్మగా
దొరికితే మట్టి
దొరక్కపోతే పసిడి'గా మారి
సంగీత చక్రవర్తులకు మెరుగు పెడుతున్నదో?
పరిసరాల పద ధ్వనులను మరచి
కేవలం పచ్చి సుఖమనే లాలసలో
అదమరిచే గజల్ పద ధ్వనులు,
ఆకలి — దారిద్ర్యం అతి పచ్చిగా దాడి చేస్తుంటే
ముఖమంతా మట్టిపాలైందని బొమ్మ బాధుకోడం
సంగీతాన్ని మెడలో పాముగా వేసుకోడం!
రాళ్లపై రోజూ ఆడే వేలివేళ్లు
ఈ మట్టిలోని బంగారానికి తావిచ్చే
ఆ కర్కశ కంఠాల గజల్ మాధుర్యానికి
ప్రపంచమే విరిచి మురిసి ఆడే బొమ్మ!!

— నిఖిలేశ్వర్

ఉన్న అన్ని వ్యాధులకీ పాపం ఆవిడ 'ఐక్యరాజ్యసమితి' లాంటిది. క్రిష్ణారావుకి సంసార సుఖాలు అందించ లేకపోయింది. కనీసం సోలెడు బియ్యం ఆత్తెసరు పడేసి నోటికి హితవుగా వండిపెట్టే ఓపికలేని 'కుట్లబొంత' అయిపోందావిడ. ఆకార పుష్టి, నైవేద్య నష్టి. మంచానికి నిండుగా పడుకునో, కుర్చీకి నిండుగా కూర్చునో ఇంటికి లక్ష్మీకళ నాపాదించడం తప్ప మరి ఉపయోగంలేదు ఆవిడ వల్ల. నెమ్మదిగా వంటింటి బాధ్యతలన్నీ పార్వతి పరం అయ్యాయి.

ప్రొద్దుట మామయ్యకి బెడ్ కాఫీ అందించి, అత్త పూజకి ఏర్పాటుచేసి, టిఫిన్ తయారుచేసి, వంట వండి, అత్త చీరలు, మామయ్య బట్టలు పని మనిషి చేత ఉతికించి తను స్వయంగా ఇస్త్రీచేసి ...

"హమ్మయ్య, మవ్వొచ్చేక నా ప్రాణం మఖపడిందే పిల్లా... కుంచ మంత కూతురుంటే మంచం మీదే కూడు'' అంటారు. నా కన్నబిడ్డవు కాకపోయినా, నా అన్న పిల్లవు కాబట్టి ఈ రోగిష్టిదాన్నిలా ఆదుకుంటున్నావు. వాకీ రోగం వచ్చిన నాలుగేళ్ల మంచీ ఎంతమంది వంట మనుషుల్ని పెట్టున్నామో ... నెల వందలు జీతాలిచ్చి, ముప్పొద్దులా కాఫీ టిఫిన్లతో సహా విడిది వియ్యపురాళ్లలాగా మెక్కబెట్టి ఏడాదికి మూడు కొత్త చీరలిచ్చినా ... ఒక్కతి కూడా నిలకడగా ఉండి చావలేదు. ఈ ఏడాది నించి నీ వల్ల మీ మామయ్యకి ఆదా అయిన డబ్బుతో రెండు కాసుల బంగారం కొనమ్మ, నీ మెడపలే బోసిగా ఉంది, మీ మామయ్య ముక్కు పిండి వసూలు చేసి...!' ఏదో అనబోయింది శకుంతలమ్మ.

"ఛ! నోర్ముయ్యి'' గర్జించాడు క్రిష్ణారావు. "నా మేనకోడల్ని వంట మనిషితో పోల్చకు. దాని మెడ బోసిగా ఉంటే నేను దానికి గొలుసు కాకపోతే జిగినీ కొంటాను. అంతేకాని, ఇంటిపిల్లని పట్టుకుని వంటమనిషంటావేం'' కసురుకున్నాడు భార్యని.

వారం తిరక్కుండానే పార్వతి మెడలో గొలుసు మెరిసింది.

ఏ రాయి అయితేనేం — పళ్లూడ గొట్టుకో డానికి? వంట మనిషిగానో, ఇంటి మనిషిగానో తను చేస్తున్న చాకిరీకి కాష్ కాకపోతే కైండ్ ముడుతోంది. ఇంట్లో ఉన్న మిగతా పనివాళ్ల

# డి. ఆర్. ఎస్* కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ ఒక్కటే అత్యంత భద్రమైన ప్రెషర్ కుక్కర్

క్రొత్త **ప్రెస్టీజ్**

Patent pending

గస్కెట్ రిలీజ్ సిస్టమ్

Prestige
PRESSURE COOKER
Cook a whole meal in minutes

**100% భద్రత**



### జి ఆర్ ఎస్ అంటే ఏమిటి?

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక విశిష్టమైన నమూనాలో రూపొందించబడింది నీరు మరగబెట్టడం ఎంతో నిరపాయకరమో, ఈ సాధనంతో కూడిన ప్రెషర్ కుక్కర్‌తో వంటవేయడం కూడా అంత నిరపాయకరం ప్రెషర్ కుక్కర్ మూతలో ప్రత్యేకంగా అమర్చబడిన రంధ్రంద్వారా, గేస్కెట్ అపాయకరమైన స్థితిని చేరిన ఆవిరి ఒత్తడిని అత్యంత భద్రంగా వదలివేస్తుంది జి అర్ ఎస్ అమర్చడంవల్ల 'క్రొత్త ప్రెస్టీజ్' పూర్తి భద్రతగల ఏకైక ప్రెషర్ కుక్కర్‌గా తీర్చి దిద్దబడింది



### అది ఎలా పనిచేస్తుంది?

వంట త్వరగా పూర్తవడానికి ప్రెషర్ కుక్కర్లన్నీ ఆవిరినే ఉపయోగించుకుంటాయి కొన్ని సమయాలలో కుక్కర్ లోపల ఆవిరి ఒత్తడి అవసరానికి మించి ఉంటుంది సాధారణ పరిస్థితులలో ఈ ఆవిరి ఒత్తడి కుక్కర్ మీది వెయిట్‌వాల్వ్ రంధ్రం ద్వారా బయటకు పోతుంది అయితే, ఆహార పదార్థాలచే ఈ రంధ్రం కప్పివేయబడినప్పుడు కుక్కర్ ప్రేలిపోయే ప్రమాదం ఉంటుంది

'క్రొత్త ప్రెస్టీజ్'లో ఎప్పుడైనా ఆవిరి ఒత్తడి అదికమైనప్పుడు ప్రెషర్ కుక్కర్ మూతలో అమర్చబడిన జి అర్ ఎస్ రబ్బర్ గేస్కెట్‌ను సాగేలా చేసి అధిక ఒత్తడిని అంతర్ముఖంగా, భద్రంగా వదలివేస్తుంది.



### జి అర్ ఎస్ ఎందుకు అవసరం?

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చవలసి వచ్చినప్పుడు మీకు నకిలీది లభించవచ్చు అవి అత్యవసర సమయాలలో సరిగా పనిచేయదు దురదృష్టవశాత్తు, సేఫ్టీ ప్లగ్ నకిలీదో, అసలైనదో మీరు గుర్తించలేరు, ప్రమాదాన్ని ఎందుకు కొనితెచ్చుకోవాలి? **జి అర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు.**



**మామూలుగా వంటచేసే పద్ధతిలో జి అర్ ఎస్ జోక్యం ఉండదు.**

ఉండనే ఉండదు. అందులో మార్చడానికి ఏమీలేదు. రబ్బర్ గేస్కెట్ ఆవిరిని వదలి పెట్టగానే మీరు చేయవలసిందల్లా శుభ్రంచేసి ఒక స్పూన్ సహాయంతో యధాస్థానానికి త్రోయడం మాత్రమే. తరువాత వెయిట్‌వాల్వ్ రంధ్రాన్ని శుభ్రంచేసి కుక్కర్ వాడండి

చిన్నపిల్లలు సైతం నిర్భయంగా వాడగలిగే భద్రమైన కుక్కర్ — అదే గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన "క్రొత్త ప్రెస్టీజ్".

* గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

తయారి.

Prestige



ప్రెస్టీజ్ . . . భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు

maa(s) TTP 3 Tel b 82







తనని "చిన్న దొరసాని" గా గుర్తిస్తున్నారు ... చాలదూ!

రోజులు దొర్లుతున్నాయి ఈ లోపున మరో సంఘటన జరిగింది, పార్వతి మేనత్త లక్ష్మమ్మ బావగారి కొడుకు "పెళ్లికొడుకు" కావటానికి పాతికవేలు వరదక్షిణ కోరుతున్నాడట, పై సంబంధాల కయితే అంతకంటె రెట్టింపు ధర పలుకుతుందికాని ... అయినవాళ్ళు కాబట్టి, లక్ష్మమ్మగారి రికమెండేషన్ మేరకు ఆ మాత్రానికి వప్పుకున్నాట్ట. క్రిష్ణారావుగారు స్తోమతున్నవాడు కాబట్టి, ఈ సొమ్ము ఏమంత కష్టంకాదనీ, వెంటనేవచ్చి మాట్లాడి సంబంధం ఖరారు చేసుకోమనీ లక్ష్మమ్మ ఉత్తరం రాసింది.

ఉత్తరం చదివి క్రిష్ణారావు పెదవి విరిచేసేడు. "అయినవాళ్లతో సంబంధాలకి కూడా అంతంతేసి కట్నాలెక్కడపోస్తాం" అన్నాడు. "పాతికవేలిచ్చే టట్లయితే పాలీటెక్నిక్ స్టూడెంటేం ఖర్మ, కాలేజి లెక్చరర్నే తేవచ్చు" అభిప్రాయపడ్డాడు.

"ఎంధొమ్మిదేళ్లు నిండకుండానే దీని పెళ్లికి కంగారేముందిలెండి. బంగారు బొమ్మలాంటి పిల్ల. ఏ ఆఫీసరో చూసి ఎగరేసుకుపోతాడు. ఎవరి అదృష్టం ఎలా ఉంటుందో. వేదాంతం చెప్పిందాయన భార్య.

ఆఫీసరు మొగుడొస్తాడని ఆశలు కోర్కెలు అలవోకగా పెంచుకోకపోయినా, తన పెళ్లి తనంతట తను పూనుకుంటేనే కాని జరగదని గ్రహించింది పార్వతి. సమయం కోసం ఎదురు చూసింది. గాలం వేసింది.

"నీ కాళ్లమీద నువ్వు నిలబడగలిగేవంటే, మీ మేనత్త పట్టించుకోకపోయినా, మేనమామ ముందుకి రాకపోయినా, నీ పెళ్లిదానంతట అదే అయిపోతుంది. నా మాట విని అదిగో, ఆ ... డొమిష్టిక్కు కాలేజీయట. అదేదో అందులో చేరి ఏ కుట్టుమిషను డిప్లొమానో సంపాదించుకుంటే, మీ మామయ్య ఉద్యోగం చూసి పెడతారే పిల్లా ..." ఓ సలహా పారేసింది శకుంతలమ్మ. క్రిష్ణారావుకికూడా ఐడియా బాగానే నచ్చింది. పలుకుబడి ఉపయోగించి స్త్రీల



## లవ్స్ లేబర్స్ లాస్ట్

వృత్తి విద్యా శిక్షణాలయంలో పార్వతికి సీటు సంపాదించేడు.

పార్వతి ఆర్టీసీ బస్‌పాస్ కొన్ననాటినుంచి కళ్లు పెద్దవి చేసుకుని లోకం చూడటం మొదలు పెట్టింది. డబ్బుకి, హోదాకి కాకుండా తన మంచి తనానికి, అందానికి ప్రాధాన్యం ఇచ్చే సామాన్యుడి కోసం అన్వేషణ ప్రారంభించింది. ఆట్టే కాలం గడవకుండానే శేఖర్‌తో పరిచయం అయింది.

వసంత రుతువు ప్రారంభం అయ్యింది. మొక్కల మొగ్గలు తొడిగేయి, చిగురుటాకులు చిరు గాలికి వయ్యారంగా ఊగేయి. కోకిల "కో" అని పిలిచింది. పార్వతి పడుచు మనసు "కొహో" అని రెట్టించింది.

శేఖర్ పార్వతిని బస్టాప్‌లో కల్సుకుంటూనే

### మెదడుకి పదును!

మనుషులలో జ్ఞాపకశక్తి పనిచేసే విధం విచిత్రంగా వుంటుంది. ఎవరైనా తనకు జ్ఞాపకశక్తి తక్కువని, తనకసలు ఏమీ జ్ఞాపకం వుండవని భావిస్తే, అతని జ్ఞాపక శక్తి నిజంగానే తగ్గిపోతుంది. జ్ఞాపకశక్తి తగ్గిపోతుంటే విశ్వాసం కూడా తగ్గిపోతుంది. అంటే యిది ఒక రకమైన విషవలయం అని చెప్పవచ్చు. ఈ విషవలయాన్ని ఛేదించ టానికి మాక్స్‌ప్లాంక్ విశ్వవిద్యాలయంలోని మానసిక పరిశోధనల సంస్థవారు క్రొత్త ప్రయోగాలను చేపట్టారు. ఈ ప్రయోగాలలో చిన్నపిల్లలకు ఆసక్తికరమైన ఆటల గురించి వివరాలను, పెద్దలకు ఆసక్తికరమైన రాజకీయాల వివరాలను చెప్పి జ్ఞాపకం వుంచుకోమని కోరుతారు. అలాగే టెలిఫోను నెంబర్లు, చిన్న చిన్న పుస్తకాలు కంఠస్తం చెయ్యమని చెబుతారు. అభ్యాసం ద్వారా జ్ఞాపకశక్తిని పెంచటానికి వీరు కృషి చేస్తున్నారు.

ఉన్నాడు ఆమెని యథాశక్తి "ఖుశామద్" చేస్తూనే ఉన్నాడు.

"మీ పేరంటే నాకిష్టం. అందుకే మీరంటే కూడా నా కిష్టం. అల్ట్రా మోడర్న్ పేర్లన్నా, మనుషులన్నా నాకు" చిరాకు, అన్నాడొక రోజున బస్సు కోసం ఎదురుచూస్తూ ఒంటరిగా నిలబడిన పార్వతిని పలకరిస్తూ!

పార్వతికెలాగో అయిపోయింది.

"నాక్కూడా మీ రంటె,ఇది" అనబోయింది. కాజీపేట బస్సొచ్చేసింది, శేఖర్ పరుగు పెట్టి బస్సందుకున్నాడు.

ఇంక మొదలయ్యింది పార్వతి గుండెలో తియ్యని కోత.

"అతనెవరో! ఏ కులమో! ఏం చేస్తున్నాడో! పెళ్లి కాలేదేమో! కాకుండా ఉంటే బాగుండును! ..."

"మీరు ఫామిలీతో ఉంటున్నారా ఆ యింట్లో!' బస్టాపుకి అల్లంత దూరాన కనిపించే పెంకుటింటి వేపు చూపిస్తూ అడిగింది ఆ మర్నాడతన్ని. పార్వతి అడగదల్చుకున్నదేమిటో వెల్లగోడ అంత తెల్లగా తెల్లమయింది శేఖర్‌కి. కొంటెగా నవ్వేడు. జాలిగా చూసేడు, సర్కాష్టిక్‌గా దగ్గాడు.

"ఫామిలీయా! ఇంకేమయినా నా ... నాకు పెళ్లే కాలేదండీ బాబూ! ... అయినా నా కెవరు పిల్లనిస్తారు! నాకే దారి లేక మా పెద్దమ్మ ఇంట్లో ఉంటున్నాను, ఇక పెళ్లాన్నేం పెట్టి పోషించను! అయామ్ ఏ బాచులర్ అండ్ బామలర్ ఆఫ్ ఆర్ట్స ..."

ఈ సారి కాకతీయ యూనివర్సిటీ బస్సు; కాజీపేట బస్సు ఒకేసారి వచ్చేయి. ఇద్దరూ ఆదరా బాదరా పరుగులు పెట్టి బస్సులో దూరిపోయేరు.

"కట్నం పుచ్చుకోవడం నాకు నచ్చదండీ. కట్నం తీసుకుని పెళ్లి చేసుకుంటే ఆ డబ్బుతో అఫ్‌కోర్స్ ... ఉద్యోగం కొనుక్కోవచ్చనుకోండి! ఆ తర్వాత మనం డబుల్ సర్వెంటయిపోయే ప్రమాదం ఉంది. ఒకటి కట్నం ఇచ్చిన పెళ్లానికి, రెండు లంచంతో వచ్చిన ఉద్యోగానికీను ...

కాకపోతే ఉద్యోగం చేసే భార్య కావాలని మాత్రం కోరకుంటున్నాను. ఇద్దరి సంపాదనతోటే

కష్టం లేకుండా కాలం గడపగలం. అయిదేళ్ళుగా ఉద్యోగం కోసం, ఉద్యోగం, మంచితనం, మోడెస్టీ ఉన్న మీలాంటి అమ్మాయి కోసం వెదుకుతున్నాను.''

పులకించిపోయింది పార్వతి. ఆ రోజంతా తెగ ఆలోచించింది. అతగాడు తనని ఘాటుగా ప్రేమిస్తున్నాడనుకుంది. అతని మాటలు పదేపదే తల్చుకుంది. అతనితో తన భవిష్య జీవితం తియ్యగా ఊహించుకుంది.

''మీలాంటి అమ్మాయి కోసం ... ''

తల్చుకు తల్చుకు రోమాంచిత అయ్యింది. ఆ రాత్రంతా నిద్రపోలేదు. ఏదో కమ్మని భావన.

శేఖర్, పార్వతి పేర్లు చక్కగా మాచ్ అయ్యేయి. ఇద్దరూ నిరాధార పక్షులే! అదంతకంటె బావుంది. ''దొందూ దొందూ కొందప్పే'' అన్నట్లుగా! ఇద్దరి మనసులు కలిసిపోయినట్లుగానే అన్పిస్తోంది.

ఆ భావన మరీ హాయిగా ఉంది.

మందమలయ మారుతం వంటికి తాకినట్లు, గులాబీలు గుబాళించినట్లు, జుంటితేనియ జాలినట్లు, అబ్బెబ్బె! అవన్నీ మన ఊహకి అతీతమయిన అనుభూతులు, మన అందుబాటులో ఉన్న ఆనందాలతో పోల్చుకుంటే సరి.

కమ్మని కంది పచ్చడి అన్నంలో గానుగ నూనె మిళాయించి వంకాయ పచ్చిపులుసు నంజుకుంటూ తిన్నట్లు, కొత్త ఆవకాయ వేడివేడి అన్నంలో కలిపి తింటూ మధ్య మధ్య బాగా ముగ్గిన పెద్దరసాల మామిడిపండు రసం పీల్చినట్లు, కాకపోతే అవ పెట్టిన పనసపొట్టు కూరతో కంచెడన్నం లాగించేసినట్లు...

పనసపొట్టు కూర తల్చుకోగానే అమ్మ గుర్తొచ్చింది పార్వతికి. ఇంకెక్కడి పనసపొట్టు కూర! అమ్మ చచ్చిపోగానే జిహ్వే చచ్చిపోయింది. జిహ్వే చావడం ఏమిటి!!! జీవితమే డొంకతిరుగుడు పట్టింది.

''అమ్మలేదు! నాన్నలేడు! ఏడుస్తే ప్రయోజనం లేదు. నేర్పుతో బ్రతుకు చక్కన చేసుకోవాలి!'' ఎత్తువేసి అట్నుంచి నరుక్కొచ్చింది.

శేఖర్ ఇట్నుంచి నరుక్కొచ్చేడు. డబ్బుగల వ్యాపారస్థుడి మేనకోడలు. ఉప్పు బిగిస్తే పిట్ట, పిట్టతోపాటు మంచి ఉద్యోగం దక్కుతాయి. బెడిసి కొడితే అనుభవం చిక్కుతుంది! తనేమాత్రం కమిట్ కాకుండా అమ్మాయిలో ఆశలు రేపడం మొదలుపెట్టేడు. పెద్దమ్మ దయాధర్మాలమీద ఆధారపడి ఉంటూ, ప్రతిరోజూ కాజీపేట రైల్వే ఆఫీసర్ల ఇళ్ళంట వెళ్ళి పిల్లలకి ట్యూషన్స్ చెపుతూ ఎంతకాలం! స్థిరమయిన ఉద్యోగం, నికడ ఉన్న ఆదాయం సంపాదించుకోవాలి!

''ఎస్. పార్వతి. అంటే మీ ఇంటి పేరు నుసర్లా ... ''

''కాదు ... శ్రీపాద.''

''అరె! మీరూ మేమూ ఒకటే శాఖ! మా పెద్దక్కయ్యని శ్రీపాదవారికే ఇచ్చేం! మీ గోత్రంతో మా గోత్రం పెళ్ళిళ్ళకి చాలా అనువుగా కలుస్తుందిట ... ''

ఆ రోజు పార్వతికి పట్టపగ్గాల్లేవు. అతను ఖచ్చితంగా తనని ప్రేమిస్తున్నాడు. తను కావాలనుకుంటున్నాడు. తన పరిస్థితి అవగాహన చేసుకునేపాటి సంస్కారం ఉన్నట్లుగానే అవుపిస్తున్నాడు. అతనికి నికడయిన ఉద్యోగం దొరికితే, అదీ తన ద్వారా దొరికితే తనపని మరింత సుగమం అవుతుంది.

జాగ్రత్తగా ఆలోచించి ప్రణాళిక తయారు చేసింది.

''అత్తా! నువ్వేమీ అనుకోనంటే ఒక సంగతి చెప్పనా!'' ఒక ఆదివారం మధ్యాహ్నం భోజనాలయ్యేక క్రిష్ణారావు మేడమీద ఆఫీసులో ఏవో అర్జెంటు కాగితాలు చూసుకునేటప్పుడు మొదలుపెట్టింది పార్వతి ప్రణాళిక నిర్వహణ!

ఏమటన్నట్లు చూసింది శకుంతలమ్మ, ఆ చూపులో భయం ఆందోళన కన్పించేయి. అవును మరి! అసలే బి. పి. పేషెంటు.

''మరేంలేదు డాలీ, ప్రవర్తన సరిగా లేదు!'' ముక్తసరిగా అని ఊరుకుంది. మిగతా కార్యక్రమం దానంతట అదే జరిగిపోతుందన్నట్లు.

''ఏంచేసిందే...''

''ఏంలేదు! మామయ్యతో కొంచెం అతి చనువుగా ఉంటేనూ! ... నా కళ్ళతో చూసేను. నీతో చెప్తే బావుండదని ఊరుకున్నాను. కావి వ్యవహారం ముదురుతుంటే ఉండబట్టలేక ... ''

—''ఛ ... డాలీ మా కళ్ళముందు పిల్ల, నెలల గుడ్డుగా ఉన్నప్పటి నుంచీ ఆ పిల్ల నెరుగుదురు మీ మామయ్య! స్నేహితుడి కూతురని తండ్రి లేని పిల్ల కదా అని ఆదుకుని ఉద్యోగం ఇచ్చేరు.

అంతపని చేస్తుందంటావా ... '' చివరి మాటలంటుంటే ఆవిడ కంఠం బాగా ఒణికింది, కళ్ళనిండా కన్నీళ్ళు నిండాయి. శకుంతలమ్మ బెదురు చూసి విజృంభించింది పార్వతి, అదే అదను అనుకుంటూ!

''అత్తా! డాలీ సంగతి అలా వుంచు! బీదరికంలో ఉంది. డబ్బు కోసం గడ్డి తింటుందనుకుందాం! మామయ్య! ఇంతవయసొచ్చి...ఛ... '' మరి చెప్పడానికి తనకే అసహ్యంగా ఉందనట్లుగా ఆగిపోయింది. శకుంతలమ్మ కొంచెంసేపు మౌనంగా ఉండిపోయింది. తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు కనిపించింది. అప్రయత్నంగా కారుతున్న కన్నీళ్ళను తుడుచుకుంటూ ...

''పిచ్చిదానా! మగాడికి వయసు ముదిరేకొద్దీ పోకిరీలక్షణాలు పెరుగుతాయి. నేను రోగిష్టిదాన్నయిపోబట్టి ఆయన అన్ని వేషాలు వేస్తున్నారు. నా ఖర్మ...'' బావురు మని ఏడ్చేసింది.

''బెంబేలుపడి ప్రయోజనం లేదు! ఉపాయం ఆలోచించాలి! మామయ్య మన వాడే కదా! ఆయన్నేమీ అనలేం! ఇక డాలీ! ఆమెని తిట్టనూ వద్దు. తుమ్మనూవద్దు...లాఘవంగా ఉద్యోగంలో నించి తప్పించేస్తే సరి!'' అత్తకి ధైర్యం చెప్పింది పార్వతి.

క్రిష్ణారావు ఉండే మేడమీదే అతని బిజినెస్సుకి సంబంధించిన ఆఫీసు ఉంది. డాలీ ఆంగ్లో ఇండియన్ గర్ల్. క్రిష్ణారావుకి పర్సనల్ సెక్రటరీ! ... అర్డర్లు బుక్ చెయ్యడం...ట్రంక్ కాల్స్ చూసుకోవడం... టైపింగ్ చూడటం ... విధి విరామం లేకుండా

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా స్పష్టంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ ''ప్రత్యేక'' సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥




## వి. ఆర్. పి. — విజయవాడ

నా వయస్సు 24 సంవత్సరములు. వారం రోజుల క్రితం నాకు పైల్సు వచ్చినట్లు తెలుసుకొన్నాను. అప్పటినుండి నాకు చాలా భయముగా వున్నది. వాటిని ఎలా నివారించాలో తెలియజేయండి?

★ నిపుణులైన శస్త్రవైద్యులచేత ముందుగా పరీక్షింపచేసుకొని వారి సలహా ప్రకారం ఆయింట్మెంట్లు వాడటమో, లేక శస్త్రచికిత్స చేయించుకోవటమో మాత్రమే నివారణా మార్గాలు.

## జి. వి. ఆర్. — ఖమ్మం

నా వయస్సు 36 సంవత్సరములు, మాకు వివాహమై 16 సంవత్సరములయినది. వివాహమైన రెండు సంవత్సరములకు 3 నెలల గర్భం పోయినది. ఇంతవరకూ సంతానము లేదు. ఈమధ్య కాలమునుండి నేను, మావారు మందులు వాడుచున్నాము. మూడు నెలల నుండి బహిష్టు సమయములో ఒక్క రోజు మాత్రమే రక్తస్రావము అగుచున్నది. అది గూడా చాలా తక్కువ.

★ మీరు నిపుణులైన లేడీ డాక్టర్లవద్ద పరీక్షింపచేసుకోవటం అవసరం. నెత్తురులో హీమోగ్లోబిన్ పర్సంటేజ్ మొదలయిన పరీక్షలు చేయించటం కూడా అవసరమే! పరీక్షల ఫలితాలను బట్టి డాక్టర్లు వైద్యం చేస్తారు. రోగనిర్ధారణ కాకుండా సలహా చెప్పటం కష్టం.

## ఆర్. ఎస్. ఎస్. ఎల్. - రాయగిరి

మా బాబు వయస్సు 5 నెలలు. మేము బాబుని నిలబెట్టినప్పుడల్లా రెండుకాళ్ళమీద సమముగా కాకుండా మడమలు ఎత్తి వ్రేళ్ళమీద నిలబడుచున్నాడు. ఇలా చూచి మేమంతా చాలా ఆందోళన పడుచున్నాము?

★ ఆర్థోపీడిక్ సర్జన్లకి మీ బాబుని వెంటనే చూపించండి. పుట్టినప్పుడే రాగల టాలిపెస్ ఈక్వైనో వారస్ అనే దానివల్ల ఇలా అయ్యే అవకాశం ఉంటుంది. కొంచెం వయస్సు వచ్చిన తర్వాత చిన్న శస్త్రచికిత్స చేయటమో, ప్రత్యేకమైన బూట్లను వాడటమో చేయటం వల్ల ఈ లక్షణాన్ని సరిచేయవచ్చును.

## ఇ. ఎస్. కె. - వగరి

పిల్లలు పుట్టిన వారానికే 'ఫిట్స్' ఎందువలన వస్తాయి? 15వ రోజువరకు బొడ్డు వూడనందుకు కారణమేమిటి? 'మాడు' గట్టిగా వుండి వాచినందుకు కారణమేమిటి?

★ పుట్టిన వారం లోపల ఫిట్స్ రావటానికి మెదడు పరిపక్వం చెందకపోవటం దగ్గరనుంచి పుట్టినప్పుడు తగిలే దెబ్బలదాకా చాలా కారణాలున్నాయి.

కొందరికి (శిశువులకి) అంబిలికల్ కార్డ్ ఎక్కువ ఫైబ్రస్‌గా ఉండటం వల్ల, గట్టితనం వల్ల బొడ్డు ఊడటం ఆలశ్యం అయ్యే అవకాశం ఉన్నది.

ఇకపోతే మీ మూడవ ప్రశ్న: మాడు గట్టిగా ఉండి, వాచినట్లు ఉంటే అది మెదడు పై పొరలు వాయటాన్నిగానీ, ఆ పొరలలో ఉండే ద్రవపీడనం (సెరిబ్రోస్పైనల్ ఫ్లూయిడ్ ప్రెషర్) అధికమవటాన్నిగానీ సూచిస్తుంది.

## ఎ. ఎస్. — అముదాలవలస

మావారు వారం రోజుల క్రితం కాళ్ళు పీకుతున్నాయి, కళ్ళు తిరుగుతున్నాయి, తల చాలా బరువుగా వుండి విపరీతమైన తలనొప్పి వస్తోంది అన్నారు. ఏ విచారమైన వార్తగాని విన్న వెంటనే చాలా నీరసము వచ్చి కాళ్ళల్లో సత్తువలేనట్లు అలా కూర్చుండిపోతారు. డాక్టరుకి చూపిస్తే బి. పి. ప్రారంభంలో వున్నది. మందులు, ఇంజక్షనులు వాడితే ఆదేమీ చేయదు అని అన్నారు.

★ డాక్టరు చెప్పినట్లే ఇంజక్షన్లు, టానిక్, మాత్రలు వాడండి. పై లక్షణాలు ఉన్నవారు ఎక్కువగా బి. కాంప్లెక్స్ మాత్రల రూపంలోగాని, ఇంజక్షన్ రూపంలోగాని వాడవలసి ఉంటుంది. నరాల బలహీనతవల్ల పై లక్షణాలు ఏర్పడతాయి గనుక, ఈ లక్షణాలు తగ్గనప్పుడు న్యూరోఫిజీషియన్ల సలహా పొందవలసి ఉంటుంది. ●

---

ఆఫీసులో అడుగు పెట్టిన దగ్గర్నుంచి సాయంత్రం డ్యూటీ దిగిపోయేదాకా పనిచేస్తుంది.

క్రిష్ణారావుకి డాలీమీద పుత్రికా వాత్సల్యం. ఆ అమ్మాయి పొందికతనం అంటే ఇష్టం. సిన్సియారిటీమీద గౌరవం, బీదరికంపట్ల జాలి! స్నేహితుడి కూతురు కాబట్టి, దూరంగా ఎక్కడో బెంగుళూరులో కాన్వెంటు చదువు చదువుతున్న అదే వయసు తన బిడ్డని శైలజని ... డాలీలో చూసుకుంటుంటాడు, ఆప్యాయత చూపిస్తాడు. చనువు తీసుకుంటాడు.

"డాలీ పోర్‌మీలిటెల్ కాఫీ డియర్" డాలీ ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసి క్రిష్ణారావుకి అందిస్తుంది.

"లైటప్ మై సిగరెట్ డార్లింగ్"

డాలీ సిగార్ లైటర్ వెలిగించి క్రిష్ణారావు పెదాల మధ్య ఉన్న సిగరెట్ ముట్టిస్తుంది.

ఆ చేష్టలేవీ ఇదివరకు ఎబ్బెట్టుగా అన్పించలేదు శకుంతలమ్మకి. పార్వతి రాజేసిన నిప్పు నెరుసు రగిలి రగిలి భగ్గున మండి శకుంతలమ్మని హైరాణ పెట్టి క్రిష్ణారావు ప్రాణం మీదికి తెచ్చింది.

## లవ్స్ లేబర్స్ లాస్ట్

గత్యంతరంలేక మూడు నెలల జీతం ఎదురిచ్చి బాధపడుతూనే డాలీని ఉద్యోగంలోనించి తీసేశాడు క్రిష్ణారావు. ఫలితంగా ఆఫీసులో ఆయనకి శ్రమ ఎక్కువయింది. ఇంట్లో చిరాకులు పెరిగిపోయేయి. "అనవసరంగా ఆయన్ని అనుకున్నామేమో! ఇప్పుడు పాపం పనంతా ఆయనమీద పడింది. ఎలా నీరసించి పోతున్నారో"...శకుంతలమ్మ పశ్చాత్తాపం కూడా పార్వతి సొమ్ముచేసుకుంది.

"డాలీ సంగతి నీతో చెప్పి మామయ్య శ్రమను అధికం చేసేను. ఆయనకి ఇంకో సెక్రెటరీని చూసే బాధ్యత నేను తీసుకుంటాన్లే... ఈసారి లేడీ సెక్రెటరీ వద్దు. నాకు తెల్సిన ఓ అబ్బాయి ఉన్నాడు."

శేఖర్ గుణగణాలు వర్ణించింది. అతను తనకెలా పరిచయం అయిందీ వివరించింది. 'అత్యవసరంగా అతనికి జాబ్ కావాలిట పాపం! సాటి కుఱ్ఱుడు. స్ఫురద్రూపి, మంచి డిగ్రీలున్నవాడు, మంచివాడు.'

శేఖర్ ఉద్యోగంలో చేరేడు. పనివాడితనంతో క్రిష్ణారావుని వశం చేసుకున్నాడు. మాట ఒద్దికతో శకుంతలమ్మ మనసు దూరగొన్నాడు. అందం, ఆకర్షణ, చలాకీతనం పణంపెట్టి, వేసవి సెలవుల కంటూ బెంగుళూరు నుంచి వరంగల్లు వచ్చిన శైలజ మనసు దోచేసుకున్నాడు.

రిజల్టు ... బిజినెస్‌లో పావలా వాటా కట్నం ఇస్తూ పిల్లనివ్వడానికి క్రిష్ణారావు దంపతులు నిర్ణయం తీసేసుకున్నారు.

పాపం ... పార్వతి! తను ప్రపోజ్ చెయ్యడమే తరువాయిగా తనని పెళ్ళి చేసుకుని వెంటనే వేరే కాపురం పెట్టేస్తాడని శేఖర్‌మీద ఆశలు పెంచుకున్న పార్వతికి మాత్రం ...

"లవ్స్ లేబర్స్ లాస్ట్"

తొలికోడి కూసేదాకా గతం నెమరుకి తెచ్చుకుని గుండె చిక్కబట్టుకుని, మొండి ధైర్యం తెచ్చుకుని...

పోనీలే.

"ఆల్ ఈజ్ నాట్ లాస్ట్"

"మరో ప్రయత్నం చేద్దాం."

అనుకుంటూ లేచి మామూలు పనులకి ఉపక్రమించింది పార్వతి. ●




(గత సంచిక తరువాయి)

కన్నతండ్రి కటిక దుర్మార్గుడు.

కట్టుకున్నవాడు మతిలేని మనిషి.

ఇక తన కెవరు దిక్కు ?

ఆ ముసలాడు తన గొంతు కోశాడు.

వంటికి రుద్దుకుంటున్న సబ్బు చేతిలోనుంచి జారి, బాత్ రూం గచ్చుమీద పరుగులు తీసింది.

ఆమె ఆలోచనలు సబ్బు బుడగల్లా అణిగి పోయాయి.

"సుజాతా ! సుజా !" భర్త కంఠం బిగ్గరగా విన్పించింది.

"అయిపోయిందండీ ! వస్తున్నా !"

ఐదు నిముషాల తర్వాత లంగా బాడీతో, టవల్ కప్పుకొని బయటికి వచ్చింది.

"ఏం చేస్తున్నావింతసేపు ?" భర్త గొంతు తీవ్రంగా ఉంది.

అతని ధోరణికి ఆమె విస్తుపోయింది.

"స్నానం చేస్తున్నాను" నసుగుతూ అన్నది.

తనతో ఆయన ఎప్పుడూ ఇలా మాట్లాడలేదు. మతిలేని మనిషే అయినా ఇలా ఏనాడూ మాట్లాడి ఎరగడు.

"కాదు నన్ను తిడుతున్నావ్ ?"

ఆమె భుజంమీదినుంచి టవల్ జారి కింద పడింది !

"తిడుతున్నానా ? ఎవర్ని ?" కిందకు వంగి టవల్ అందుకుంటూ అన్నది.

"నన్నే !"

సుజాతకు కాళ్లకింద నేల జరిగినట్టు అయింది. గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"నేను మిమ్మల్ని తిట్టడమేమిటండీ ? మీరేం మాట్లాడుతున్నారూ?"

"నన్నే తిట్టావ్ ?" అడుగు ముందుకు వేశాడు.

సుజాత రెండడుగులు వెనక్కు వేసింది.

తలుపుకేసి చూసింది.

బాత్ రూంకేసి చూసింది.

ఎటు తప్పించుకో గలదు తను?

"నన్ను తిట్టావుగదూ ? అయినా నేను నిన్ను తిట్టను. నువ్వు తిట్టమన్నా తిట్టను. తిట్టనంటే తిట్టను. తిట్టనుగాక తిట్టను !"

చప్పట్లు చరుస్తూ ప్రసాదు ఆమె చుట్టూ తిరగసాగాడు.

ఏమిటిది? హఠాత్తుగా ఇలా మారిపోయాడు?

అచ్చం తను హైదరాబాద్‌లో చేసినట్టే చేస్తున్నాడు.

మతిపోయినట్టు నాటకం ఆడి తనను ఇక్కడకు తీసుకొచ్చినట్టు ఈయన అర్థం చేసుకున్నాడా ? ఈయనకు మద్రాసు రావడం ఇష్టంలేదు.

మళ్ళీ శరత్‌బాబు ట్రీట్‌మెంటు ప్రారంభిస్తాడని అర్థం చేసుకున్నాడేమో ?

ఇప్పుడు గుర్తొచ్చింది !

ప్లేన్ ఆగుతుండగానే మొదలైంది.

దిగకుండా బయటికి చూస్తూ కూర్చున్నాడు.

మీనంబాకం ఎయిర్‌పోర్టు పరిసరాలు చూడగానే అతడిలో అలజడి మొదలైంది ఈ ఇంట్లోకి వచ్చినప్పటినుంచీ ఈయనలో వచ్చిన మార్పు తను గమనిస్తూనే ఉంది. ఇప్పుడు పూర్తి పిచ్చివాడిలాగే ప్రవర్తిస్తున్నాడు.

ప్రవర్తించడం ఏమిటి ?

పూర్తిగా పిచ్చివాడే అయిపోయాడు.

ఆ లక్షణాలన్నీ ఒక్కొక్కటే బయట పడుతున్నాయి.

"మీరు మంచివారు. ఎవర్నీ తిట్టరు" పసిపిల్ల వాడిని బుజ్జగించినట్టు అన్నది.

భర్త చెయ్యి పట్టుకుంది

ప్రసాద్ రక్కున ఆగిపోయాడు.

"అదుగో ! ఎవరో తలుపు తడుతున్నారు. శరత్‌బాబు అనుకుంటా" అన్నది సుజాత.

ప్రసాదు పిల్లిలా అయిపోయాడు. వెళ్ళి తలుపు తీశాడు.

శరత్‌బాబు లోపలకు రెండడుగులువేసి రక్కున ఆగి "సారీ !" అంటూ వెనక్కు తిరిగాడు.

సుజాత రొమ్ములమీద చేతులు అడ్డం పెట్టుకొని గోడవైపు తిరిగింది. సిగ్గుతో కుంచించుకుపోయింది.

ప్రసాదు అడుగులో అడుగువేసుకుంటూ బాత్ రూంలోకి నడిచాడు.

సుజాత చీర అందుకొని గబగబా కట్టుకో సాగింది

డ్రెస్ చేసుకొని, జడ చివర్లను వేళ్లకు చుట్టుకుంటూ బాత్‌రూంలో ఉన్న భర్తనుపిలిచింది. లోపలనుంచి సమాధానం రాకపోయేసరికి గాభరా పడింది బాత్‌రూం తలుపులుమీద దబదబాబాదింది.

తలుపులు తెరుచుకున్నాయ్. అవి గడియవేసి లేవు.

అలాగే నిలబడి చేతులు కడుక్కుంటున్న భర్తను చూసింది.

"ఏమిటింకా సాన్నం చెయ్యలేదేం ? చేయించ మంటారా ?" అన్నది

"నేనెప్పుడో చేశాను. చూడు ! నా వంటిమీద మురికిలేదు" అని వళ్ళు చూసుకుంటూ తనలో తనే నవ్వుకోసాగాడు.

సుజాతకు లోలోపల భయం వేస్తున్నది. భయాన్ని పైకి కనబడనీయకుండా "అవును ! మీ వళ్ళు చాలా శుభ్రంగా ఉంది. స్నానం చేశారుగా మరి !" బుజ్జగింపుగా అన్నది

ప్రసాదు ఆమె ముఖంలోకి చూశాడు.

ఆ చూపుల్లోని భావాలను అర్థం చేసుకోవడానికి సుజాత చేసిన ప్రయత్నం విఫలం అయింది.

"పదండి ! శరత్‌బాబు మనకోసం ఎదురు చూస్తుంటాడు" అనునయంగా అన్నది.

**జరిగిన కథ – 18 :** శరత్‌బాబుపై సుజాత పెంచుకొన్న అనుమానాలు వట్టి భ్రమలు మాత్రమేనని రేడియోలో వచ్చిన వార్తల ద్వారా తేలిపోతుంది. అయినా ఆమె అనుమానం మాత్రం అలాగే మిగిలిపోతుంది. శరత్‌బాబుకి 'మతి స్థిమితంలేదు' అని శివప్రసాద్ ద్వారా తెలుసుకొన్న సుజాత అతనిపై తన సానుభూతిని వ్యక్తం చేస్తుంది. సుజాత గత స్మృతుల్లోకి జారుకొంటుంది. సుజాతను చూడటానికి శివప్రసాద్ వస్తాడు. శరత్‌బాబు పెళ్లయిన కొద్దికాలానికే పిచ్చివాడయ్యాడని శివప్రసాద్ చెప్పగా, సుజాత దానిక్కారణం అతని భార్యేనని వూహించుకొంటుంది. శరత్ భార్య సునంద తనలాగే ఉంటుందనీ, ఈత నేర్చుకొంటూ నీళ్ళల్లోపడి మరణించిందనీ భర్తద్వారా విన్న సుజాత శరత్తే ఆమెని చంపి వుంటాడని అనుకొంటుంది. సుజాత ఏవేవో పీడ కలలు కంటుంది. శివప్రసాద్ ఢిల్లీ వెళ్లటానికి టికెట్ బుక్ చేసుకొంటాడు. సుజాత శరత్‌ని ఇంకా అనుమానిస్తూనే వుంటుంది. సుజాతకు పసుపు కొమ్ము, పసుపుతాడులో తన పెళ్లైన వైనం గుర్తొస్తుంది. క్యారియర్ మీల్స్ తెచ్చిన శరత్‌ను చూసి విస్తుపోతుంది. ఆ రాత్రి తనకు కాపలా పెట్టుకున్న పనిచేసే నర్సమ్మ కూతురు సుజాతని శరత్‌బాబే నీళ్లల్లో పడేసివుంటాడని అనుమానిస్తుంది సుజాత. ఇంతకీ అసలు పిచ్చివాడు శివప్రసాదేననీ, అతను తనకు స్నేహితుడేకాక పేషెంట్‌కూడానని సుజాతకు చెప్తాడు శరత్‌బాబు. సుజాత సహకారంతో అతన్ని మార్చటానికి ప్రయత్నిస్తుంటాడు. శివప్రసాద్‌కి ఇంతకుముందే పెళ్ళయిపోయిందనీ, ఆమె పేరు సునందనీ, పుష్కర స్నానాలకు వెళ్లి కృష్ణానదిలో మునిగిపోయిందనీ చెప్తాడు శరత్ సుజాతకు. తనకింకా పెళ్లి కాలేదనికూడా చెప్తాడు. ప్రసాద్ దగ్గర పిచ్చిదానిలా నటిస్తుంటుంది సుజాత డా॥ శరత్ సలహా ప్రకారం. సుజాతకు ట్రీట్‌మెంట్ కోసమని చెప్పి ప్రసాద్‌ను మద్రాసు తీసుకొస్తాడు శరత్.

''శరత్ కాదు — డాక్టర్—డాక్టరుగారూ—అను.''

''అలాగే! రండి!'' అంటూ సుజాత భర్తను గది బయటకు తీసుకొచ్చింది.

గదిముందే నిలబడి ఉన్న శరత్ కళ్ళల్లోకి చూసింది.

అర్థం అయిందన్నట్టు తల ఊపాడు శరత్.

శరత్‌బాబు డైనింగ్ హాల్లోకి దారితీశాడు.

ముగ్గురూ టేబుల్‌ముందు కూర్చున్నారు.

నాయర్ ప్లేట్లలో మూడు మూడు ఇడ్లీ పెట్టి సాంబారు బకెట్ అందుకున్నాడు.

సుజాత చెయ్యి అడ్డం పెట్టింది.

''ఇంతకుముందే చేశారుగా?'' ఖంగారుగా లేచి నిలబడింది సుజాత.

''ఇందాక బాత్‌రూంలో చేశాను. మురికి పోలేదు. సముద్రంలో చేస్తే మురికంతాపోతుంది. చూడు ఎంత మురికుందో?'' ప్రసాదు ముఖంమీద అరచేతితో రుద్దుకోసాగాడు.

''ప్రసాద్! సముద్రంలో ఇప్పుడు స్నానం చెయ్యకూడదు. ఎండ మండిపోతున్నది. ఇసుకకాల్తూ ఉంటుంది. ఉప్పు వంటికి అంటుకొని వళ్ళు ఇంకా మండిపోతుంది. ఇప్పుడు సముద్రంలో స్నానం చెయ్యకూడదు.'' ఆజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు

''ఆ భయం మీ కవసరంలేదు. ఈ మానసిక రుగ్మతల్లో ఎన్నో రకాలు ఉన్నాయి. తమ శరీరాన్ని బాధించుకుంటారు కొందరు. ఇతరులను బాధిస్తారు మరికొందరు. ఈ రెండూ చెయ్యనివాళ్ళు చాలామంది ఉంటారు. ఆ యా రుగ్మతలనుబట్టి వాళ్ల చేష్టలు ఉంటాయి. నిజానికి వాళ్ళు చేసే చేష్టలనుబట్టి, వాళ్ళ బాహ్య లక్షణాలనుబట్టే, వాళ్ల మానసిక రుగ్మత ఎలాంటిదో నిర్ణయిస్తాము. ప్రవర్తనసరళీ, బాహ్య లక్షణాలే అంతరిక కవాటాలను తెరుస్తాయి! అవి పరిశీలించేవారి అంతరాంతారాల్లోని రుగ్మతల్ని తెలుసుకోవడం జరుగుతుంది. ఆ లక్షణాల స్థాయి వ్యాధి తీవ్రతనుబట్టే ఉంటుంది. ప్రసాదుకు వచ్చిన రుగ్మత హింసా ప్రవృత్తిని ప్రేరేపించేది కాదు. ఆ విషయంలో ఎలాంటి భయం అక్కర్లేదు.



నాయర్‌కు అర్థంకాక ఆమెకేసి విలువుగుడ్లు వేసి చూశాడు.

''అందమ్మాళ్ సాంబార్ సాపడ మాటాంగో! చట్నీ కొండువా!'' నాయర్‌తో చెప్పాడు శరత్‌బాబు.

కాఫీ సిప్‌చేస్తూ దూరంగా సముద్రంలో లేచి పడుతున్న అలలకేసి చూస్తూ కూర్చుంది. డైనింగు హాలుకున్న ఫ్రెంచ్ విండోస్‌నుంచి బీచ్ రోడ్డూ, సముద్రం కన్పిస్తున్నాయి.

పల్లెకారులు పడవలు వడ్డుకు ఎక్కించి వలలు ఆరేసుకుంటున్నారు.

''ఉక్కబోస్తున్నది. వళ్ళంతా మండిపోతున్నది స్నానంచేసి వస్తా!'' తాగే తాగే కాఫీ కప్పు టేబుల్ మీద పెట్టి లేచి నిల్చున్నాడు ప్రసాదు.

శరత్‌బాబు.

''అయితే బాత్‌రూంలోనే చేస్తాను.'' ప్రసాదు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ గదివైపుకు నడిచాడు.

సుజాత లేచి భర్త వెనకే వెళ్ళబోతుంటే శరత్‌బాబు వారించాడు.

''ఇది మాకు అలవాటే! మీరు కూర్చోండి!''

''ఆయన బాత్‌రూంలో ఏమైనా...?''

బాత్‌రూంలోకి వెళ్ళి స్నానం చేస్తాడు. అంతే! అంతకంటే ఏమీ చెయ్యడు. లేకపోతే...''

''ఇంతకుముందే స్నానం చెయ్యకుండానే చేశానని చెప్పాడు?''

''ఈసారి చేసీ చెయ్యలేదని చెప్పొచ్చు.''

''పదిహేను నిముషాల ముందు వళ్ళు శుభ్రంగా ఉందన్నాడు. ఇప్పుడేమో మురిగ్గా ఉందంటు న్నాడు?''

"చిత్త చాంచల్యం అంటే అదే! మంచివాడికీ మతి చెడినవాడికీ ఉండే తేడా అదేమరి!"

"ఈ ఊళ్లో కాలు పెట్టగానే ఆయనకు వ్యాధి ముదిరిపోయింది!" బాధగా అన్నది సుజాత.

"ఇప్పుడే వ్యాధి తీవ్రం అయిందనడం పరిహాదు. ప్రత్యేక పరిస్థితుల్లో వ్యాధి లక్షణాలు బహిర్గతం అవుతున్నాయి. ఈ ఆసుపత్రి — ఈ ఇల్లు — నేనూ — నన్ను ఇప్పుడు డాక్టర్‌గానే గుర్తిస్తాడు — అతనిలో అర్ధచేతనావస్థలో ఉన్న రుగ్మత, చేతనావస్థలోకి రావడానికి ప్రయత్నిస్తోంది. ఇంతవరకూ బావి అడుగు భాగాన ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నవాడికి నీటి పై భాగానికి వచ్చినట్టుంది. మళ్ళీ అతను మునిగిపోకముందే బావి నుంచి లాగి ఒడ్డున పడెయ్యాలి. బావిలో పడ్డవాడ్ని నడుముకు తాడు గట్టి, గిలక మీదగా లాగినట్టు లాగి ఈ మానసిక వ్యాధిగ్రస్తులకు చికిత్స చేయాలి. తాడూ, గిలకా అక్కడ ఎంత ప్రధానమైనవో, ఇక్కడ మనం చికిత్సలో ఉపయోగించే సాధనాలూ పద్ధతులూ కూడా అంత ముఖ్యమైనవే, పరిశీలన, అవగాహన, విశ్లేషణ, అన్వయమూ, ఆచరణా, చికిత్సలో ప్రధానమైన భాగాలు."

గంభీరంగా వివరిస్తున్న శరత్‌బాబు కంఠం అకస్మాత్తుగా ఆగిపోయింది.

సుజాత అప్పుడే నిద్రలోనుంచి మేల్కొన్నట్టు శరత్‌బాబుకేసి చూసింది.

"ఏమిటాలోచిస్తున్నారూ ?"

ఆ ప్రశ్న బాణంలా ఆమె మస్తిష్కంలోకి దూసుకుపోయింది.

"ఆయనగారి పరిస్థితి బొత్తిగా ఏమీ బాగాలేదు. మీరు వెంటనే ట్రీట్‌మెంటు మొదలు పెట్టాలి."

"నేనూ అదే అనుకుంటున్నాను. సాయంకాలమే మొదలుపెడ్తాను."

"అయితే నేనిక ఈ నాటకం ఆపేయొచ్చుగా?"

"ఇప్పుడాపేయడమేమిటి ? మీరు హైదరాబాద్‌లో విమానం ఎక్కినప్పట్నుంచీ, నటి స్టేజీమీద డైలాగ్స్ మర్చిపోయినట్టే ఉంది మీ నటన!" మెల్లగా నవ్వాడు శరత్‌బాబు.

ఆమె పెదవులపై హాసరేఖలు అలలు అలలుగా కదిలిపోయాయి.

"మీరు ఇల్లంతా చూడలేదుగా ? రండి చూద్దురుగాని" శరత్‌బాబు లేచి నిల్చున్నాడు.

## మ న సు క థ

"మనం అటు వెళ్ళగానే ఆయనగారు గదిలో నుంచి వెళ్ళిపోతారేమో ?"

"అలాంటిదేమీ జరక్కుండా ఏర్పాట్లు చేశాను. వార్డుబోయ్ ఒకడు మెట్లమీద కూర్చుని ప్రసాదు ఎటూ వెళ్ళకుండా కాపలా కాస్తుంటాడు. రకరకాల పేషెంట్సు. ఎవరెవరి గురించి ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో ఆసుపత్రి సిబ్బంది అవన్నీ అమలు పరుస్తుంటారు. కమాన్!" అంటూ డైనింగ్ టేబుల్ ముందునుంచి డ్రాయింగ్ హాల్లోకి నడిచాడు.

సుజాత అతన్ని అనుసరించింది.

మూడు పడక గదులు, డైనింగ్, డ్రాయింగ్, స్టడీ, కారిడార్స్, బాల్కనీలు, సిట్ అవుట్స్‌తో అత్యంత ఆధునాతనంగా ఉన్న ఇంటిని చూస్తూ సుజాత ముగ్ధురాలైపోయింది.

ఆ ఇంట్లో ఫర్నిచరూ, తైల వర్ణ చిత్రాలూ, అలంకరణా చూస్తుంటే అతని ఈస్తటిక్ సెన్సుకు ముగ్ధురాలైంది. అతనిమీద గౌరవం పెరిగింది సుజాతకు.

ఇల్లంతా చూపించి స్టడీ రూంలోకి ఆమెను తీసుకొచ్చాడు.

లెదర్ బౌండ్సుతో పెద్ద పెద్ద పుస్తకాలూ, బల్లలకు అమర్చి చికిత్సా పరికరాలూ, రివాల్వింగ్ చైర్, డిమ్ లైటింగూ, కిటికీలకు అమర్చిన రంగుటద్దాలూ, గోడకానించి తెల్లటి స్క్రీనూ, ప్రొజెక్టరూ ఉన్నాయి. రెప్పలు వాల్చకుండా ఉత్కంఠతో చూస్తున్న సుజాతకు. 'ఆలిస్ ఇన్ వండర్ లాండ్' కథలోలా ఏవేవో ఊహాలోకాల్లోకి, స్వప్నలోకాల్లోకీ, గాలిలో తేలుతూ వెళ్ళిపోతున్నట్టుగా ఉంది.

మధురమైన సంగీతం — ఏవేవో అమూహ్యమైన భావ చిత్రాలు — దృశ్యాలూ — రూపాలూ — ఇంద్రధనస్సుల రంగులూ — కాంతి పుంజాలను వెదజల్లుతూన్న చక్రాలూ—ఎక్కడ్నుంచి ఎక్కడికో— ఆదిమధ్యాంతాలు లేని విరాట్ స్వరూపాలు!

"డాక్టర్ — డాక్టర్ — !"

శరత్‌బాబు ప్రొజెక్టర్ స్విచ్ ఆఫ్ చేశాడు.

కాల్పనిక జగత్తునుంచి వాస్తవికా జగత్తులోకి, మంచుకొండ శిఖరాగ్రంనుంచి జారిపడినట్టు అయింది సుజాతకు.

"డాక్టర్! డాక్టర్!"

## ఇదే సంగతి

డా॥ సి. నారాయణరెడ్డి

ఇది నగరం
ఇక్కడ కోకిల కూయదు.
కూసినా దాని పంచమస్వరం
డిస్కోల గగ్గోలులో
నిద్రక్కమిస్తుంది
గాంధారంలోకో గార్దభంలోకో.

ఇక్కడ వేపచెట్టు దొరకదు
దొరికినా అది పూయదు.
పూసినా ఆ పూత మిగలదు
అది ఎగిరిపోతుంది
పరమ చేదు తీసిని
బిరడాలో బిగించే సీసాల్లోకి.

శరత్ స్టడీరూం తలుపు తెరచి గదినుంచి బయటికి వచ్చాడు.

సుజాత అతన్ని అనుసరించింది.

"హలో రోజీ వాట్ ఈజ్ ద మేటర్ ?" ఎదురుగా నిల్చుని ఉన్న రోజాను చూసి అడిగాడు శరత్‌బాబు.

రోజా తనకు ఎదురుగా నడిచివస్తున్న సుజాతను చూసి నిశ్చేష్టురాలై నిలబడిపోయింది! కనురెప్పలు వాల్చకుండా సుజాతను చూస్తూ నిలబడిపోయింది.

సుజాత పాదాలు నేలకు అతుక్కుపోతున్నయ్.

రోజాను చూస్తున్న సుజాతకు నిలువుటద్దంలో తన ప్రతిబింబాన్నే చూస్తున్నట్టుగా ఉంది.

విస్మయంతో రోజా ముందు సుజాత నిలబడిపోయింది.

వారిద్దరిమధ్యా కొద్ది క్షణాలు కాలమే నిలిచిపోయింది.

ఆ వాతావరణమే చైతన్యరహితంగా ఉన్నట్టు ఉంది.

పాలరాతి ప్రతిమల్లా నిలబడి ఉన్న వాళ్లిద్దరి మధ్యా శరత్‌బాబు కదిలాడు.

ఇద్దర్నీ మార్చి మార్చి చూశాడు.






ఒక అడుగు వెనక్కు వేసి సుజాత వైపు తిరిగాడు.

"ఈమె మా అసిస్టెంట్! డాక్టర్ రోజా!" రోజా వైపు తిరిగి "వీరు శ్రీమతి సుజాత!" అని పరిచయం చేశాడు.

ఇద్దరూ ఒకేసారి కదిలారు.

సుజాత చేతులు దగ్గరకు తీసుకొని "నమస్కారం" అన్నది.

"నమస్తే!" ముభావంగా జవాబిచ్చింది రోజా.

"డాక్టర్ ట్రిప్లికేన్‌నుంచి మళ్ళీ ఆండాళ్లమ్మను తీసుకొచ్చారు. షి ఈజ్ మేకింగ్ ఏ బిగ్ సీన్ దేర్!"

"ఏదీ ఆ హిస్టీరికల్ పొజిషన్ సిండ్రోమ్ కేసేనా?" అన్నాడు శరత్‌బాబు నవ్వుతూ.

"అవును డాక్టర్! ఆ కేసే!"

"ఇప్పుడే వస్తాను — ఈలోపల ఆమెను ట్రీట్‌మెంటు రూంలోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టండి. ఆమెమీద బలప్రయోగం చెయ్యొద్దు. మెల్లగా బుజ్జగించి, బతిమిలాడి, తీసుకెళ్ళండి."

"వినడంలేదు. ఆమె చాలా ట్రబుల్ ఇస్తోంది డాక్టర్." నీరసపడిపోతూ అన్నది రోజా.

"యు మస్ట్ నాట్ లూజ్ యువర్ నర్వ్! యు మస్ట్ ట్రై! ఓర్పు కావాలి. వస్తున్నా పద!" అన్నాడు శరత్‌బాబు చిరునవ్వుతో రోజా కేసి చూస్తూ.

వెళ్తూ వెళ్తూ, ఓరగా ఓసారి సుజాతను చూసి, వెళ్ళిపోయింది డాక్టర్ రోజా.

అలా వెళ్తున్న రోజాను తదేకంగా చూస్తూ సుజాత — "ఆమె ఎవరూ?" తనను తనే ప్రశ్నించుకుంటున్నట్లు అన్నది.

"దెయ్యం పట్టిన మనిషి!" పరధ్యాన్నంగా చెప్పాడు శరత్.

సుజాత ఉలిక్కిపడింది!

"రోజా దెయ్యం పట్టిన మనిషా?"

"ఛ! ఛ! రోజా ఇక్కడ డాక్టర్ అని చెప్పానుగా? ట్రిప్లికేన్ ఆండాళ్ళమ్మ దెయ్యం పట్టిన మనిషి. మనవాళ్ళు ఇలాంటి వ్యాధిగ్రస్థులను దెయ్యం పట్టిన మనిషి అంటారు. వాస్తవానికి దెయ్యమూ లేదు. దేవతా లేదు! మానసిక రుగ్మతల్లో ఇదో రకం దానినే మెడికల్ భాషలో "హిస్టీరికల్ పొజిషన్ సిండ్రోమ్" అంటారు. పూనకం అంటారే! అదీ ఇదీ ఒకటే! సరే మీరు మీ గదికెళ్ళి రెస్టు తీసుకోండి తిరిగి ఒంటి గంటకు వస్తాను. అంతవరకూ పేషెంట్సుతోనే నాకు సరిపోతుంది."

"నేనూ మీతో రావచ్చా?"

"ఆండాళమ్మను చూస్తారా?" నవ్వుతూ అన్నాడు.

"ఇక్కడికి రోజూ అలాంటివాళ్ళు వస్తూనే ఉంటారు. ఎప్పుడుబడితే అప్పుడే చూడొచ్చు! గదిలో ప్రసాదు ఏం చేస్తున్నాడో చూడండి ఓ. కే. వస్తాను" అంటూ శరత్‌బాబు మెట్లు దిగి వెళ్ళిపోయాడు.

(ఇంకా వుంది)

# బాల్య వివాహాలు

చిన్నకోట సుశీలాదేవి



రాజస్థాన్‌లోని మేవాడ్ ప్రాంతంలో ఒక రోజున పదివేల బాల్య వివాహాలు జరిగినట్లు పత్రికలో వార్త ప్రచురితమైంది. బాల్య వివాహాలను నిషేధిస్తూ శారదా బిల్లు ప్యాసయి అర్ధశతాబ్దం పైన అయింది. కాని ఇంకా బాల్య వివాహాలు జరుగుతూనే వున్నాయి!

బాల్య వివాహాలను గురించి 1926లో గాంధీగారు ఈ విధంగా అన్నారు — "బాల్య వివాహము శాపం నైతికంగా, శారీరకంగా చెడ్డది. అది మన నైతిక బలమును క్షీణింపచేసి, శరీరాన్ని కృశింపచేస్తుంది. ఈ దురాచారమును మనము వుపేక్షించుటచే భగవంతునికి, స్వరాజ్యానికి కూడా దూరమౌతాము."

ఋగ్వేదకాలంలో బాల్య వివాహాలు లేవు. బాలికలు తండ్రి ఇంటనే పెరిగి పెద్దవారై ఇష్టముంటే వివాహమాడేవారు, లేకపోతే జీవితమంతా అవివాహితలుగా వుండే స్వేచ్ఛ వారికుండేది.

తరువాత సూత్రకాలంలో వివిధ సూత్రకారులు స్త్రీ వివాహ వయస్సును గూర్చి చర్చించారు. గృహ్య సూత్రాలు క్రీ.పూ. 6వ శతాబ్ది మొదలుకొని బౌద్ధమతం వ్యాప్తి చెందే వరకు వస్తున్నవి. ఆడపిల్ల "నగ్నిక"గా వున్నప్పుడే వివాహం చేయటం మంచిదని ఒక సూత్రకారుడు చెప్పాడు. "నగ్నిక" అను పదం నగ్నము (దిగంబరమైనది) అనే పదం నుండి ఏర్పడింది. బట్టలు వేసుకొనుట చేతకాక దిగంబరిగా నుండు 5,6 సంవత్సరముల పిల్ల అని కొందరు దీనికి అర్థం చెప్పారు. "వస్త్ర విక్షేపణార్హా నగ్నికా మైథునార్హా ఇతి అర్థః" అనగా ఏకాంతమున వివస్త్రను చేయుటకు తగిన వయస్సు అని మరికొందరు అంటున్నారు.

మహాభారతంలో 16 సం. వయస్సు కలిగిన నగ్నికకు వివాహం చేయవలెనని చెప్పబడివుంది. అంటే యౌవనము వచ్చి పరిణత శరీరయైన స్త్రీనే నగ్నిక అనేవారు. పైగా గృహ్య సూత్రాలలో వధూవరులు వివాహమైన తర్వాత 3 రోజులు బ్రహ్మచర్య మవలంబించి నాల్గవరోజున భోగించవలెనని చెప్పబడి వుండుటచే స్త్రీ పురుషులు మైథునార్హమైన పరిణత వయస్సునందే వివాహమాడవలెనని సూత్రకారుని అభిప్రాయమై ఉంటుంది.

వాత్సాయనుడు కూడా బాల్య వివాహాలను ప్రోత్సహించలేదు. అతడు వధువునకు "ప్రాప్త యౌవన" "విగాఢ యౌవన" అనే పేర్లను వాడాడు.

"అష్టవర్షా భవేత్కన్యా" అన్న మాట మనువుతో వచ్చింది. ఆయనే పురుషుని వివాహ వయస్సుతోపాటు స్త్రీ వివాహ వయస్సు కూడా నిర్ణయించాడు. 30 సం. పురుషుడు తనకు నచ్చిన 12 సం. బాలికను, 24 సం. పురుషుడు 8 సం. బాలికను చేసుకోవాలని శాసించాడు. ఆ మాటయే స్త్రీలకు ప్రాణాంతకమైన వురితాడు అయి కూర్చుంది.

మహాభారతంలో ఒకచోట 8 సం. బాలికకు వివాహం చేయాలని చెప్పబడింది. కానీ భారతంలోని స్త్రీలందరూ (శకుంతల, సావిత్రి, సుభద్ర, రుక్మిణి మొ.వారు) ప్రేమించి వివాహం చేసుకొన్నవారే! అంటే వధువు శారీరక, మానసిక పరిణత కలిగివుండేదని తెలుస్తోంది. గృహ్య సూత్రాలలో చెప్పబడిన గృహిణీ విధులు బాలిక చేయగలిగినవి కావు. అందుచే ప్రాచీనకాలమున బాల్య వివాహాలు లేవని చెప్పవచ్చును.

ఈ బాల్య వివాహాలు మధ్య యుగం నాటికి పూర్తిగా అమలులోకి వచ్చాయి. ఇవి ఏర్పడ్డానికి విమర్శకులు కొన్నికారణాలు చెప్తారు. అందులో ఒకటి హిందూ సంఘంపై మతప్రాబల్యం ఎక్కువై పోవడం. దీనివలన ధర్మశాస్త్రాలకు ముఖ్యంగా మనుధర్మశాస్త్రానికి ప్రాముఖ్యం కలిగింది. మనువు చెప్పిన విధంగా బాల్య వివాహాలు బాగా అమలులోకి వచ్చాయి. 5,6 సం.లకే ఆడపిల్లకు వివాహం జరిపించడం ఆచారమైపోయింది. స్త్రీకి వివాహం తప్పనిసరి అయింది.




ముస్లిములు వివాహంకాని బాలికలను ఎత్తుకుపోయి పెళ్లి చేసుకొనేవారని, అందుకని హిందూ తల్లిదండ్రులు తమ పిల్లలకు చిన్నతనమందే వివాహం చేసేవారని, ముస్లిములే బాల్య వివాహాలకు కారణమని కొందరు వాదిస్తారు. కాని ముస్లిము రాజులలో కొందరు ఈ దురాచారాన్ని పోగొట్టడానికి ప్రయత్నించినట్లు చరిత్రలో కనబడుతుంది. అక్బరు రజస్వలానంతరం వివాహాలు చెయ్యమని సలహా చెప్పాడు! కానీ ఎవ్వరూ వినలేదు. ఒకవేళ విమర్శకుల మాటే నిజమైతే హిందూ పురుషులు మహమ్మదీయుల బారినుండి దేశాన్నేకాక భార్యా పిల్లలను కూడా రక్షించుకోలేనంతగా నిర్వీర్యులైపోయారన్న మాట.

బాల్య వివాహాలు ఏర్పడ్డానికి మరొక కారణం సమిష్టికుటుంబం. దీనివలన అతి చిన్నవయస్సులోనే బాలికలకు లైంగిక స్ఫురణ కలిగేది. అందుచే ఆమెకు రజస్వల కాకముందే వివాహం చేసేవారుట.

కారణం ఏదైనా మధ్యయుగంనాటి హిందూ సంఘంలో బాల్య వివాహాలు సర్వసాధారణమైపోయాయి. రజస్వలానంతర వివాహం జరిగితే తండ్రి, తాత, ముత్తాత మరుజన్మలో పురుగులుగా జన్మిస్తారనే ఒక మూఢనమ్మకం తండ్రులను భయపెట్టింది. స్త్రీ పవిత్రురాలిగా వుండాలంటే 8 ఏండ్లకే వివాహం చేయాలనే భావం పురుషునికి ఏర్పడింది. స్త్రీలు బలహీనులు, స్వతంత్ర శక్తి లేనివారు అనే భావంలోనుండి ఆనాటి జాతి పతనం ప్రారంభమైందని శ్రీ ఎ.సి. దాసుగారు అంటారు.

కూతుళ్లమీద ఎంత ప్రేమవున్నా, బాల్య వివాహ దురాచారం తండ్రుల గుండెలపై రాయై కూర్చుంది. రజస్వల కాకముందే కూతురి పెళ్లి చేయాలి. లేకపోతే సంఘంచే వెలివేయబడతాడు. కొన్ని సమయాల్లో పెళ్లికాని కూతురును వూరు బయట పాకలో వుంచేవారు. వండుకునేందుకు బియ్యం వగైరా ఇచ్చేవారు.

అంతేకాదు. ఆ కాలంలో ఆడపిల్ల అందంగా వుంటేనే వరుడు దొరికేవాడు. కూతురు అందగత్తె కాకపోయినా, శారీరక వైకల్యమున్నా ఆ తండ్రి బాధ అంతా, ఇంతాకాదు. స్త్రీ తన విజ్ఞానాన్ని వికశింపచేసుకుని అంగవైకల్యాన్ని మరపింప చేసుకొనేందుకు తగిన అవకాశాలు లేవు. తండ్రి ధనమిచ్చి కూతురి వివాహం చేసేవాడు. డబ్బు కాశపడి చేసుకొన్నా తర్వాత కొద్ది కాలంలోనే ఆమెను వదిలిపెట్టేవాడు. అలా వదిలి వేయబడిన స్త్రీ జీవితం మరీ దుర్భరంగా వుండేది.

మధ్యయుగంలో మనదేశానికి వచ్చిన విదేశీ యాత్రికులు భారతదేశంలో హిందువులలో జరుగుతున్న బాల్య వివాహాలను గూర్చి వ్రాశారు. 16వ శతాబ్దంలో వచ్చిన "ఫిచ్" అనే వ్యాపారస్తుడు 10 ఏండ్ల బాలికలకు పెండ్లి అయేదని వ్రాశాడు. 17 శ.లో మాట్లాడటం కూడా రాని పిల్లలకు పెళ్లి చేసేవారని ఏ పరిస్థితులలోనూ 10 ఏండ్లు దాటనివ్వరని "మనూచీ" వ్రాశాడు. "టెవర్నర్" అనే విదేశీయుడు ఏడు సంవత్సరాల బాలికలకు పెళ్లి అయ్యేదని వ్రాశాడు. బ్రిటిషువారు ఈ దేశానికి వచ్చేటప్పటికి హిందూ బాలిక వివాహ వయస్సు 8 లేక 9 సంవత్సరాలు. వారు ఈ దేశాన్ని

పాలించేనాటికి స్త్రీల స్థితి భారతదేశంలో ఎప్పుడూ లేనంత హీనస్థితిలో వుంది.

బాల్య వివాహం వలన బాల వితంతువుల సంఖ్య పెరిగింది. బాల వితంతువుగానైనా వుండాలి లేదా భర్తతో చితిమీద కాలిపోవాలి. 7,8 సం. లోపు కన్యలకు వివాహం జరుగుట వలన మామూలుగా చదువుకునే అవకాశం లేకుండా పోయింది. జీవితమంతా అజ్ఞానాంధకారంలోనే వుండవలసి వచ్చింది.

అంతేకాక బాల్య వివాహాల వలన చిన్న వయస్సులోనే తల్లులై పెక్కుమంది ప్రసవ కాలముననే మరణించేవారు. 1931లో ప్రచురింపబడిన కరపత్రము ననుసరించి భారతదేశంలో ఆనాడు ప్రసవ సమయంలో జరిగిన మరణాల సగటు సంఖ్య సంవత్సరానికి రెండు లక్షలు. ఇలా మరణించేవారిలో అధిక సంఖ్యాకులు 20 సం. లోపు బాలికలు. ఈ దురాచారం తల్లికేకాక బిడ్డకు కూడా చెరుపు చేస్తుంది. 1931 జనాభా లెక్కల ప్రకారం ప్రతి వెయ్యిమంది పిల్లల్లో 181 మంది పుట్టిన వెంటనే మరణిస్తున్నారు. కొన్ని ప్రాంతాల్లో వెయ్యికి నాలుగువందల మంది కూడా చనిపోయారు.

నిరంతరం గృహ కృత్యాలు నిర్వహించడంవల్ల, బాల్యంలోనే తల్లిగా మారి, ఆ తర్వాత ప్రతి సంవత్సరం కలిగే గర్భధారణ వలన శారీరక, బలహీనతలకు, అంగవైకల్యాని గురియై భార్య

## బాల్య వివాహాలు

భర్తకు నిరుపయోగం అవుతోంది. దీనివలననే తర్వాతి కాలంలో వేశ్యలకు ప్రాముఖ్యం హెచ్చింది. దేవాలయాలలోనూ, పుణ్య క్షేత్రాలలోనూ వారికి వున్నత స్థానం లభించింది! (యుగములలో స్త్రీ— పి. థామస్)

"హిందూ సంఘంలో స్త్రీ పురుషులకు సరైన విద్య, సాంఘిక దృక్పథం లేకపోవుటచే ఈ అనర్థం వ్యాప్తి చెందినదిగానీ, దీనిని తొలగించుట కష్టంకాదని" కొందరు భావించారు!

మనకు స్వాతంత్ర్యం వచ్చింది. స్వతంత్ర భారతం 35 ఏండ్లు పాలించింది. స్త్రీ విద్యా వ్యాప్తి, స్త్రీ జన సంక్షేమ కార్యక్రమాలు జరుగుతున్నాయని చెప్తున్నారు. కానీ ఇప్పుడు రాజస్థాన్‌లో బాల్య వివాహాలు జరిగాయి. దీనికి ఎవరిని నిందించాలి!

ఆడుకుంటూ, పాడుకుంటూ, చదువుకుంటూ కాలం గడపాల్సిన వయసులో మాతృత్వ భారాన్ని, కుటుంబ నిర్వహణ బాధలను, భర్త అధికారాన్ని భరించేట్లు చేసే ఈ బాల్య వివాహాలు గర్హనీయాలని వేరే చెప్పనక్కర్లేదు. ఋగ్వేదాచార్యుల కాలంలో స్త్రీ సుఖశాంతులు అనుభవించింది. ఆనాటి నుండి నేటివరకూ బాధామయ జీవితాన్నే గడుపుతూ వచ్చింది. ఇప్పటికీ ఈ దురాచారదాస్య శృంఖలాల నుండి విముక్తి లభించడం లేదు.

మహాత్మా గాంధీ మాత్రం స్త్రీ బాధలను అర్థం చేసికొని, స్త్రీ హృదయంతో తాదాత్మ్యం చెంది బాల్య వివాహాన్ని గూర్చి ఏ స్మృతికారుడు చెప్పని మాటలు 1926లో చెప్పారు!

"బాల్య వివాహాలను గూర్చిన లెక్కలు చూసి మనమందరము సిగ్గుతో తలవంచుకోవాలి. ఈ దురాచారం పట్టణాలలో ఎంతగా వ్యాపించిందో గ్రామాలలోనూ అట్లే వున్నది. దానిని తొలగించుట ప్రధానంగా స్త్రీల పని! పురుషుడుకూడా ఈ కార్యములో పాల్గొనాలి. కానీ పురుషుడు మృగముగా (గాంధీగారు వాడిన బీస్ట్ అనే పదానికి తెలుగు) మారిన తర్వాత అతడు హేతువాదాన్ని వినడు. కాబట్టి తల్లులే తమ పిల్లలకు బాల్య వివాహాలు వద్దని భర్తలతో చెప్పి వాటిని జరపకుండా చూడాలి. దీనికై తల్లులు మొదట విద్యావంతులవ్వాలి. స్త్రీలను విద్యావంతులుగా చేయడానికి స్త్రీలే పూనుకోవాలి. అఖిల భారత మహిళా సభ దానిపేరు సార్థకం చేసుకోవాలంటే గ్రామ గ్రామాలకు వెళ్లి, స్త్రీ విద్య వ్యాప్తి చేయాలని సూచించుటకు సాహసించుచున్నాను"

'తమసోమా జ్యోతిర్గమయ.' 



# చూపు

అలపర్తి రామకృష్ణ

రాజయ్య నిద్రలేచేక, కళ్ళు తెరవకుండావే దిండు కింద పేకముక్కలు తీసేడు. పేకముక్కల్లో నాలుగు ముక్కలు అతని చేలిలోకి వచ్చేయి.

అయిష్టాల్ని, ఇష్టాల్ని ఆ పేకముక్కల్లో చూసుకోవడం, తిట్టుకోవడం, సంతోషించడం — అతనికి అలవాటు.

కళ్ళు తెరిచి చూసేడు.

అస్పష్టంగా కన్పించేయి పేకముక్కలు.

వెనుకటి రోజుల్లో ఏదన్నా తప్పుపనిచేస్తే ''కళ్ళు పోతాయిరా !'' అనేవారు. ఎలాపోతాయో చెప్పలేకపోయేవారు. మరి యిప్పుడు డాక్టర్లు మాత్రం సుఖవ్యాధుల ప్రభావానికి కంటిచూపు దెబ్బ తింటుందని స్పష్టంగా చెప్పేస్తున్నారు.

రాజయ్య ఆ బాపతే! సగం కంటిచూపు పోగొట్టుకుని కంటి ఆసుపత్రిలో కాలక్షేపం చేస్తున్నాడు.

ఆ నాల్గు ముక్కల్లో —

''డైమెండ్‌రాజు'' అస్పష్టంగా కన్పించగానే, తనో మహారాజయినట్లు ఆనందంలో మునిగిపోయేడు.

రెండో ముక్క తీసి చూడగానే ''ఆటీన్‌రాణి'' కన్పించింది. కామేశం భార్య చిలకమ్మ నవ్వుతూ పలుకరించినట్లనిపించింది.

ఆ తర్వాత ''ఇస్పేట్ జాకి'' తనను ఎప్పుడూ కసురుకునే చిన్నడాక్టరు. వాడి ఉద్యోగం వూడిపోతే బాగుండుననుకున్నాడు.

ఆఖరి ముక్క ''కళవర్ పది'' అమాయకంగా నవ్వుతూ కామేశం కన్పించేడు ఆ ముక్కలో.

మళ్లీ దిండుకింద ఆ ముక్కల్ని దాచేసేడు వర్సు రావడంతో. బాత్‌రూముకేసి మెల్లగా నడుచుకుంటూ వెళ్ళి ముఖం కడుక్కుని మళ్ళీ బెడ్‌మీదకు చేరుకున్నాడు. ఆలస్యం చేసినందుకు చీవాట్లుపెట్టి, 'కేస్‌షీట్' చూసి ఇంజెక్షన్స్ చేసి టాబ్‌లెట్లు యిచ్చింది.

వార్డ్‌బాయ్ బ్రెడ్‌ముక్కలు, టీ తీసుకురావడంతో ''ఎనెక్సీ వార్డు''కి పెళ్ళి కళవొచ్చింది. రోగులందరూ వార్డ్‌బాయ్ చుట్టూ చేరారు. అది కంటి ఆసుపత్రి అవడంతో చాలామంది కళ్ళకి బ్యాండేజి కట్టుగుడ్డలున్నాయి.

ఆసుపత్రిలో రాజయ్య, కామేశం వొకేరోజు చేరారు. ఇద్దరూ వొకవూరివాళ్ళే. కామేశంకు బాగా తాగుడు అలవాటుండటంతో బి. పి. రైజయి కంటిచూపు తగ్గింది. రాజయ్యకి కళ్ళల్లో హెమరేజెస్ డెవలప్ అయ్యి 'ఈల్స్' వ్యాధి చోటు చేసుకుంది.

వాళ్ళకుమాత్రం తిన్న వస్తువేదో సరిపడక కంటి జబ్బులు వొచ్చాయని గట్టి నమ్మకముంది. డాక్టర్లు చెప్పేమాటలు వాళ్ళకు అర్థంకావు. అవి భయంకరమైన కళ్ళ జబ్బులని డాక్టర్లు చెప్పినా వాళ్ళు నమ్మరు. ఆసుపత్రిలో వారం రోజులుంటే అవే తగ్గిపోతాయనుకున్నారు. ఇద్దరికి ముప్పైఏళ్ళు వుంటాయి.

అసిస్టెంటు సర్జన్ రౌండ్స్‌కు రావడంతో అందరూ సర్దుకుని మంచాలపై పడుకున్నారు.

కామేశం కళ్ళలోకి స్కోప్‌లైట్ వేసి కళ్ళు పరీక్షచేశాడు అసిస్టెంటు సర్జన్.

''ఫండస్ యింకా క్లియర్ కాలేదు'' —తన పక్కన నిలబడి శ్రద్ధగా చూస్తున్న యవ్ ఒ.యస్. స్టూడెంటుతో అన్నాడు అసిస్టెంటు సర్జెన్.

''కన్ను బాగవుతుందా దొరా!'' — కామేశం ఆతృతగా అడిగేడు.

''ఒక కన్ను పూర్తిగా పోయింది. మరోసారి తాగావంటే ఆ రెండో కన్ను కూడ గుటుక్కుమంటుంది.''

రాజయ్యకి నవ్వొచ్చింది చిన్నడాక్టరు మాటలకు. కామేశంగాడికి రెండుకళ్ళూ పోతే బాగుంటుందని మరోసారి మనస్సులో అనుకున్నాడు.

''ఏమిటా ఫోజు ? రాజాగారిలా కాలుమీద కాలేసుకుని చిరునవ్వులు వొలకబోస్తూ పడుకున్నావ్! సరిగ్గా పడుకో రాజయ్య తండ్రీ!'' అసిస్టెంటు సర్జన్ గట్టిగా కోప్పడ్డాడు.

''ఇలనెప్పుడూ సెప్టిక్‌వార్డు ఫిమేల్ వార్డుల చుట్టూ తిరుగుతూ వుంటాడు సార్ '— రాజయ్య గూర్చి డాక్టరుతో కంప్లైంట్ చేసింది.

''ఇతని కేసేమిటి సార్ ?'' అసిస్టెంటు సర్జన్ని అడిగేడు స్టూడెంటు.

''మొహం చూస్తే కన్పించడంలా ! వెనిరల్ డిసీజెస్‌తో ముఖమంతా మచ్చలతో, నల్లటి పొక్కులతో పుచ్చిపోయివుంది చూడు. పైగా టి.బి. జబ్బుకూడ వుంది. కంట్లో హెమరేజ్‌లు వొచ్చి చూపు తగ్గింది. ఈ కేస్‌ని 'ఈల్స్' అంటారు. పేషెంటు జాగ్రత్తగా వుంటే తప్పితే ఈ వ్యాధి







పూర్తిగా నయం కావడం కష్టం'' ఇంగ్లీషులో యస్. ఒ. యన్. స్టూడెంటుకి చెప్పేడు.

''ఇప్పటికీ ఈ అందగాడు 'ఫిమేల్' వార్డుల చుట్టూ తిరుగుతూ వుంటాడట''

అసిస్టెంటు సర్జన్ మాటలకి వొళ్ళంతా కదిలిపోయేటట్లు నవ్వింది నర్సు.

''ఎందుకలా నవ్వుతావ్?'' ఆమె బుగ్గని సరదాగా గిల్లాడు అసిస్టెంటు సర్జన్.

స్టూడెంటు చిన్న గురువుగారి సరసాలకి సిగ్గుపడి మెలికలు తిరిగిపోయేడు. ఆ 'మంచి' రోజులు తనకెప్పుడొస్తాయోనని కొన్ని క్షణాలు ఆలోచనలోపడ్డాడు.

నర్సు కిలకిలా నవ్వుతూ ఆ హాల్లో సోడియం వేపర్ లైట్‌లా వెలుగుతూవుంది. ఆమె వెదజల్లే వెలుగుల్ని భరించే శక్తిలేక కళ్ళు మూసుకుంటున్నారు రోగులు.

''సుప్రియలాంటి నర్సు వొక్కరుంటే రౌండ్స్ ఎన్ని గంటలయినా హుషారుగా గడిపెయ్యొచ్చు! తాతాబెంజ్ బండికి డ్యూటీ పడిందంటే చాలు హాల్లో వొక్క నిముషంకూడ వుండాలనిపించదు'' అన్నాడు అసిస్టెంటు సర్జన్.

ఆయన హాల్లో ఐదునిముషాలున్నా, ఐదు గంటలున్నా రోగులకి వొరిగేదేమిలేదు.

సివిల్ సర్జన్ రావడంతో అందరూ కుక్కిన పేనల్లే అయిపోయేరు. పెద్దడాక్టరంటే అందరికీ హడల్! రోగులందరిని పరీక్షచేసి ఎవరెవరికి ఏయే మందులు వాడాలో, ఎవర్ని డిశ్చార్జి చెయ్యాలో అసిస్టెంటు సర్జన్‌కి సూచనలు యిచ్చాడు. ముందే డబ్బులు సమర్పించుకున్న పేషంట్లను ప్రత్యేక శ్రద్ధతో చూస్తున్నాడు.

''రాత్రంతా కంట్లో వొకటే పోటుసార్! ఆ నొప్పికి నిద్ర కూడ పట్టలేదండీ! ఈ హాస్పిటల్ కొచ్చేక అంతకుముందున్న చూపుకూడ పోయింది సార్''—వల, వలా ఏడ్చేడు వో పేషంటు.

పాలలో పూర్తిగా నీళ్ళు కలిపినా, పాలలో నీళ్ళు కలిపేయంటే పాల వ్యాపారికి కోపం వొచ్చినట్లే పెద్ద డాక్టరుగారికి విపరీతమైన కోపం వొచ్చింది.

''అతను మీ పేషంటు కాదుసార్! ఆ బెడ్ డాక్టర్ కేశవ్‌గారిది'' అంది నర్సు.

అతను తన పేషంటు గాడని, తన అపోనెంట్

# చూపు

డాక్టర్ పేషంటని తెలియగానే స్థిమితపడ్డాడు. గాలి తీసేసిన టైరులో మళ్ళీ గాలి నింపినట్లయింది.

''డబ్బు ఖర్చుపెట్టి డాక్టరు పట్టాలు పుచ్చుకుంటే రోగుల గతి యింతే! గుడ్డోడు గుడ్డోడికి దారి చూపించినట్లుగా వుంటుంది వైద్యం.''

సీసాలో రాళ్ళువేసి గల, గలలాడిచ్చినట్లు నవ్వేరు అసిస్టెంటు సర్జన్, స్టూడెంటు. రోగులు కూడ నవ్వేరు. మంగలి కత్తి మెడమీద పెట్టి చచ్చుజోకులేసినా మొహానికి నవ్వు పులుముకోక తప్పదుకదా!

రౌండ్స్ అయిపోయేక రాజయ్య, కామేశం ఇంజెక్షన్స్ చేసే రూముదగ్గఱకెళ్ళేరు. దిగువ కంటిరెప్పలోంచి తెల్లగుడ్డుకి ఇంజెక్షన్ చేశారు. విపరీతమైన నొప్పితో విల,విల్లాడిపోయేరు. కంటికి కట్టుగుడ్డ కట్టించుకుని మెల్లగా వార్డుకేసి నడిచేరిద్దరూ, వొకరి భుజాలపై మరొకరు చేతులేసుకుని. ఆ క్షణంలో రాజయ్య 'రైతని', కామేశం 'రైతు కూలీ' అని మర్చిపోయేరు.

*   *   *

మధ్యాహ్నం భోజనాలయేక వార్డులో చాలమంది నిద్రలోకి జారుకున్నారు. నిద్ర పట్టకపోయినా కళ్ళు మూసుకుని పడుకున్నారు మరికొందరు. బెడ్‌మీద నుంచి లేచి అటూ, ఇటూ తిరగొద్దని నర్సు గట్టిగా

## దంత రక్షణకి టీ!

రోజూ రెండు లేక మూడు కప్పులు టీ త్రాగితే చాలు, దంత వైద్యునితో పని లేదంటున్నారు హంబర్గ్‌లోని దంత వైద్యులు. రోజూ టీ త్రాగడంవలన పిప్పిపళ్ళు ఏర్పడవు. టీలో ఎక్కువగా ఫ్లోరైడ్ వుంటుంది. ఇది దంతాలకు రక్షణ కల్పిస్తుంది. ఈ విషయంలో జావా, కీన్యాలలో పండే టీ చాలా శ్రేష్టం. అందులో ఫ్లోరైడ్ ఎక్కువగా వుంటుంది. చక్కెర ఎక్కువగా వున్న టీ శ్రేష్టమైనది కాదు. చక్కెర వలన దంతాల పైభాగాన గల ఎనామిల్ క్రమేణా పోతుంది.

చెప్పినా రాజయ్య 'ఎనెక్సి' వార్డులోనుంచి బయట కొచ్చేడు. మసక, మసగ్గా వుంది చూపు ఏవో మబ్బు తెరలు అడ్డొచ్చినట్లు.

'ఎనెక్సి' వార్డుకి పక్కనేవున్న నర్సు గదిలోకి వెళ్తున్న అసిస్టెంటు సర్జన్ కన్పించేడు. ఆయనకు కన్పించకుండా గోడవారగా నిబడ్డాడు.

ఆ గది తలుపులు మూసుకుపోవడంతో ఆశ్చర్యపడ్డాడు రాజయ్య. కుతూహలం నిండిన మనస్సుతో ఆ గది దగ్గఱకెళ్ళేడు.

లోపలినుంచి ఏవో గుస, గుసలు నవ్వులు విన్పించేయి.

రాజయ్య ఉద్రేకపడ్డాడు. కళ్ళల్లోకి రక్తం తన్నుకువొచ్చినట్లయింది.

మనస్సులో చిలకమ్మ మెదిలింది.

కాయలతో నిండుగా వుండే మామిడిచెట్టులా ఎంత అందంగా వుంటుంది చిలకమ్మ! కామేశంగాడికి పూర్తి చూపుపోతే చిలకమ్మ తనకి తప్పకుండా చిక్కుతుంది.

చిలకమ్మ తనదే!

హఠాత్తుగా తలుపులు తెరుచుకోవడంతో ఉలిక్కిపడ్డాడు రాజయ్య.

అసిస్టెంటు సర్జన్ ముఖం వివర్ణమయ్యింది.

నర్సు ఉగ్రనరసమ్మయ్యింది.

రాజయ్య చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళి మంచం మీదకు నెట్టింది.

వరండాలో తిరిగితే డిశ్చార్జి చేయిస్తానని వార్నింగ్ యిచ్చింది. నిద్రపోతున్న వాళ్ళకి మెలుకువ వొచ్చి ఆమె వార్నింగ్ వినేసి, మళ్ళీ నిద్రలోకి జారుకున్నారు.

*   *   *

''మావా! యిప్పుడెలా వుంది మావా?''

చిలకమ్మ గొంతు విని ఉలిక్కిపడి లేచాడు రాజయ్య.

కామేశం జుట్టుపై కెగదోసి, చెంపలు నిమురుతున్న చిలకమ్మను చూడగానే, రాజయ్య మనస్సులోని కోరిక కోటప్ప కొండలా ఎదిగిపోయింది.

ఎక్కడో అప్పచేసి మొగుడిని చూడటానికి ఎంత ఆపేక్షతో వొచ్చిందో!

తనను చూడటానికే ఎవ్వరూ రాలేదు! తన కెవ్వరున్నారు కాస్త, కూస్త ఆస్తి తప్ప... బంగారంలాంటి గౌరమ్మను తనే వేజేతులారా

పోగొట్టుకున్నాడు. పుత్తడి బొమ్మలాంటి గౌరమ్మను నిర్లక్ష్యంచేసి చెడు తిరుగుళ్ళకి అలవాటుపడ్డాడు తను. నెత్తినోరు బాదుకుని తనను మార్చడానికి ఎంతో ప్రయత్నించింది.

ఉరిపోసుకుని చనిపోయేదాకా గౌరమ్మ విలువ తనకి తెలియలేదు. ప్చ్! గౌరమ్మే చనిపోయేక తనకిక మంచి చెడులతో పనేమిటి? బ్రతికినన్నాళ్ళూ ఆనందంగా బ్రతికెయ్యడమే!

తనకిక వొకేవొక కోరిక మిగిలింది. చిలకమ్మ కౌగిట్లో నలిగిపోవాల. చాలాసార్లు ప్రయత్నించేడు. చిలకమ్మ చిక్కలేదు. తన పెంకుటిల్లు పక్కనే వున్న కామేశం గుడిసెలోకి దూరేడు వోసారి. అతను లేని సమయం చూసి చెయ్యి పట్టుకోబోయేడు.

కొబ్బెపేడు పట్టుకుని భద్రకాళిలా వెంట బడింది.

మరోసారి కందిచేను దగ్గఱ పచ్చగడ్డి కోసుకుంటున్న చిలకమ్మను వాటేసుకోబోయేడు ...

గోధుమ త్రాచులా కస్సుమంది.

కామేశంగాడికి కంటిచూపుపోతే ఏదొకరోజా చిలకమ్మ బక్కచిక్కి తనకు దొరక్కపోదు!

"ఎప్పుడొచ్చావే చిలకా!" ఆమెకు దగ్గఱగా నిలబడి అడిగేడు రాజయ్య.

"నువ్వు అలా పిలిస్తే వొళ్ళు మండిపోతుంది నాకు" అతనివైపు చూడకుండానే అంది.

"రాజయ్యగారు ఏదో సరదాకంటే విరుచుకు పడతావేమిటే?" కామేశం సర్దబోయేడు.

"వీడే నా కొంప నట్టేట ముంచాలని నీకు తాగుడు, పేకాట అలవాటుచేశాడు. ఈ రోగంకూడ వీడి మూలంగానే వొచ్చింది" అంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

చుట్టుపక్కలవాళ్ళు తమకేసి చూడటంతో, యిక అక్కడుండటం మంచిది కాదని వార్డులోనుంచి బయటకువచ్చేసేడు.

తన ప్రయత్నాలేవి సాగనందుకు తనను తానే తిట్టుకున్నాడు రాజయ్య.

ఆ కోపంతో హాస్పిటల్ బయటకెళ్ళిపోయేడు గేటు దగ్గఱ ఆత్ని మంచి చేసుకుని. అతని కాళ్ళు బ్రాందీషాపు దగ్గఱకి లాక్కెళ్ళాయి.

*   *   *

రాత్రి పదకొండు గంటలయ్యింది.

అందరూ నిద్రపోయేక, పరుపుకింద దాచి పెట్టిన బ్రాందీసీసా లాల్చీజేబులో పెట్టుకున్నాడు.

గ్లాసు తీసుకుని బాత్‌రూముకు చేరుకున్నాడు.

జేబులోనుంచి తీస్తుంటే కామేశం గుర్తుకు వొచ్చేడు. "మరోసారి తాగావంటే రెండోకన్నుకూడా గుటుక్కుమంటుంది"— కామేశంతో డాక్టరన్న మాటలు కూడ గుర్తుకు వచ్చేయి.

కామేశాన్ని నిద్రలేపి బాత్ రూము లోకి లాక్కొచ్చి తలుపేశాడు

బ్రాందీసీసా చూడగానే నిద్రమత్తు వొదిలింది. సీసాలో మూడొంతులు తాగగానే మళ్ళీ నిద్రమత్తు కమ్మేసింది కామేశాన్ని.

రాజయ్య ఆనరాతో మంచంమీదకుచేరి దుప్పటి ముసుగు పెట్టేసేడు.

కొద్దిగా తాగినా రాజయ్యకి తల తిరుగుతూనే వుంది.

ఆనందంతో మనస్సు కూడ వూగిసలాడుతూనే వుంది. కామేశంగాడు గుడ్డోడయిపోవడం ఖాయం! చిలకమ్మ యిక నాదే!

కాసేపు పిచ్చికేకలు వేశాడు.

నర్సుని, డాక్టరుని తిట్టిపోశాడు.

కామేశం తప్పితే అందరికీ మెలుకువొచ్చింది.

డ్యూటీలోవున్న నర్సుకూడ వొచ్చి చూసింది

*   *   *

తెల్లవారింది.

రాజయ్య కళ్ళు తెరవకుండానే దిండుకిందవున్న నాలుగు పేక ముక్కల్ని చేతిలోకి తీసుకున్నాడు.

ఆ ముక్కల్లో—

"డైమండ్ రాజా"తను. చిలకమ్మకి తామరాజా.

"ఆటీన్ రాణి" చిలకమ్మ.

"కళవర్ పది" గుడ్డి కామేశంగాడు.

"ఇస్పేటు జాకీ" తనను తిట్టే చిన్నడాక్టరు. వాడి ఉద్యోగం వూడిపోవాలి.

ఏ ముక్క ముందు వస్తుందో? డైమండ్ కింగ్ రావాలి. రాజయ్య ఎప్పుడూ కింగే!

నాలుగు ముక్కల్లో వో ముక్క చేతిలోకి తీసుకుని కళ్ళు తెరిచేడు రాజయ్య.

చిమ్మ చీకటి ...

కళ్ళు నులుముకుని చూసేడు.

కటిక చీకటి ... తనకి చూపుపోయింది.

బావురుమన్నాడు వొక్కసారి.

"ఏమిటి రాజయ్యగారూ! కళవర్ పది ముక్క చేతిలోపెట్టుకుని ఏడుస్తున్నారు?" ఆదుర్దాగా అడిగేడు కామేశం.

కామేశానికి ముక్కలు కనిపిస్తున్నాయన్నమాట! అంటే తనే గుడ్డివాడయిపోయాడు.

"పేకముక్కలు ముందేసుకుని రాజాలా కూర్చున్నావా తండ్రీ! లేచి నీ సామాను సర్దుకో! నిన్ను డిశ్ఛార్జి చేశారు. తాగి తందనాలాడటానికి కాదు గవర్నమెంటు ఆసుపత్రుంది" అంది నర్సు కసిగా.

తనకే అధికారాలుంటే కిందటిరోజే రాజయ్యని డిశ్ఛార్జి చేసేది, తనగది ముందు తచ్చాటలాడుతున్నందుకు.

"డాక్టర్లతో సరసాలాడటానికి కాదు గవర్నమెంటు ఆసుపత్రిలో నర్సు వుద్యోగమిచ్చింది" అని ఎదురు సమాధానం యిచ్చే మనస్థితిలో లేదు రాజయ్య.

నల్లగా వికృతంగా కన్పించేయి తను చేసిన పాపాలు. గుడ్డి బతుకు కొన్నాళ్ళు తప్పదు తనకు.

మరో ఆసుపత్రి చుట్టూ తిరిగినా తనకి చూపు వొస్తుందో — రాదో!

చుట్టూ పరికించి చూడ ప్రయత్నించేడు.

చీకటి ...

చుట్టూ చీకటి ...

# గోదారి ఘొల్లుమంది

ఆకతాయి అబ్బిగాళ్లకు బెరచడమే ఆట్టైతే
కన్నెగాని కసురుగాయ గోదాట్లో దూకేస్తే —

కాసులంటే ఆశలేని అబ్బిగాడు రాకపోతే
ఈసురోమని యింట్లో వుండలేక ఓ అమ్మి
చీకట్లో నడిచొచ్చి గోదాట్లో దూకేస్తే —

ఇంటికి పెద్దకొడుకు ఆకలిరాక్షసుడ్ని
ఇంట్లోంచి తరమలేక యింటి గడప తొక్కలేక
తన గోడు వినేవారులేక గోదాట్లో దూకేస్తే —

తాళిగట్టిన మగడు తాగితాగి తంతుంటే
తన రక్తాన్ని అత్తగారు చెంబులోతో తాగుతుంటే
విసుగెత్తి యిల్లాలు గోదాట్లో దూకేస్తే —

పిల్లల చదువులకు పెళ్లి పేటాకులకు
డబ్బులిచ్చిన అప్పలాళ్ళు మీదబడి బకిరేస్తే
దారిలేక అప్పలయ్య గోదాట్లో దూకేస్తే —

రాజకీయాల్లోనో, ఆస్తిపాస్తులగ్గానో,
అడ్డొస్తారనో, సాక్ష్యం చెబుతారనో
మనుష్యుల్ని చంపేసి గోదాట్లో తోసేస్తే —

ఒడిపట్టిన పాపానికి గోదారి ఘొల్లుమంది
ఎర్రని కన్నీటిలో భుస్సుమని లేచింది
కసిదీరా వూళ్లన్నీ కడిగిపారేసింది.

— టి. ఎస్. ఎస్. రంగనాథ్



# సినిమా

"క్రాంతి చిత్రవారి 4వ చిత్రం"లో రాధిక

## కలత చెందిన అమ్మాయి — ఖంగుతిన్న అబ్బాయి

కిరణ్ (చంద్రమోహన్) అమితోత్సాహంతో బయలుదేరాడు ఉష (రాధిక) తల్లిదండ్రులతో తమ పెళ్ళి విషయం మాట్లాడాలన్న ఆనందం తీరా వాళ్ళ ఇంటి దగ్గరికి చేరుకునేసరికి చప్పబడి పోయింది ఉష గుమ్మం వద్ద ముభావంగా నిలుచొని ఉంది

"ఉషా, అరే! నువ్విక్కడే నుంచుని వెయిట్ చేస్తున్నావా? సారీ, ఉషా లేటయింది ఏమిటి, ఉషా? ఏమైంది? మన పెళ్ళి గురించి మాట్లాడావా? ఏదైనా గొడవ జరిగిందా? నన్ను ఇంటికి రమ్మని పిలిచి — గుమ్మానికి అడ్డుగా నిలబడి మౌనంగా ఉండటం న్యాయం కాదు, ఉషా! అసలేం జరిగింది?" అంటూ కిరణ్ తేరిపార చూశాడు. ఉష లోలోపల కుమిలిపోసాగింది ఏమీ అర్థంకాక కిరణ్ "ఉషా! కళకళలాడుతూ కయ్యానికి కాలుదువ్వే నువ్వు ఈ రోజు ఇంత డీలాగా ఉన్నావంటే, మన పెళ్ళి గురించి మీ ఇంట్లో ఏదో గొడవ జరిగి ఉండాలి. పద — నేను మీ అమ్మగారితో మాట్లాడ్తాను," అంటూ లోపలికి అడుగెట్ట బోతూంటే ఉష అడ్డుపడి, దుఃఖ భారంతో "నా గురించి మీరు ఎవ్వరితోనూ మాట్లాడి ప్రాధేయపడాల్సిన అవసరంలేదు. ఇక మనిద్దరం కలుసుకోవటం జరగదు. ఈ నా నిర్ణయానికి మీకు కారణాలు చెప్పే స్థితిలో నేను లేను. దయచేసి మళ్ళీ నన్ను కలవటానికి ప్రయత్నించకండి," అంటూ దభాలున తలుపు మూసేసింది. అనుకోని ఈ పరిణామానికి చలించిపోయిన కిరణ్ భారంగా వెనుతిరిగాడు.

చిత్తూరి వెంకటగణేశ్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో టి. అప్పదాస్ సమర్పించే శ్రీ దాక్షాయణీ క్రియేషన్స్ "కయ్యాల అమ్మాయి— కలవారి అబ్బాయి" చిత్రానికి సోమిశెట్టి సుబ్బారావు, బెండా వెంకటేశ్వరరావు నిర్మాతలు.



# రీళేషాలు

-జి. వి. జి.

## నటనలో వాస్తవం

నారాయణరావు (అచంట) గిరుక్కున వెను తిరిగి కొడుకు రవి (నాగేంద్ర)తో "ఇది వాస్తవ జీవితంరా. ప్రేమలు, వర్ణాంతర వివాహాలు, ఆదర్శాలు - అవన్నీ కథలు, కవితావస్తువులురా. నీ భవిష్యత్తుకి ఎన్ని బంగారుమెట్లు ఊహించాను! ఆఖరికి — నిన్ను, నీ కేరియర్ని — ఆ కారియర్ నాశనం చేస్తోంది ... ఇది స్టేజీ కాదు; ఇల్లు ... ఇది నటన కాదు; వాస్తవం!" అన్నాడు.

రవి ఆవేశంతో "గుడిసెకు – మేడకు తేడాలు చూపిస్తున్నారా, డాడీ? ఆనాడు కులతత్వాలమీద, సాంఘిక దురాచారాలమీద నేను కాలేజీలో ప్రదర్శన ఇస్తుంటే — నన్నెంతో అభినందిస్తూ, నన్ను సమర్థించి ఉపన్యాసాలు ఇచ్చిన మీరేనా ఈనాడు గుడిసె – మేడ తేడాల బేరీజు వేస్తున్నారు?" అన్నాడు.

"ఇదే స్టేజి అయితే – ఇప్పుడూ నిన్ను తప్పకుండా సమర్థించేవాడినిరా ... అభ్యుదయ భావాలు, ప్రగతిపథాలు, సంఘ సంస్కరణలు — ఇవన్నీ ఉపన్యాసాల వరకేరా పరిమితం. వాటిని ప్రాక్టికల్ లైఫ్‌లోకి తెచ్చుకుంటే, చాలా నష్టపోతావు ... అంతెందుకూ? ఐదు కోట్లు రూపాయలున్న ఆ శీతల ప్రసాదరావుగారికీ — ఆ కారియర్ తాతకూ వ్యత్యాసం ఉందా — లేదా? ఆ శీతల ప్రసాదరావుగారి అమ్మాయిని పెళ్ళి చేసుకుని కార్లలో తిరుగుతూ ఉంటావా — లేక, ఆ కారియర్ తాత మనమరాల్ని కట్టుకుని కారియర్లు మోస్తావా? నిర్ణయించుకొని, ఈ రోజు సోమవారం కదూ? సాటర్‌డేనాడు ఏ విషయం చెప్పు. యు కెన్ గో!"

రవి తలొంచుకొని మేడమెట్లెక్కి వెళ్ళిపోయాడు.

తన బోధన ఫలించిందనుకొని నారాయణరావు తృప్తిగా నిశ్వాస వదిలాడు.

టీనేజ్ ప్రేమ కథాంశంతో పూర్తిగా కళాశాల వాతావరణంలో కర్నూలు వాస్తవ్యులు ఎం. అహ్మద్ బషీర్‌ఖాన్ నిర్మించిన నమస్తే మూవీస్ "నటన" చిత్రం రీరికార్డింగ్ పూర్తయి విడుదలకు సిద్ధంగా ఉంది. భువన, శ్రీవల్లి, శిరీష, ఎం. ప్రసాద్, పి. ఎల్. ప్రసాద్, విశ్వనాథ్, సిద్దేష్, గురుస్వామి ముఖ్య పాత్రధారులు. అర్కశ్రీ సంభాషణలు, జె. పురుషోత్తం సంగీతం, ఆర్. రామారావు ఛాయ, బాబ్జి శిల్పం, అంకిరెడ్డి కూర్పు. కృష్ణకుమార్ ధార్వార్ నృత్యాలతో జక్కుల పురుషోత్తం నిర్వహణ బాధ్యతలు వహించారు. కథను బషీర్ ఎ. కె. రాశారు. గురుదేవ్ దర్శకుడు.



"మనం తీసిన సినిమా ముందు మా పనిపిల్లకి చూపించాలయ్యా! ఆ పిల్లకి నచ్చితే, సినిమా విజయవంతమైనట్లే!"

"శుభలేఖ"లో సుమలత



'ఇల్లంతా సందడి'లో ప్రభ





'ప్రేమ జ్వాల'లో విజేత, కమలాకర్

'మొండిఘటం'లో ఒక సన్నివేశం



## "కొండంత వెలుగు"

"హీరో హీరోయిన్‌లుగా కొత్తవారిని పరిచయం చేయ సంకల్పించాం," అన్నారు బి. రాజేశ్వర్. ఈయన నిర్మించే దేశీ ఫిలిమ్స్‌వారి పై చిత్రంలో మాతన్‌ప్రసాద్, భానుప్రకాశ్, శశాంక, కాకరాల ఇంతవరకు ఎన్నికయ్యారు. "కులమతాలు అడ్డుగోడలుగా నిలిచి, మనుషులను ఎంత మూర్ఖులుగా మార్చి, ఎన్ని విపరీత పరిణామాలకు దారితీసేలా చేస్తాయో చెప్పే వినూత్న ఇతివృత్తం. జూన్ చివరి వారం నుంచి హైదరాబాద్‌లో షూటింగ్ మొదలెట్టున్నాం," అని తెలియజేశారు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే శ్రీరంగం శ్రీధర్. డి. ప్రభాకర్ సంభాషణలకర్త.

## కోదండరామిరెడ్డి దర్శకత్వంలో "అభిలాష"

సీరియల్‌గా వెలువడిన యండమూరి వీరేంద్రనాథ్ నవల అభిలాషను క్రియేటివ్ కమర్షియల్స్ పతాకంలో నిర్మాత కె. ఎస్. రామారావు తెరకెక్కిస్తారు. చిరంజీవి, రాధిక నాయకా నాయికలు. అక్టోబర్‌లో చిత్రీకరణ మొదలయ్యే ఈ చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.



'ప్రతిజ్ఞ'లో కవిత, మోహన్‌బాబు

## కలలు కనే కళ్ళలో కల్లలైన కోరికలు

"చంద్రం (ప్రతాప్‌పోతన్) ఆస్తిపరుడు. చదువుకున్నవాడు. కాని, ఒక్కటే లోపం. తను అందగాడు కాదని, తను అందరికన్నా తక్కువని – తనకు తానే అంచనా వేసుకుంటూ విషాదంగా కాలాన్ని గడిపే యువకుడు. వాళ్ళ పక్కింటమ్మాయి జ్యోతి (అరుణ). అందగత్తె. అణకువ, మర్యాద తెలిసిన పిల్ల. ఓ రోజు చంద్రం టేప్‌రికార్డర్‌లో పాట వింటూ గోడ దగ్గర నిలుచొని ఉంటే, ఆ పాటకు ముగ్ధురాలై కిలకిలా నవ్వింది జ్యోతి. తన పాట ఆమెకు నచ్చిందని, అందుకే నవ్విందని, తనుకూడా నచ్చి ఉండాలని చంద్రం మురిసిపోయి ఆమెనే పెళ్ళి చేసుకుంటానని తల్లితో చెప్పి ఒప్పించాడు... ఇక పెళ్ళయిన దగ్గర్నుంచి షరా మామూలే. తన భార్య రూపవతి గనుక తన అందవిహీనానికి నొచ్చుకుంటూండాలనీ, అందుకే దగ్గరికి రావడానికే భయపడుతూందనీ తనలో తాను మథనపడిపోసాగాడు చంద్రం. తుఫానులో చిక్కుకున్న ఆ సంసార నౌక ఒడ్డుకు ఎలా చేరుతుంది?"

శ్రీ అన్నపూర్ణ మూవీస్ "కలలు కనే కళ్ళు" చిత్రంలో ప్రతాప్‌పోతన్ పాత్ర గురించి పై విధంగా కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన ఎం. బాలు తెలియజేశారు. ముప్పాళ సాంబశివరావు నిర్మించే ఈ చిత్రంలో చంద్రమోహన్, మాతన్ ప్రసాద్, సారథి, ప్రసాద్‌బాబు, హరిబాబు, సాక్షి రంగారావు, కవిత, నిర్మల, రమాప్రభ, యూస్ఫీ ముఖ్య పాత్రధారులు. కాశీ విశ్వనాథ్ సంభాషణలకర్త. ఎం. వెంకటేష్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

'ఇద్దరు కిలాడీలు'లో సుమన్, సాధన

## ప్రతిజ్ఞలో విజ్ఞప్తి

నాగరాజా (సత్యనారాయణ) ముద్దుల కూతురు రోజా పట్నంలో మెడిసన్ చదివి, సొంత ఊరుకు వచ్చింది. అక్కడ ఆమె కోసం తండ్రి హాస్పిటల్ కట్టించాడు. దాని ప్రారంభోత్సవానికి పెద్దలను, ఉన్నతాధికారులను ఆహ్వానించి, "మీరందరూ మాట్లాడకుండా శ్రద్ధగా వినండి...నా ఒక్కగానొక్క కూతురు రోజా పట్నంలో శ్రద్ధగా వైద్యం చదివి, ఈ ఊరొచ్చింది. ఆమె కోసం లక్షలు ఖర్చుపెట్టి, నేనీ ఆస్పత్రి కట్టించాను. దాని ప్రారంభోత్సవానికి గౌరవనీయులైన సమితి ప్రెసిడెంటుగారు ఇక్కడకు వచ్చారు," అని నాగరాజా అంటూండగా అక్కడికి పూలమాలతో వచ్చిన భరత్ (మోహన్‌బాబు) "భూస్వామి నాగరాజాగారి మహోన్నత ఆశయాల్ని మనసారా మెచ్చుకుంటున్నాను. మన గ్రామ ప్రజల కోసం మొట్టమొదటిసారిగా డాక్టరుగా వచ్చిన కుమారి రోజాగారికి నిండుమనసుతో స్వాగతం పలుకుతున్నాను," అంటూ మాలను ఆమె చేతికిచ్చి, "డాక్టర్ రోజా! అనుక్షణం కష్టపడుతూ, కడుపు నిండా తిండి లేక అనారోగ్యంతో బాధపడే పేద ప్రజానీకానికి సేవ చేయడానికి వచ్చిన దేవతవు నువ్వు," అన్నాడు.

నాగరాజా తెల్లముఖం వేసి, "ఏమిటోయ్ నీ పిచ్చివాగుడు? అమ్మాయి కష్టపడి వైద్యం చదివింధీ, నేను లక్షలు తగలేసి ఆస్పత్రి కట్టించిందీ — ఈ ముష్టివెధవలకీ, పేద పీనుగులకీ వైద్యం చేయడానికా?" అన్నాడు.

"చూడండి... సృష్టిలో ఏ స్వార్థమూ లేకుండా తోటివాళ్ళకు సహాయం చేయడమే గొప్పతనం అనిపించుకుంటుంది. డాక్టర్ రోజా! పేదవాళ్ళకి వైద్యం చేసి, డాక్టర్ అనే పదానికి కొత్త అర్థాన్ని తీసుకురావాలని కోరుకుంటున్నాను," అన్నాడు భరత్.

నాగరాజా నిర్లక్ష్యంగా "సొమ్ము నీది కానప్పుడు ఎన్ని కబుర్లయినా చెపుతావు... ప్రెసిడెంట్‌గారూ, మీరు కానివ్వండి," అన్నాడు.

డాక్టర్ రోజా, భరత్ వంకే రెప్పలార్పకుండా చూస్తూండిపోయింది.

మోహన్‌బాబు ప్రధాన పాత్ర ధరిస్తూ నిర్మించిన శ్రీ లక్ష్మీప్రసన్న పిక్చర్స్ "ప్రతిజ్ఞ" చిత్రానికి బోయిన సుబ్బారావు దర్శకుడు.



'ప్రతీకారం'లో శోభన్‌బాబు, శ్రీగంగ, శారద



## సినిమా

### శ్రీ సారథీ స్టూడియోస్ చిత్రం

"జూన్ 11న మొదటి పాట రికార్డవుతుంది. జూలై 10 నుంచి 20 వరకు రాజమండ్రి దగ్గర లక్కవరంలో, ఆ తర్వాత ఆగస్టు 5 నుంచి 25 వరకు రెండవ షెడ్యూల్ పూర్తయి, సెప్టెంబర్‌లో విడుదలవుతుంది," అన్నారు పి. శశిభూషణ్. ఈయన నిర్మించే శ్రీ సారథీ స్టూడియోస్ చిత్రానికి పి. సాంబశివరావు దర్శకుడు. చంద్రమోహన్, విజయశాంతి, సత్యనారాయణ, గుమ్మడి, నిర్మల, పి. ఆర్. వరలక్ష్మి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. భాగ్యరాజా కథ, స్క్రీన్‌ప్లే రాశారు. ఈయన తమిళ హిట్ చిత్రం "తూరల్ నిన్ను పోచ్" ఆధారంగా తయారయ్యే ఈ చిత్రానికి డి. వి. నరసరాజు మాటలు, ఆత్రేయ పాటలు రాస్తున్నారు. కె. వి. మహదేవన్ సంగీత దర్శకుడు, బాబా ఆజ్మీ ఛాయాగ్రాహకుడు.

'అనంత రాగాలు'లో రాజ్యలక్ష్మి, ప్రభాకర్  'కయ్యాల అమ్మాయి—కలవారి అబ్బాయి'లో రాధిక, చంద్రమోహన్

## రామ్‌ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

"జూలై 15 నుండి ఆగస్ట్ 10, సెప్టెంబర్ 1 నుండి 10 రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ ముగుస్తుంది," అన్నారు ఎ కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో ఎన్ రామలింగేశ్వరరావు నిర్మించే పై సంస్థ తొలి చిత్రానికి మే 31న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. చక్రవర్తి సంగీత దర్శకుడు. కృష్ణ, శ్రీదేవి, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ప్రభృతులు నటించే ఈ చిత్రం పందిగం దేవీప్రసాద్ సమర్పణ

### 'పగబట్టిన సింహం'లో కృష్ణ

## కోనేరు రవీంద్రనాథ్ దర్శకత్వంలో గాజుబొమ్మలు

"చిత్ర అనే కొత్త హీరోయిన్‌కు అవకాశమిచ్చాం," అన్నారు నిర్మాత, దర్శకుడు కోనేరు రవీంద్రనాథ్ "ముద్దమందారం" చిత్రాన్ని సమర్పించిన ఈయన గతంలో వి మధుసూదనరావు లాంటి దర్శకులవద్ద అసోసియేట్‌గా అనుభవం గడించారు నటనాలయ కంబైన్స్ "గాజుబొమ్మలు" చిత్రంలో శరత్‌బాబు, సంగీత, మాతన్‌ప్రసాద్, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, రమాప్రభ, చిత్ర నటిస్తున్నారు మే 15న ఎ జి పి గార్డెన్స్‌లో షూటింగ్ మొదలైంది ఆత్రేయ మాటలు, రమేష్‌నాయుడు స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి పాటలు రాశారు రమేష్ ఛాయాగ్రాహకుడు.



'మహాప్రస్థానం'లో విజయలక్ష్మి, మాదాల రంగారావు

'ఇల్లాలి కోరికలు'లో జయసుధ, శోభన్‌బాబు



## సినిమా

### మిద్దె రామారావు కొత్త చిత్రంలో కృష్ణ, శ్రీదేవి

"మా 'పదహారేళ్ళ వయసు' చిత్రంలో నాయికగా నటించిన శ్రీదేవి చాలా కాలం తర్వాత మా కొత్త చిత్రంలో నటిస్తుంది," అన్నారు నిర్మాత మిద్దె రామారావు. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో నవంబర్‌లో ప్రారంభమై, మార్చికి పూర్తయ్యే శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి చిత్రానికి సత్యానంద్, చక్రవర్తి, వెంకట్ ప్రభృతులు తెరవెనుక కృషి చేస్తారు.



'కలలుకనే కళ్ళు'లో అరుణ, చంద్రమోహన్

### కుర్రాళ్ళోయ్ .... కుర్రాళ్ళు

"చంద్రమోహన్ హీరో. విశాఖపట్నం, అరకు లోయ పరిసరాలలో పూర్తిగా ఔట్ డోర్‌లో షూట్ చేస్తాం," అన్నారు డైరెక్టర్ జనార్దన్. వి. ఎస్. ఎం. ఆర్. ఇంటర్నేషనల్ అనే నూతన సంస్థ తయారు చేస్తుంది "కుర్రాళ్ళోయ్...కుర్రాళ్ళు" అనే రొమాంటిక్ మిస్టరీ చిత్రాన్ని. జనార్దన్ అర్జున్ ఆర్ట్స్ వారి "మామ్మగారి మనవలు" చిత్ర దర్శకుడు కూడా.



# మిల్క్ మెయిడ్

## రుచికరమైన పాల తయారీకి




కావలసిన విధంగా రుచికరమైన తీయని పాలను తయారు చేసుకున్న తర్వాత, ఆ పాలతో మీరు పాయసం, మిల్క్‌షేక్ రాజ్‌భోగ్, బర్ఫీ లాంటి నోరూరించే రుచికరమైన తీపి తినుబండారాల్ని తయారుచేసుకోండి. మిల్క్ మెయిడ్‌లో తీపి వున్నది మీకు పంచదార ఖర్చు కలసివస్తుంది కూడ.

**అతి రుచికరమైన పాలకోసం 3 అనువైన పద్ధతులు :**

1. 400 గ్రా. మిల్క్‌మెయిడ్ డబ్బాను తెరవండి




2 అందులో వున్నదాన్ని పెద్ద పాత్రలో పోయండి



3 ఖాళీ అయిన మిల్క్‌మెయిడ్ డబ్బాతో కొలిచి 3-4 రెట్లు మీ రుచిని అనుసరించి నీళ్ళు కలపండి బాగా కలపండి అత్యంత రుచికరమైన తీయని పాలు మీకు లభిస్తాయి.



ఇప్పుడు చెప్పినట్లు కలిపిన పాలు వంట పదార్థములు చేయడానికిని మరియు సాధారణ వాడకమునకు మాత్రమే.

మధురమైన రుచులలో ఒక సొగసైన మార్పు

# మిల్క్ మెయిడ్

CAS-384 TE B

సీరియల్

# కాలంకరిబూక

వలివేటి నాగచంద్రావతి

(గత సంచిక తరువాయి)

మేత వేసిన చేత్తోనే మెడ నరికే కసాయివాడిలా కనిపిస్తున్న భార్యనీ, లాలనా, మమతా జారుకున్న దోసిట్లోనే ద్వేషాన్ని రుచి చూస్తున్న కూతుర్నీ మరి చూడలేక చివాలున లేచి భడాలున తలుపులు తెరుచుకుని వరండాలోకి వచ్చేశారు రంగనాథంగారు.

పడక కుర్చీలో కూలబడి, నిద్రని తరిమేసిన కళ్ళు పొడారిపోయి మంటలు పెడుతోంటే రెండు చేతులతోనూ నలుముకుంటూ ఆలోచనల్లోకి జారిపోయారు.

'తన పిచ్చిగానీ ఇలాంటి సందర్భాల్లో ఏ తల్లయినా గుండె రాయి చేసుకోక తప్పదు. రాజ్యం తప్పేమున్నదీ ? ఏదో ఆవేశంలో, ఆఖరి పిల్ల అని ముద్దుగా పెంచిన భ్రమత పీడించబట్టి తనే అడ్డదిడ్డంగా ఆలోచించాడింతవరకూ.

ఒకవేళ తను అనుకున్నట్టుగా కాక, రాజ్యం తన మాటను కాదనకుండా మన్నించి 'సై' అన్నా, ఈ లోకాన్నెదిరించటం, ప్రవాహానికి ఎదురీదటం అంత సులభమా ?

తెగించి నిలబడ్డం, తమ చేతిలో పని గాబట్టి నవ్వేవాళ్ళ మొహాన్న నీళ్ళ చల్లినట్టు 'మా ఇష్టం' అని పుల్లవిరిచినట్టు అనగలం... లోక నిందని మనని కానట్టే దులపరించుకోగలం; అంతవరకూ బాగానే వుంది... మరి ఆ తరవాత్సంగతో ? మీనాక్షి నెవరు పెళ్ళాడుతారు ? మంచుబొట్టంత నిర్మల మయిన పిల్లని చూపిస్తేనే కట్నం తక్కువని కాదన్న వరులు, కొట్టవచ్చినట్టు కనబడుతోన్న మచ్చతో నిలబడ్డ పిల్లని చేసుకోను ముందుకొస్తారా? అంత సహృదయులున్నారా ?

పోనీ పెళ్ళీ వద్దా — ఏమీ వద్దు; పుట్టిన నలుసును చూసుకుంటూ ఒంటరిగానే జీవితమంతా గడిపేస్తుందని సమాధాన పడతాం; మరి వాళ్ళిద్దరి మనుగడా సాగే విధానమేదీ ?

మా తదనంతరం దాని పోషణ భారం ఎవరు స్వీకరిస్తారు ? అన్నలా ? అక్కలా ? కన్న పాపానికి తామంటే తలొగ్గుతున్నారుగానీ వాళ్ళు దీన్ని గడపలోకి రానిస్తారా ?

ఎవరిమీదా ఆధారపడకుండా దానికి రాసిపోడానికి తమ దగ్గర ఏ ఆస్తిపాస్తులూ లేవే ? ఏదో సామెత చెప్పినట్టు అవే వుంటే కామేశ్వరమ్మ భుజాలెగరేసుకుంటూ కొడుక్కి చేసుకునేది కాదూ !

భుక్తి గడవదనే ఆలోచన వదిలిపెట్టొచ్చు. చదువు చెప్పిస్తే ఏ ఉద్యోగమో చేసుకుంటుంది. అదీ లేకపోతే ఏ కూలో నాలో చేసుకు బిడ్డను పెంచుకుంటుందని సరిపెట్టుకుందాం.

కానీ తాము నిలెక్కేమిటని తోసి రాజన్న లోకం మధ్యనే .. ఆ జనం నడుమనే అది బతకాల్నే ...! ఆ లోకం దాని దారిన దాన్ని సజావుగా బతకనిస్తుందా ? 'పతిత — కులట — భ్రష్టురాలు' అంటూ రాళ్ళు రువ్వదూ ? 'ఒకసారి జారినదానివేగా' అని అవహేళన చేస్తూ మళ్ళీ మళ్ళీ బురదలోకి ఈడ్వాలని ప్రయత్నించదూ ? ఆ దుర్భర జీవితం కంటే, రెండు మూడ్రోజులు కష్టానికీ, శ్రమకీ ఓర్చితే ఆ మచ్చ శాశ్వతంగా మాసిపోతుంది.

ఆ వెంటనే ఓ గంతకు తగ్గ బొంత చూసి ముడిపెట్టించేస్తే తనగూట్లో తాను గంజో, కడుగో తాగుతూ గుట్టుగా పడుంటుంది. నేల విడిచిన సాముకంటే ఇది మేలు గదా !

ఇలా రంగమ్మ బయటకొచ్చేవరకూ ఆయన ఆలోచనలు పొగుతోనే వున్నాయి. తెల్లవారటానికి మరో ఝాము ప్రొద్దున్నది. "నెప్పలందుకున్నాయి. మీరేం కంగారు పడకండి. మళ్ళీ రాత్రికి వస్తాను" అని చెప్పి వెళ్ళిపోయింది రంగమ్మ.

* * *

మర్నాడంతా మీనాక్షి బాధపడుతోనేవున్నది. ఆమెను ఎవరూ ఓదార్చలేదు — సరికదా పైపెచ్చు నెప్పి అమితమై ఏప్పుడు గట్టిగా మూలగబోతే "ఊ... చాల్లే. గొంతు తగ్గించు. నలుగురూ వినగలరు" అనే తల్లి మందలింపులకు గురి అయ్యింది.

రంగనాథంగారు ఊరడించాలిసిన సమయంలో వైముఖ్యాన్ని ప్రదర్శిస్తున్న భార్య కర్కశత్వాన్ని సహించలేక, ఆమెను వారించినా ఫలితముండదు కనక, జాలిగా తనకేసి చూసే కూతురికి మొహం తప్పించి, ఆ రోజులో చాలాభాగం పబ్లిక్ పార్కులోనే గడిపేశారు. ఎంత తిరిగినా గూటికి మళ్ళటం తప్పనిసరికదా ! పొద్దుగూకాక కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరుకున్నారు.

అప్పటిదాకా తప్పించుకొన్న నరకం మళ్ళీ ప్రత్యక్ష్యం. నోటిలో కొంగు కూరుకుని మంచంమీద వొంకర్లు తిరిగిపోతోంది మీనాక్షి.

రాయిలా, కళ్ళెదుట అమానుషమైన దారుణాలెన్నో జరిగిపోతున్నా చలించని గుళ్ళో దేముళ్ళా, తనకే సంబంధం లేనట్టు కూతుర్ని కన్నెత్తయినా చూడక తన పని తను చేసుకుపోతోంది రాజ్యలక్ష్మమ్మ.

'మగవాణ్ణి — నేనే దాని బాధ చూడలేక తల్లక్రిందులవుతున్నానే ... కండలో కండ— రక్తంలో రక్తం పంచి ఇచ్చిన ప్రాణమే...రెట్టింపుగా బాధపడాల్సిన మనిషి ఇంత శిల అయిందేమా అనుకున్నారు రంగనాథంగారు భార్యగురించి వెగటుగా.

ఆయనకేమి తెలుసును? మానసికంగా ఆవిడెంత చిత్రహింస పడుతోందో ? కూతురు కంటే వెయ్యి రెట్లు రంపపుకోత అనుభవిస్తోందావిడ.

తన నిగ్రహం ఏ మాత్రం సడలినా కన్నీటి కడలి చెలియలి కట్టే తెగిపోతుందనీ, ఆ దుఃఖ స్రవంతి ఇంటిల్లపాదినీ ముంచివేస్తుందనీ తెలును నావిడకి.

అంచేతే కరుడు కట్టిన దానిలా బిగువు నటించి మౌనం వహిస్తోంది. ఏవేవో పనులు కల్పించుకొని వాటిలో లీనమయిపోవాలని ప్రయత్నిస్తోంది.

రాత్రి మళ్ళీ రంగమ్మ వచ్చింది. మరో మోతాదు తాగించి వెళ్ళింది. భగభగమంటే మంటపైన పెట్రోలు జల్లితే మరింత ప్రజ్వరిల్లినట్టుగా మీనాక్షి పడేబాధ మరీ అధికమయిపోయింది.

ఒకటే నెప్పి; కడుపులో పేగుల్ని పొగదీస్తున్నట్టూ, మెలితిప్పుతున్నట్టూ విపరీతమైన బాధ; పైగా ఆ నరకయాతను కిక్కురుమనకుండా అనుభవించవలిసి రావటం...ఎంతటి హింస అది.

ఆ రాత్రి ఎలా గడిచిందో, ఎలా తెల్లవారిందో మీనాక్షికి తెలియదు. ఆమెకు తెలుస్తున్నదల్లా క్షణ క్షణానికీ అతిశయిస్తున్న బాధమటుకే.

పొద్దు కరకరా పైకొచ్చేకొద్దీ నెప్పల తీక్షణతా ఎక్కువయింది. ఒకరోజంతా ఓర్పుగా, సహనంతో మూలుగనేది బైటకు రాకుండా దిగమింగిన ఆ పిల్ల,

**జరిగిన కథ — 4 :** కలప వ్యాపారంమీద రెండు చేతులా సంపాదిస్తున్న కేశవరావ్, కామేశ్వరమ్మ గార్ల ఏకైక పుత్రుడు మురళి — హైస్కూలు మాస్టారుగా రిటైరయి, వున్న ఆస్తినంతా తెగనమ్మి ముగ్గురు కూతుళ్ల పెళ్లిళ్ల చేసేసి, కేశవరావ్ అవుట్ హౌస్‌లో అద్దెకి దిగిన రంగనాథం, రాజ్యలక్ష్మమ్మ గార్ల ఆఖరి సంతానం మీనాక్షిని మాయమాటలతో మోసపుచ్చి తన కోర్కెను తీర్చుకొంటాడు మురళి. కామేశ్వరమ్మకు ఆడపిల్ల పుడుతుంది మీనాక్షి గర్భవతి అవుతుంది. మురళి కనిపించకుండా తప్పించుకు తిరుగుతుంటాడు. అతని తల్లితో ఈ విషయాన్ని రాజ్యలక్ష్మమ్మ చెప్పగా, ఆమె వీళ్లమీదే అపనిందలు వేస్తుంది. రంగనాథం కేశవరావ్ దగ్గరకు వెళతాడు. కేశవరావ్ రంగనాథానికి అభయమిస్తాడు. దాంతో ఇంట్లో కేశవరావ్, కామేశ్వరమ్మగార్ల మధ్య ఘర్షణ జరుగుతుంది. ఇక కేశవరావ్ తన మాట వినే పరిస్థితిలో లేడని మురళికి కొంత డబ్బు ఇచ్చి, ఏవేవో చెప్పి సాగనంపుతుంది. మురళిని కేశవరావ్ వైజాగ్ మెడికల్ కాలేజీలో చేర్పించి వస్తాడు. చివరికి చేసేదిలేక మీనాక్షిలో పెరుగుతున్న పాపాన్ని రంగనాథానికి ఇష్టం లేకపోయినా రాజ్యలక్ష్మమ్మ నాటు వైద్యంతో నిర్మూలించాలనుకుంటుంది.

ఇక ఇప్పుడు మితిమీరిన బాధని ఓర్చుకోలేకపోతున్నది. తల్లి గద్దింపులు లక్ష్యపెట్టే స్థితిగూడా దాటిపోయింది.

"అమ్మా", "అయ్యో" అని ఆ పిల్ల పెట్టే కేకలు చుట్టుపక్కల ఇళ్ళలో వున్నవారి చెవుల్లో దూరటం, ఒకరిద్దరు పెరటి గోడమీంచి తొంగిచూసి, "రాజ్యలక్ష్మమ్మ పిన్నీ! మీనాక్షి ఒంట్లో బాగులేదా?" అని పరామర్శించటం జరిగింది.

రాజ్యలక్ష్మమ్మ విచారంగా మొహం పెట్టి, "నిన్నటినించీ కడుపు నొప్పని ఏకమొయిన గగ్గోలెడుతోందమ్మా. అజీర్తి చేసిందేమోనని వాంపువ్వు వేసి చూశాను;ఏదీ– నెమ్మళించనేలేదు. ఈరోజు మరీ ఎక్కువయింది" అన్నది,

"ఈ రోజుల్లో ఏ రోగాన్నీ తక్కువగా అంచనా వేసి అశ్రద్ధ చేయకూడదండీ! వెంటనే డాక్టరుకి చూపించండి. అదేమి నెప్పో ఏమిటో?" అంటూ సలహా ఇచ్చింది మరొకాడవిడ.

"ఈవేళ కూడా చూసి అదే చెయ్యాలనుకుంటున్నాం" అని చెప్పి తెలివిగా ఎట్లాగో వాళ్ళని మభ్యపెట్టింది రాజ్యలక్ష్మమ్మ.

మధ్యాహ్నం రెండయింది. మీనాక్షి పరిస్థితి విషమించింది. నెప్పలకి తాళలేక మధ్య మధ్య స్పృహ తప్పుతోంది గాంభీర్యం తొణికి కళవళపడింది రాజ్యలక్షమ్మ.

మూడు గంటలకి అంట్లు తోమడానికి వచ్చిన అచ్చమ్మ కూడా మీనాక్షిని చూసి ఆందోళనపడింది.

"నాకేమో చిన్నమ్మని చూస్తుంటే మన అరివి చెడినట్టనిపిస్తోందమ్మా! ఎందుకైనా మంచిది రంగమ్మ నొకతూరి పిలుచుకొచ్చేదా?" అన్నది సంకోచంగా.

"పట్టపగలు రంగమ్మ తమ ఇంటికి రావడమంటే, మీనాక్షి కడుపు నెప్పేమిటో, రంగమ్మ ఇక్కడచేసే పనేమిటో, డప్పుతో చాటించటంకదూ? పలుగుర్లో నగుబాటయిన బ్రతుకు బ్రతికేం–చచ్చేం!' జారిపోతున్న ధైర్యాన్ని కూడగట్టుకుంది రాజ్యలక్షమ్మ.

"ఒద్దు–చీకటి పడనీ" అన్నది మొండికెత్తినట్టు. అచ్చమ్మ వెళ్ళిపోయింది.

వరండాలో గంగవెర్రులెత్తినట్టు పచార్లు చేస్తున్నారు రంగనాథంగారు. ఈ రోజాయనకి బయటికెక్కడా వెళ్ళాలనిపించటంలేదు. ఎక్కడికి వెళ్ళినా మనసు నిలిచిపోయేది ఇంటిదగ్గరే. పడిన చోటే వెతుక్కోవాలిట. మరీ అంత పెదాలు బిగించి నొప్పి తొక్కిపెడుతూ నిస్సహాయంగా మూగగా రోదిస్తున్న కూతురి చుట్టూరావే పరిభ్రమిస్తూ వుండగా, మనశ్శాంతికోసం శరీరాన్ని ఎక్కడెక్కడో తిప్పి ప్రయోజనం లేదని ఇంటిపట్టునే వుండిపోయాడాయన.

కూతురు మంచం దాపుల్నే తచ్చాడుతూ, మీనాక్షి "ఆ" అని కేక పెట్టినప్పుడల్లా లబ లబలాడుతూ, "ఏమ్మా" "ఏం తల్లీ" అని లాలిస్తూ, దగ్గరగా చేరబోయేడు కానీ రాజ్యలక్షమ్మ, "మీరిక్కడ వుండకూడదు – వరండాలో కూర్చోండి." అని నిక్కచ్చిగా చెప్పడంవల్ల ఇష్టం లేకపోయినా తప్పనిసరిగా వరండాలోకి వచ్చేశారు.

ఉండి ఉండి లోపల్నించి నొప్పి ఉధృతమై మీనాక్షి చేసే ఆర్తనాదంతో చరణాకోల చురుకు తగిలిన గుర్రప్పిల్లలా ఎగిరిపడే గుండెను దాచుకుంటూ, నిట్టూర్పులు విడుస్తూ కూర్చుండిపోయేరు.

రాజ్యలక్షమ్మ స్థితీ ఆయనకు తీసిపోలేదు. మధ్య మధ్య తెలివి తప్పిపోతున్న మీనాక్షిని చూస్తుంటే తెచ్చిపెట్టుకున్న ధైర్యం తుడిచిపెట్టుకుపోయిం దావిడకి. మనసు కకావికలమవుతోంది. ఏ పనిలో జొరబడదామన్నా బుద్ధి నిలకడగా లేనందున చేస్తున్న పని అస్తవ్యస్తంగా తయారవుతోంది.

ఇక లాభంలేదని అన్ని పనులకీ స్వస్తి చెప్పి కూతురి సమక్షంలోనే కూలబడిపోయింది.

మగతలోకి జారుకుంటున్న కూతురి మొహం మీద నీళ్ళు చిలకరించి విసినకర్రతో విసురుతూ, తెల్లగా పాలిపోయిన మీనాక్షి బలహీనంగా మూలుగుతూ మళ్ళీ స్పృహలోకి రావటాన్ని చూసి దుఃఖం ఆపుకోలేక జలజలా కన్నీరు రాల్చింది. 'లోకానికి వెరిచి చేతులారా బిడ్డను ఎక్కడికి ఈడుస్తున్నాను?' అని లోలోపల వాపోయింది.

* * *

ఆకాశం తళుకు నక్షత్రాల వల్లె ముసుగు కప్పుకుంది. అచ్చమ్మ రంగమ్మతోసహా వచ్చింది.

వీళ్ళు పడినంత గాభరా రంగమ్మ పడలేదు. "పిరసం మూలాన్ని కళ్ళు తిరుగుతున్నయ్యేమో? బలానికి తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం – హార్లిక్సో, పాలో గంటగంటకీ ఇస్తూ వుండండి. ఈ రోజు పూటయిన దోమ ఇచ్చివెడతాను. పొద్దునకంతా... మీ అమ్మాయి కొచ్చిన కష్టమూ, కడుపూ కూడా తుడిచిపెట్టుకుపోతాయిలెండి." అన్నది వెకిలిగా నవ్వుతూ.



ఆ తరవాత ఒప్పుకున్న డబ్బుతో సగం అత్యవసరమున్నదంటూ రంగనాధంగారి నడిగి పుచ్చుకుని, మిగతా సగం రేపు అచ్చమ్మచేత పంపమని మరీ మరీ చెప్పి వెళ్లిపోయింది రంగమ్మ.

రంగమ్మ చెప్పినట్టే తెల్లవారకుండానే అందరి మనస్తాపాలూ పరిసమాప్తి ఐయాయి.

''కెవ్వు'' మన్న కేకతో వరండాలో మంచం మీద మగతగా కునుకు తీస్తోన్న రంగనాధంగారు వులిక్కిపడి లేచి లోపలికి పరిగెట్టారు. విరుచుకు పడిపోతున్న భార్యనీ, రక్తంలో మునిగి కట్టెలా బిగుసుకుపోతున్న కూతుర్నీ చూస్తూనే కొయ్యబారి పోయాడు.

ఘాటైన ఆ నాటు ఔషధాన్ని, బలహీనంగా వున్న మీనాక్షి శరీరం ఇముడ్చుకోలేక వికటించింది. ఫలితంగా ఆ అమ్మాయి ప్రాణాలనే బలి తీసుకున్నది.

* * *

పొదిగే పొదిగే గుడ్లని నిర్దయగా కబళిస్తున్న కాలనాగును చూస్తో తల్లిపక్షి చేసే గగ్గోలులాగా —

దూడ నెత్తుకుపోతున్న కసాయివాణ్ణిచూస్తూ కట్టుగొయ్యకు కట్టివెయ్యబడ్డ ఆవు అలమటిస్తూ చేసే ఆక్రందనం లాగా చీకటిని చీల్చుకుంటూ, 'కెవ్వు'మంటూ రాజ్యలక్షమ్మ వేసిన కేక, డెన్‌లప్ పరుపుమీద సుఖంగా పవ్వళించి కొడుకు వివాహ వైభవాన్ని టెక్నికలర్‌లో కలలు కంటోన్న కామేశ్వరమ్మ మధుర స్వప్నాన్ని చెదిర్చివేసింది.

ఉలిక్కిపడుతూ మేలుకున్నది కామేశ్వరమ్మ.

చుక్కలు వెలవెలబోతూ, తూరుపు తెలతెల వారుతున్న ఆ సమయంలో పక్షుల కలకూజితాలు మాత్రమే అప్పుడప్పుడూ స్వల్పంగా వినవస్తున్నాయి.

ఆ నీరవ నిశ్శబ్ద వాతావరణాన్ని భగ్నం చేస్తూ పెరట్లోంచి రంగనాధంగారి గద్గద కంఠస్వరం, ''నా తల్లీ ... మీనా ... ఈ ముసలాళ్లని మోసం చేసిపోయేవా అమ్మా'' అంటూ గుండెలవిసిపోయ్యేలా విలపించటం చెవులకు స్పష్టంగా వినిపిస్తోంది.

కామేశ్వరమ్మ గుండెనెవరో సన్నగా కోత పెడుతోన్నట్టుగా అయింది.

ఎంతయినా ఆమెదీ ఒక మాతృ హృదయమే. చటుక్కున తన పక్కనే నిద్దరోతున్న పసిబిడ్డను గుండెకు హత్తుకుంటూ, ''మీనాక్షి చచ్చిపోయిందా!'' అనుకున్నది బాధగా.

ఆమె మనసు మూడురోజుల వెనకటి సంఘటన గుర్తుచేసింది.

ఆ రోజు నడిరాత్రివేళ వీధిగేటు తీసిన చప్పుడయింది. అప్పుడే మంచినీళ్లకని లేచిన తనకది వినిపించింది. కొద్దిగా భయ సందేహాలు కలిగాయి. భర్తకూడా ఇంట్లోలేరు. కలప ఖరీదు చేసేందుకై పొరుగూరు వెళ్లేరు.

ఎలాగో ధైర్యం తెచ్చుకుని లేచింది. పడగ్గది కిటికీలోంచి చూస్తే గేటు తలుపు ఓరగా కనబడు తుంది. కిటికీ దగ్గరగా వెళ్లి చీకట్లోకి కళ్లు చికిలించి చూసింది.

రెండు ఆకారాలు నిశ్శబ్దంగా లోనికి రావటం లీలగా కనిపించింది. 'ఎవరువారు' అని కేక వెయ్యబోయి ఆగింది. వారిద్దర్నీ ఆడవాళ్లుగా గుర్తించి ఆశ్చర్య పడింది. వారు పెరటివైపు దారిపట్టారు. తను ఆదరాబాదరా వంట ఇంట్లోకి వెళ్లి కిటికీలోంచి పెరట్లోకి తొంగి చూసింది.

రంగనాధంగారి ఇంట్లోకి వెడుతున్నారువాళ్లు. మహాలక్షమ్మ స్వయంగా లోనికాహ్వానిస్తోంది.

వాళ్ల ఇంట్లోనించీ వరండాలో పడుతున్న లైటు వెలుతుర్లో వాళ్లిరువురినీ తాను బాగానే చూడగలిగింది.

ఒకరు తమ ఇంట్లో అంట్లుతోమే అచ్చమ్మ. రెండవ వారెవరో చప్పున పోల్చుకోలేకపోయినా ఆ ఒడ్డూ పొడుగూ, ఆ పన్ను ఎత్తూ ... ఎప్పుడో పరిచయమయిన మొగమే అనిపించింది.

'వారికీ అర్ధరాత్రి ఇక్కడేం పనో?' అను కుంటూ తిరిగి పక్కమీద వాలబోయే సమయానికి గప్పున జ్ఞప్తి కొచ్చింది.

ఆ రెండవ వ్యక్తి రంగమ్మ. రంగమ్మ ఒకానొక కాలంలో మంత్రసాని పనిచేసేది. వీధికో లేడీ డాక్టరూ, మలుపుకొక నర్సింగ్‌హోమూ వెలిసిన తరవాత రంగమ్మ పని వెనకబడిపోయింది. ఇప్పుడేం చేసి బ్రతుకున్నదో కూడా కర్ణా కర్ణిగా తను వినే వున్నది.

ఇప్పుడింత అపరాత్రివేళ రంగమ్మ రంగనాధం గారింటికి రావల్సొచ్చిన విశేషమేమిటి తనకాక్షణంలో తేటతెల్లంగా అర్థమయిపోయింది.

ఎందుకోగానీ భారం దించినట్టు తేలికపడింది మనస్సు.

''నిజమే. అంత నాటకం ఆడి భర్తచేత కూడ కాదనిపించింది. తన మార్గం నిష్కంటకం చేసు కున్నారని ఓ పక్క మురుస్తోంది.

అయినా కొడుకు అంశ ఆ పిల్ల గర్భంలో పెరుగుతున్నంతకాలం దాన్ని సాక్ష్యంగా పెట్టుకుని ఎప్పుడు తమని వాళ్లు రచ్చకీడుస్తారో అన్న శంక మరోపక్క జలగలా తనని పీడిస్తూనే వున్నది.

అల్లాఅవటమే గనక సంభవిస్తే ఈ లోకులు అటువాళ్ల పక్షమూ అవలంభించరు; ఇటు తమ పక్షాన్నీ సమర్థించరు. తటస్థంగా ఊరుకున్నట్టు నటిస్తారు. కాని అంతర్యంలో మురం నే అనుమా నిస్తారు. మా పిల్లవాడు అమాయకుడంటున్న తమ ధోరణిని లోలోపలే దుయ్యబడతారు; 'పాపం ఆ పిల్లని మోసపుచ్చే వుంటాడు అని తీర్మానిస్తారు. ఈ లోకుల నైజమే అంత.

ఈ భీతికూడా ఏ మూలో పనిచేస్తూనేవున్నది.

ఇహ ఫరవాలేదు. రుణశేషం ... శత్రుశేషం — అన్నట్టు ఆ గర్భశేషం కూడా నిశ్శేషమైన తర్వాత ఇల్లు ఖాళీచేసెయ్యమని తాఖీదు ఇప్పించాలి. దానితో తాము పూర్తిగా ఆ బురద కడుక్కున్నట్టే అని ఎంతో సంతృప్తిపడింది తను.

అప్పటినించీ రాజ్యలక్షమ్మ ఇంటివైపు ఓ కన్ను, చెవీ వేసే వుంచింది. అచ్చమ్మ రాకపోకలూ, గుస గుసలూ ఓరకంట పరికిస్తూనే వున్నది.

క్రితం రోజున మీనాక్షి మూలుగులూ, ఇరుగు పొరుగుల్తో రాజలక్షమ్మ చెప్పే కల్లబొల్లి కారణాలూ పయితం అన్నీ వింటూనే వున్నది.

అంతకంతకూ వారి ఇంట్లో పెరుగుతున్న అలజడీ, వారి ముఖాల్లో చేరుకుంటూన్న నైరాశ్యమూ చూస్తున్నకొద్దీ, ''ఆ పిల్లేమవు తుందో?'' అన్న ఆందోళన తనకీ కలిగింది; సరిగ్గా తన పనీ సాగిందికాదు.

తెల్లవారకుండానే తను అనుమానించినంతా అయింది. తప్పుడు వైద్యం ఎంత ముప్పు తెచ్చిందీ!

రంగనాధంగారి మిగతా కొడుకులూ కూతుళ్లూ వచ్చారు. జరపాలిసిన తతంగాలన్నీ యధావిధిగా జరిపించారు.

ఇరుగు పొరుగుల మనసుల్లో మీనాక్షి మరణం పట్ల ఎన్ని సంశయాలు పుట్టకొక్కుల్లా పుట్టు కొస్తున్నా, దుఃఖసముద్రంలో మునిగివున్న వారిమీద అవాకులూ చెవాకులూ ప్రేలటానిక్కానీ, తెలిసీ తెలియని అపవాదులు వెయ్యటానిక్కానీ సాహసించ లేకపోయారు.

''ఇక్కడేం వుందిక? మావెంట వచ్చెయ్యండి'' అన్నాడు రంగనాధంగారి పెద్దకొడుకు విశ్వం తండ్రితో.

''అవును. ఏముందిక్కడ? ఇదివరలో అయితే మీనాక్షి వుండేది. ఆ పిల్ల పెళ్లీ పేరంటమూ చెయ్యాలన్న బాధ్యతవుండేది; పండగా పబ్బం జరపాలన్న సరదావుండేది; చీరా సారే పెట్టాలన్న ముచ్చటవుండేది; పురుడూ పుణ్యం చూడాలన్న కోరికవుండేది; ఇవన్నీ కొడుకుల ఇంట్లోవుంటే తీరవన్న భయం వుండేది.

ఇప్పుడేముంది? అన్నీ మీనాక్షితోపాటే మట్టిలో కలిసిపోయాయి.

తమకేం కావాలిక? గుప్పెడు మెతుకులు; జానెడు గుడ్డ; బారెడు చోటూ ఇస్తామన్న హామీ చాలు. ఎక్కడుండేటందుకైనా సిద్ధమే

## టెలిఫోన్ దయ్యం!

పశ్చిమ జర్మనీలో రీగిన్స్ బర్గ్‌లో ఒక వింత దయ్యం ఒక దంతవైద్యుని సెక్రటరీని ప్రేమిస్తున్నదిట. ఆమె పేరు క్లాడియా. ఆ దయ్యం తనను స్వయంగా చోపర్ అని పిలుచుకుంటున్నాడు. ఈ గొడవ ప్రారంభమై దాదాపు సంవత్సరమయింది. ఒకరోజు వుదయం ఆ డాక్టరు ఒక రోగితో టెలిఫోనులో మాట్లాడుతుంటే ఈ దయ్యం మధ్యలో కల్పించుకుని వీరితో సంభాషించింది. దీనిని క్రాస్ టాక్ అని భావించి ఆ డాక్టరు గారు ఫిర్యాదు చేసినమీదట టెలిఫోను యింజనీర్లు ఆ తీగెలను మార్చారు. అయినా ఆ దయ్యం వదలలేదు. ఆ తరువాత టెలిఫోనును పూర్తిగా డిస్కనెక్టు చేసినా దయ్యం మాటలు మాత్రం వినిపిస్తునే వున్నాయి. ఇంజనీర్లు ఎంత ప్రయత్నించినా ఆ దయ్యపు మాటలు ఎక్కడ నుండి వస్తున్నాయో కనుక్కోలేకపోయారు. చివరకు అవి అశరీరవాణి మాటలని నిర్ధారించి ఏం చేయాలో తోచక వూరుకున్నారు. క్లాడియా మాత్రం ఈ దయ్యపు మాటలకు అలవాటు పడింది.

# వివాహ వేదిక

## (ప్రకటనదారులకు కొత్త అవకాశం)

రోజురోజుకు సాంఘిక వ్యవస్థ, వివాహ తీరుతెన్నులు మారుతున్నవి. మారుతున్న ధోరణులకనుగుణంగా వివాహ సంబంధాల గూర్చి తగు సమాచారము సేకరించుటలో క్లిష్టత, త్రిప్పట, వ్యయం అధికమవుతున్నవి.

వధూవరుల కొరకు సమాచారము పత్రిక ద్వారా అందజేసుకోవడం వల్ల కొంత ఈ సమస్యకు పరిష్కారము కాగలదు ఈ దృష్టితోనే ఆంధ్రపత్రిక (దినపత్రిక) లో వధూవరులను గూర్చిన ఒక ప్రకటనల వేదికను ప్రచురించదలచినాము. మామూలుగా అయ్యే చార్జీలపై 50% రాయితీతో అంటే మామూలు సంగ్రహ ప్రకటనలకు లైనుకు రూ.5లు చార్జీకి బదులు ఈ ప్రత్యేక కాలంలో లైనుకు రు 2-50 వంతున చార్జి వుంటుంది. (లైనులో సుమారు 15-16 అక్షరములు ఇమడగలవు) నాలుగు లైన్లకు తక్కువ లేకుండా ప్రకటన వుండాలి.

మీ ప్రకటన విషయము + చార్జీలను మని ఆర్డరు/డ్రాఫ్ట్ ద్వారా జతపరచి (బాక్స్ నెంబరు కోరేవారు అదనంగా రూ.5లు చెల్లించాలి)

**ఆంధ్రపత్రిక**

గాంధీనగరం, విజయవాడ-3

లేదా

బషీర్ బాగ్, హైదరాబాద్-29కు

పంపవచ్చును.



## 7 వ తరగతి పబ్లిక్ పరీక్షలు



వ్రాసే విద్యార్థుల కోసం ప్రత్యేకంగా నెలనెలా వారి పాఠ్యాంశాలతో బాటు విజ్ఞాన దాయకమైన విషయాలతో వెలువడే పత్రిక

**మా బడి**

విడిప్రతి వెల రూ 2

సంవత్సర చందా: రూ 18

(చందాదారులకు 5 రూ విలువజేసే విజ్ఞానదాయకమైన పుస్తకం ఉచితంగా యివ్వబడుతుంది.)

చందాదారులు పైకం పంపాల్సిన చిరునామా:

**మా బడి**

చౌడేపల్లె-517257

చిత్తూరు జిల్లా. ఆం. ప్ర.

ఏజన్సీ వివరాలకు



మార్గదర్శి మార్కెటింగ్ ప్రైవేట్ లిమిటెడ్

ఈనాడు కాంపౌండ్,

సోమాజిగూడ,

హైదరాబాదు-4

## కాలం కరిచాక

మౌనంగా తన అంగీకారం తెలిపారు రంగనాథంగారు.

* * *

రంగనాథంగారి కుటుంబం శాశ్వతంగా ఆ వూరునుండి తరలిపోతున్న రోజున ఇరుగు పొరుగూ, తెలిసినవారూ, స్నేహితులూ ఒక్కొక్కరూ వచ్చారు. సానుభూతి చూపించి, ఉపశమన వాక్యాలు పలికి, వీడ్కోలు చెప్పి శెలవు తీసుకున్నారు.

పెద్దా చిన్నా సామానులన్నీ సర్ది బండి కెక్కించారు కొడుకులు. ఒక్క రాజ్యలక్షమ్మ తప్ప అంతా రిక్షాలు ఎక్కారు.

పెద్ద కొడుకు విశ్వం తల్లి భుజం చుట్టూరా చెయ్యివేసి నెంపాదిగా నడిపించుకొస్తున్నాడు రిక్షా దగ్గరకి.

అప్పటి రాజ్యలక్షమ్మ వాలకం హృదయ విదారకంగా వున్నది. కూతురు పోయాక ఎవరెంత బ్రతిమలాడినా ఆవిడ మెతుకు కొరకలేదు. కన్ను మూయ్యలేదు. మీనాక్షిని తలచి భర్తా కొడుకులూ, కూతుళ్లూ హోరుమని అంత ఏడుస్తున్నా ఆవిడ కంట నీటిబొట్టు రాలేదు మతి చలించిన దానిలా కూర్చున్న చోటనే ఉండిపోతున్న ఆవిడ రూపు చూసేవారికి రేపో మాపో ఈవిడ ప్రాణమూ ఆఖరే అనుకునేటట్లుగా తయారయింది.

ప్రేతకళ పడిన ఆకారంతో, వీడిన శిరోజాలతో, నిప్పుకణికల్లా ప్రజ్వలిస్తున్న కన్నులతో, అస్తవ్యస్తంగా నేలను జీరాడుతున్న చీరతో, ప్రాణం ఏ మాత్రమూలేని శరీరాన్ని కొడుకుపై మోపి అడుగులో అడుగు వేసుకుంటూ నడిచొస్తున్న రాజ్యలక్షమ్మ గేటు సమీపంగా వచ్చి ఆగింది. హఠాత్తుగా వెనక్కి తిరిగి చూసింది.

కుతూహలం కొద్దీ అప్పుడే లోపల్నించి తొంగి చూస్తోంది కామేశ్వరమ్మ,

ఒక్కసారి పిచ్చిబలంతో కొడుకు చేతుల్ని విదిలించుకున్నది రాజ్యలక్షమ్మ. ఒక్క వూపున రెండంగల్లో వరండా మెట్లన్నీ లంఘించి కామేశ్వరమ్మ ఎదటకు దూకింది.

"నా బిడ్డను మింగావు; నా కడుపున చిచ్చు పెట్టావు. జ్ఞాపకముంచుకో నా మాట! నీకూ ఆడపిల్ల వుంది. నా ఉసురూ నా బిడ్డ వుసురూ నీకూ నీ బిడ్డకూ తగిలి తీరుతుంది" ఆవేశంతో వూగిపోతో భద్రకాళిలా హుంకరిస్తూ శపిస్తున్న తల్లిని బలవంతాన లాక్కుపోయి రిక్షాలో కూల వేశాడు విశ్వం.

రిక్షాలు సాగిపోయాయి.

అప్పటివరకూ విద్యుత్ ఘాతం తలిగిన దానిలా దిమ్మెరపోయిన కామేశ్వరమ్మ మొగాన నెత్తురు బొట్టులేదు. తెలివి తెచ్చుకున్న మరుక్షణం గజగజ వణికిపోతూ లోపలికి పరిగెత్తింది. ఉయ్యాలలో ఆడుకుంటున్న పాపను అమాంతం లేవనెత్తి గుండెల కదుముకుని, కళ్లు మూసుకుంటూ ఏదో అస్పష్టంగా గొణుక్కుంది.

ఎవరిని తలచి ఏమని వేడుకున్నదో ఆ భగవంతుడికే తెలియాలి.

## శాసనం

చేను మేసే కంచెకి
శ్రమదానం చెయ్యకు
కాటేసే పాం పిల్లకు
పాలుపోసి పెంచకు

— డా॥ పురిపండా అప్పలస్వామి

ఒకరి జీవితం అతి విషాదాంతం కావటానికి కారకుడయిన మురళి విశాఖపట్నంలో హాయిగా ఖుషీగా రోజులు గడిపేస్తున్నాడు.

తాను నడిసంద్రాన విడిచి వచ్చిన అబల జీవితం ఏమయివుంటుందో తెలుసుకోవాలన్న యోచన అతనికి యిసుమంతయినా కలగలేదు.

అడిగిందే తడవు జేబు నింపుతున్న తండ్రీ, వెనక వత్తాసి ఇస్తున్న తల్లి అండా వున్నంతకాలం అతని కిటువంటి క్షుద్ర విషయాలు మనసుకు పట్టించుకోవాలిసిన అవసరం లేదూ — రాదు.

ఐదు ఏళ్ళ ఆట్టే విశేషాలేమీ లేకుండానే గడిచాయి. మురళి చదువు పూర్తయింది. హౌస్ సర్జన్ కూడా అక్కడే చేస్తున్నాడు. దీర్ఘకాలం హాస్టలు జీవితంతో విసుగెత్తిపోయిన మురళి బయట రూము తీసుకుంటున్నాడు.

మురళికి దొరికిన గది మేడమీద వున్నది. అద్దె చాలా ఎక్కువే. కానీ ఇంటివారితో ఏ సంబంధం లేకుండా సపరేటుగా ఎటాచ్‌డు బాత్‌రూమూ, లేవెటరీ అన్ని సౌకర్యాలూ ఉన్నాయి దానికి.

గది వెనకవైపున ఉన్న కిటికీలోంచి సముద్రం చాలా దగ్గరగా కనిపిస్తూ వుంటుంది. పందెపు గుర్రాల్లా మరగలు కక్కుతూ పరిగెత్తుకొచ్చే కెరటాలు, ఒడ్డు నొరుసుకుంటూనే చేవ చచ్చినట్టు వడి తరిగి కరిగిపోవటం గమ్మత్తుగా కనిపిస్తూ వుంటుంది.

అప్పుడప్పుడూ కల్లోల జలధిని అణిచివేసే వీరకిశోరాల్లా రయ్యిమంటూ దూసుకొచ్చే స్టీమర్లు, అంతలోనే దూరదూరంగా కనుమరుగయి పోతుంటాయి.

ముఖ్యంగా పౌర్ణమినాటి రాత్రి పూర్ణ సుధాకర తేజాన్ని నింపుకొని కోటి వెల్గులతో మెరిసిపోతున్న అంబర కన్యను చుంబించాలనే తపనతో సహజ గాంభీర్యాన్ని వీడి సముద్రుడు ఉత్తుంగ తరంగ హస్తాలు చాచి సుదీర్ఘ విరహ తప్త కంఠంతో ఘోషిస్తూ అందుకోజూస్తున్న దృశ్యాన్ని చూస్తూ నిదురమాట మరచి రేయెల్లా గడిపేయవచ్చును.

మురళికి మాత్రం ఇవేవీ పట్టవు. ఫారిన్ మ్యూజిక్ హవ్ చేసే మురళికి లయబద్ధమయిన సాగర రవళి తలనొప్పి కలిగిస్తుంది. రికార్డు డాన్సుల అభిమాని మురళికి విశృంఖల సముద్ర నృత్యం వినుగుపుట్టిస్తుంది.

సౌందర్య మెల్లప్పుడూ ఎలాంటిదయినా ఆరాధ్య నీయమే. కాకుంటే సౌందర్యాన్వేషకుల తీరుల్లోనే తేడాలు కానవస్తాయి.

వికసించే కుసుమాల్లోనూ, ఉదయించే భానునిలోనూ, పసిపాప బోసినవ్వులలోనూ అందాలు ఏరుకుని ఆస్వాదించగలిగేవారు కొందరు; చిత్రకారుని చిత్రణలోనూ, శిల్పకారుని శిల్పంలోనూ, కవీశ్వరుని కవనంలోనూ అందాలు వెతుక్కుని ముగ్ధులయేవారు కొందరు; కత్తిరింపు జుట్టు కదలికలోనూ, లిప్‌స్టిక్ పెదవుల నిగనిగలోనూ, నైలాన్ కొంగుల రెపరెప లోనూ కనిపించే అందాలకు పరవశించేవారు మరికొందరు.

ఈ మూడో కోవకు చెందినవాడు మురళి. బయటినించి గదికి రాంగానే కిటికీ క్రింద తలుపులు మూసేసి, "అన్నీ బాగానే ఉన్నాయిగానీ ఈ సముద్రం రొదనే ఈ గదికున్న ఓ పెద్ద న్యూసెన్సు. ఇదిగాక ఏ లేడీస్ హాస్టలో ఈ పక్కన ఉన్నట్టయితే బహు పసందుగా వుండేది." అని విచారిస్తూ వుండేవాడు.

అంతేగానీ గంటలతరబడి పక్కమీద దొర్లితే కానీ నిద్రపట్టని తనకి పడుకున్నదే తడవుగా కన్నులు మూతపడిపోయి తెల్లవారేవరకూ గాఢనిద్ర పట్టడానికి కారణం స్వచ్ఛమయిన ఆ కడలి పవనాలే!' అని తట్టేదేకాదు మురళికి.

కళ్ళుండే గుర్తించలేకపోయిన ఆ అందాల్ని అతనికి పరిచయం చేయటమే కాకుండా అతడు అతి చులకనగా, 'ఆ — ఏముంది — గంద్ర ఇసుకా, ఉప్పు నీళ్ళూ, చలిగాలీ...' అని తీసిపారేసిన సముద్రానికి అతడు ఊహించనైనాలేని భావర్థాల్నిసమన్వయపరిచి చెబుతూ అతన్ని విభ్రాంతిలో ముంచిన వ్యక్తి హిమబిందు.

* * *

మురళీ ఇంటి ఓనరు రంగారావుగారు ఓ రిటయిరయిన మిలటరీ ఆఫీసరు. హిమబిందు వారి గారాబు పట్టి.

మురళి ఆ గదిలో ప్రవేశించిన పదిహేను రోజుల తర్వాత అతనికి హిమబిందు దర్శనమయింది.

పరీక్షలు రాసి శెలవులు మేనత్త వూర్లో గడిపి ఆ రోజునే ఇంటికి వచ్చింది హిమబిందు.

ఆ అమ్మాయి టాక్సీ దిగటాన్నీ ఓ చేత్తో హేండు బేగూ, ఓ చేత్తో సూటుకేసూ చులాగ్గా మోసుకుంటూ కాలితో గేటు నెట్టి చకచక నడుచు కుంటూ ఇంట్లోకి వెళ్లటాన్నీ, వీధివైపు కిటికీలో అద్దం పెట్టుకుని షేవ్ చేసుకుంటున్న మురళీ చూస్తూనే వున్నాడు.

'ఎవరీ మెరుపుతీగ ?' అని అబ్బురపడ్డాడు.

కూజాతో మంచినీళ్ళు పెడుతోన్న పనిపిల్లని అడిగి ఆ మెరుపుతీగ, "అయ్యగారి బొట్టె ఇమబిందమ్మ !" అనిమాత్రం తెలుసుకున్నాడు.

ఇంకా కొత్తయ్యె! హడావిడిపడి అంత ఇన్‌ఫర్‌మేషన్ ఇప్పుడే దాన్నించి రాబట్టాలనుకోడం ఏమంత మంచిది కాదు. "ఇన్ని ఆరాలూ నీకెందు కయ్యా ?" అని అది తిరిగి ఆరా తియ్యొచ్చు. అని జడిసి అంతటితోనే ఊరుకున్నాడు.

అదృష్టం బావుండి అనుకోకుండా ఆ సాయంత్రమే అన్ని వివరాలతోపాటు హిమబిందు పరిచయ భాగ్యం కూడా లభించింది అతనికి.

(ఇంకా వుంది)

# ఆవూ పులీ కథ

## వసుంధర



రాజమండ్రి రైల్వేస్టేషన్లో కుటుంబ సమేతంగా దిగాను. వైభవాన్ని సూచించే వీఐపీ చక్రాల పెట్టెల్ని దొర్లించుకుంటూ స్టేషన్లోంచి బైటకు వచ్చి రిక్షా బేరమాడాను.

నల్గురు పెద్దవాళ్ళు, ఇద్దరు పిల్లలు—మూడు పెట్లు ఉన్నాయి. మూడు రిక్షాలు సరిపోతాయి. ఇలా నేను లెక్కవేసుకుంటూండగా రిక్షా అతను—"అయిదు రూపాయలవుతుందండి—" అన్నాడు.

—"మొత్తం మా అందరికీనా?" అనడిగాను.

"కాదండి—ఒకోరిక్షాకి—" రిక్షా అతను బదులిచ్చేడు.

"ఏమిటీ! స్టేషన్నించి బొబ్బర్లంక లాంచీల రేవుకి అయిదు రూపాయలా?" అన్నాను. ఈ మాటలు మామూలుగా పైకి వచ్చాయేమో గానీ అవి వచ్చేముందు శరీరంలో చాలా ప్రతి చర్యలు జరిగాయి. రక్తం వేడెక్కింది గుండెవేగం పెరిగింది. మనసు ఆవేశపడింది. మా చక్రాల పెట్టెలతో మేము నడుచుకుంటూ పోయినా లాంచీలరేవు చేరడానికి అర్థగంట కూడా పట్టదు. చెప్పుకోదగ్గ ఎత్తూ లేదు. నా కోపాన్ని అతికష్టంమీద ఉపసంహరించుకుని—శ్రీమతితో—"పదండిపోదాం" అన్నాను.

అన్నదే తడవుగా పిల్లలు ఈ అవకాశంకోసమే ఎదురుచూస్తున్నట్లు చెరో పెట్టినీ బరబర లాగసాగారు. అంతా బయల్దేరాం.

"అలా వెళ్ళిపోతారేమండీ — ఎంతిస్తారో చెప్పండి" అన్నాడు రిక్షా అతను.

"రిక్షా అక్కర్లేదులే" అన్నాను సాధ్యమైనంత తాపీగా.

"మీరెంతిస్తారో చెప్పండి—ఇష్టమైతే కడతాం లేకపోతేలేదు" అన్నాడు రిక్షా అతను.

ఆ సమయంలో నాకు దోపిడీ చేసేవర్గం వాడిదీ—దోచబడుతున్నది నేనూ అనిపించింది. అందుకే "రిక్షా అక్కర్లేదన్నాగా" అన్నాను.

"అక్కర్లేకపోతే ఎందుకడిగారు?" అతను ప్రశ్నవేశాడు.

"పోనీ సరదాగా రిక్షా ఎక్కుదాం అనుకుని అడిగాను" అన్నాను కోపంగా.

"సరదాగా రిక్షా ఎక్కాలనుకుంటే అయిదు రూపాయలవుద్దండి" అన్నాడతను.

దెబ్బ తినేశాను. అతనంత తెలివిగా మాట్లాడతాడనుకోలేదు. కోపంగా ముందుకు నడిచాను. స్టేషన్ ఆవరణలోంచి రోడ్డుమీదకు రావడానికి పదడుగులు చాలు. అక్కడ రిక్షాకు రూపాయన్నర చొప్పున బేరం దొరికింది. అయితే రిక్షా సొడుగునా నేనో విషయానికి ఆవేశపడుతూనే—' అష్టరాల్ రిక్షా వాడు నన్నంత మాటంటాడా ?" అనుకున్నాను. నా ఆవేశం సంగతి తెలియని శ్రీమతి "ఏమిటండీ అలా ఉన్నారు?" అంది. ఆమె నాకూ రిక్షా అతనికీ జరిగిన సంభాషణ వినలేదు. నేను చెప్పగా విని "అంత మంచి జోకు వేసినందుకు హృదయ పూర్వకంగా అభినందించాలతన్ని. మీలో బొత్తిగా స్పోర్టివ్‌నెస్‌లేదు" అంది.

అప్పటికి నా సెన్సాఫ్ హ్యూమర్ పనిచేసింది. స్నేహితుల్లో చాలాసార్లు ఒకరిమీద ఒకరు జోకు వేసుకుంటూంటాం. ఒకోసారి జోకు బాగా పేలితే తిప్పి కొట్టడానికి ప్రయత్నించకుండా జోకుని మెచ్చుకుంటాం. మరి ఈ రిక్షా అతన్నికూడా నా స్నేహితుడిలాగే ఎందుకు భావించకూడదూ ?

రిక్షా అతను నాకు స్నేహితుడా ?...ఈ ఆలోచన నాకు నచ్చలేదు. కానీ నాలోని సంస్కారం పదే పదే నన్ను హెచ్చరించసాగింది. నాలోని రచయిత కూడా పని చేయసాగాడు.

రిక్షావాళ్ళను దోపిడీకి గురవుతున్న వర్గానికి చెందినట్లు చాలామంది రచయితలు రాస్తూంటారు. వాళ్ళ జీవన విధానం గురించి ఆట్టే పట్టించుకోని నేను—వాళ్ళగురించి అదే అభిప్రాయంలో ఉన్నాను. రేడియోలు, సినిమాలు, వార్తాపత్రికలు వాళ్లలోనూ అవగాహనను పెంచుతున్నాయి. వాళ్ళు నేను వేసేలాంటి బట్టలు వేసుకోకపోవచ్చు. నేను వెళ్ళే ఖరీదైన హోటల్స్‌కి పోకపోవచ్చు. అయితే తేడా అక్కడితో ఆగిపోతోంది, డబ్బు ఒక్కటే మా ఇద్దరికీ రెండు రకాల ఆకృతులిచ్చింది. కానీ మనిషి మనసుపరంగా చూసుకుంటే — ఇద్దరం ఒక్కటేనని ఈ సంఘటన నాకు తెలియబర్చింది. ఒక విధంగా ఇది నాకు సంతోషాన్ని కలిగించింది. ఈ వర్గానికి మానసిక వికాశం రావాలనీ, తమ పై వర్గాలను త్వరగా కలుసుకోవాలనీ నా కోరిక! అప్పట్నించీ వాళ్ళను నేను మరికాస్త జాగ్రత్తగా పరిశీలించసాగాను.

మరోసారి నాకు ఇలాంటి అనుభవం భువనేశ్వర్లో జరిగింది. అక్కడ ప్రతి ఆదివారం మేము తెలుగు సినిమాలు చూస్తూంటాం. నగరానికి మధ్యలో ఉన్న ప్రియా టాకీసులో ప్రతి ఆదివారం మధ్యాహ్నం పన్నెండు నించి మూడు వరకూ తెలుగు సినిమా ఉంటుంది. సోమ, మంగళ, బుధవారాల్లో కూడా ఉంటుంది కానీ మాకు ఆదివారం మాత్రమే సెలవు. రిక్షావాళ్ళు చాలామంది తెలుగువాళ్ళు.

ప్రియా టాకీసు నుంచి మేముండే కాలనీకి

వెళ్ళడానికి సరైన బస్సు సదుపాయం లేదు. అవి ఎప్పుడో వచ్చిపోతూంటాయి. సినిమా కాగానే వెంటనే ఇంటికి పోవాలంటే రిక్షా ఎక్కడమే మంచిది. అయితే అక్కడికి మా కాలనీ చాలా దూరం. మా కాలనీ విసిరేసినట్లు ఊరికి చివరగా ఉంటుంది. అక్కణ్ణించి తిరుగు బేరాలు దొరకవని రిక్షా వాళ్ళెవరూ రావడాని కిష్టపడరు. చాలామంది రామనే చెబుతారు. అలా అనడం ఇష్టంలేనివాళ్ళు ఎక్కువ ధర చెబుతారు. అవి వచ్చే బేరాలు కాదని వెంటనే తెలిసిపోతుంది.

ఓ రోజు సినిమా చూసి రిక్షా బేరమాడాను. సాధారణంగా మా కాలనీకి ఎండ, గాలి వాటాన్ని బట్టి రెండున్నర లేక మూడు రూపాయలిస్తాం. రిక్షా అతను ఆర్రూపాయలడిగాడు.

"ఇది వచ్చే బేరం కాదు పమా" అన్నాను నా కసిని ఉచ్చారణలో చూపిస్తూ.

రిక్షా అతను కాస్త తగ్గి — "ఏమిస్తారో చెప్పండి బాబూ" అన్నాడు.

ఆర్రూపాయలడిగాడని నాకు చాలా మంటగా ఉంది. అందుకని ఇంకా కసిని ఉచ్చారణలో చూపిస్తూనే — "రూపాయిస్తాను — వస్తావా !" అన్నాను.

దానికి వాడు అది చాలా అన్యాయమని అంటాడనీ, అప్పుడు నేను నువ్వు ఆర్రూపాయలడగడం బాగుందా అని దులిపేయొచ్చుననీ అనుకున్నాను. అయితే నా అంచనా తలకిందులైంది. అతను తన తోటి రిక్షావాడితో — "అబ్బే - ఇది ఎక్కే బేరం కాదురా" అన్నాడు.

నాకు కోపం రాబోయి ఆగిపోయింది. ఎంత తెలివిగా దెబ్బకొట్టాడు ? తెలివి ఏ ఒక్కరి సొత్తూ కాదు. కానీ తెలివితేటల్లో నా స్థాయికి తీసిపోకుండా వీరున్నారని కాస్త ఆనందం కలిగింది.

అయితే నా ఆనందాన్ని వెంటనే ప్రకటించ లేదు. అక్కణ్ణించి నేనూ, శ్రీమతీ కదిలాం. ఓ రిక్షా అతను మా పక్కకొచ్చి "నాల్రూపాయలివ్వండి బాబూ" అన్నాడు.

"మూడు రూపాయలిస్తాను" అన్నాను.

అతను రాలేదు. మేము నడుస్తూ వెడుతున్నాం. రిక్షా అతను మా వెనకే వస్తూ — "మూడున్నర" అన్నాడు. మూడంటే మూడేనన్నాను నేను. అలా కొంత దూరం వెళ్ళాక — పోనీ మూడుంపావలా ఇప్పించమని అడిగాడతను. రిక్షావాళ్ళ విషయంలో ఒకోసారి చాలా పట్టుదల వచ్చేస్తుంది నాకు. అతనికేసి చూడనైనా చూడకుండా ముందుకు ప్రొసీడయ్యాం.

మరికాస్త దూరం వెళ్ళాక—"సరే — ఎక్కండి బాబూ" అన్నాడు రిక్షా అతను.

అప్పటికి నేను జరిగింది గ్రహించాను. ప్రియా టాకీసు నుంచి ఓ అరకిలోమీటరు దూరం వరకూ బాగా ఎత్తు ఉంది. అక్కణ్ణించి కొంత సమతల ప్రదేశం. ఆ తర్వాత డౌను. టాకీసు దగ్గర ఎత్తు ఎక్కించడం చాలా కష్టం. అందుకని రిక్షా అతను తెలివిగా బేరాల వంకపెట్టి ఈ ఎత్తు గడిపేశాడు. ఇది గ్రహించగానే నాకు చాలా ఉక్రోషం వచ్చింది.

"ఇక్కణ్ణించయితే రెండున్నరే ఇస్తాను" అన్నాను.

రిక్షా అతను నాకేసి అదోకలా చూసి — "అలా నడుచుకుంటూ వెళ్ళిపోండి. ఏమీ ఇవ్వకుండానే ఇల్లు చేరొచ్చు" అంటూ రయ్యిమని రిక్షా తొక్కుకుని వెళ్ళిపోయాడు. ఆ దెబ్బనుంచి తేరుకోడానికి నాకు అయిదు నిముషాలు పట్టింది.

ఈ సంఘటనలు నాకు రిక్షావాళ్ళని నాతో సరిసమానులుగా చూడమని హెచ్చరించాయి. మా కాలనీకి ఎప్పుడు రిక్షాలో వెళ్ళినా రిక్షా అతనికి — చల్లటి ఐస్ వాటరు ఇచ్చేవాళ్ళం. ఇంట్లో ఏమైనా తినేది ఉంటే పిల్లలకు పెట్టమని ఇచ్చేవాళ్ళం. ఒకోసారి బట్టలుకూడా ఇస్తూండేవాళ్ళం. ఇలా చేయడంతో కొందరు రిక్షావాళ్ళు మాకు స్నేహితులు కూడా అయ్యారు. ఎన్నో అనవసరపు ఖర్చులు చేస్తూండే నేను వాళ్ళ గురించి పావలా, అర్ధా బేరాలాడడం మానేశాను.

రిక్షావాళ్ళలో నాకు చాలా తమాషా అయిన వ్యక్తులే తగిలారు.

ఒకతను ఎవరో ఒకాయన కూతురు చావు బ్రతుకుల్లో ఉంటే రక్తదానం చేశాట్ట. ఆ తర్వాత ఆయన ఎమ్మెల్యే అయి అతనికో వాచ్‌మన్ ఉద్యోగం ఇప్పించాట్ట. ఆ ఉద్యోగంమీద వచ్చే జీతంలో మూడొంతులు ఇంటికి పంపించేస్తాట్ట — చెల్లెమ్మ పెళ్ళికోసం. మిగతా డబ్బుతో తన తిండి వెళ్ళిపోతుందట. పై ఖర్చులకోసం రిక్షాతొక్కుతాడట - "నాకు సినిమా పిచ్చి బాబూ—అందుకయ్యే ఖర్చంతా నేను రిక్షామీదే సంపాదించుకుంటాను" అని చెప్పాడు. ఇటీవలే ఆ ఎమ్మెల్యే ఏదో మినిస్టరయ్యాడుట కూడా — "మీకేమైనా పనుంటే నాతో చెప్పండి. చిటికెలమీద అయిపోతాయి" అని చెప్పాడు.

మరో రిక్షా అతను వ్యాపారం చేసేవాడట. పదిరూపాయల పెట్టుబడిని మూడువేలు చేశాడట— "అక్కడ నా ఆశ పెరిగిపోయింది బాబూ—ఒక్కసారి పెద్దెత్తుకు వెళ్ళిపోయాను. ట్రక్కునిండా బంగాళా దుంపలు, ఉల్లిపాయలూ వేసుకుని వస్తూంటే దార్లో వర్షం కొట్టేసి సరుకంతా పాడైపోయింది. ఆ నష్టం తట్టుకోలేక, అక్కడ నలుగురిలో ముఖం చూపించలేక ఇక్కడికొచ్చి రిక్షాతొక్కుతున్నాను" అన్నాడు. రిక్షా స్వంతం. అతనికి తాగుడు అలవాటు లేదుట. రెండేళ్ళనుంచి భువనేశ్వర్లో రిక్షా తొక్కుతూ ఇప్పటికి రెండువేలు వెనకేశాడట. అతడి పెళ్ళాం డబ్బును వడ్డీకి తిప్పుతుందట. డబ్బును తొందరగా అయిదువేలుచేసి మళ్ళీవ్యాపారానికి వెళ్ళిపోతానన్నాడు. రిక్షా తొక్కడం ఏ జన్మలోనో చేసిన పాపమనీ, పేగులు తెగిపోతాయనీ అతనన్నాడు. సాటి రిక్షావాళ్ళని అతను తిట్టాడు — "ఎవనికి బుద్ధిలేదండి. సంపాదించిన డబ్బు తాగి తగలేసుకుంటారు. జాగ్రత్తగా ఉంటే గవర్నమెంటు గుమాస్తాకంటే ఎక్కువే సంపాదించొచ్చు. కానీ వాళ్ళకు కుటుంబం ధ్యాసే ఉండదు. అందుకే వాళ్ళెలా బ్రతుకుతున్నారో — వాళ్ళపిల్లలూ అలాగే బ్రతుకుతారు. నేను ఛస్తే నా పిల్లలను రిక్షా తొక్కనివ్వను" అన్నాడతను.

నాకెంతో సంతోషం కలిగింది. ఇదే చైతన్యం అట్టడుగు వర్గంలో రావాలి. ఇలాంటివాడు

# ఆ వూ పు లీ క థ

ఒక్కడుంటేచాలు. వాణ్ణిచూసి మరికొందరు నేర్చుకోకపోరు. అతన్ని నేను మనస్ఫూర్తిగా అభినందించాను. అప్పుడు తగిలింది నాకు అనుకోని అసలైన అఘాతం.

"మీవాళ్ళెవరైనా ఉంటే చెప్పండి బాబూ — నెలకు ఎనిమిదొందలు దొరికే ఉద్యోగం ఇప్పిస్తాను" అన్నాడతను.

నేనులిక్కిపడి—"ఉద్యోగమంటే ?" అన్నాను.

"మరీ పెద్ద చదువులక్కర్లేదండి — రాయడం చదవడం బాగా రావాలి. ప్రెస్సులో పని. ముందు నెలకు మూటయాభై ఇస్తారు. ఓ ఏడాది తర్వాత నెలకు మూడొందలిస్తారు. ఇంకో ఏడాది పోయాక నెలకు ఎనిమిదొందల జీతం ఇస్తారు. నేనిప్పుడు నెలకు ఆరొందలకు తక్కువకాకుండా సంపాదిస్తున్నాను. ఈ సంపాదన లేకుండా నేను ఒక్క నెల కూడ తట్టుకోలేను. అందుకే నేనా ఉద్యోగానికి పోవడంలేదు. ఆయనకు నేనంటే చాలా ఇష్టం. నువ్వు రాకపోతే నీకు తెలిసినవాళ్ళెవరికైన చెప్పు. నువ్వు చెప్పినవాళ్ళకే ఇస్తాన్రా అన్నాడు. మీబోటి గాళ్ళ ఇళ్ళలో ఏ సంపాదనా లేకుండా ఏళ్ళతరబడి ఉన్నా గడుస్తుంది. మీలాంటివాళ్ళకిది మంచి ఉద్యోగం. మీవాళ్ళెవరైనా ఉంటే చెప్పండి బాబూ" అన్నాడు.

ఒక రిక్షావాడు మావాళ్ళకుద్యోగం ఇప్పిస్తానంటున్నాడు. నెలకు రెండు వేలు సంపాదించే పెద్ద ఆఫీసర్ని - నా చుట్టాలకి — ఆఫ్టరాల్... ఓ రిక్షావాడు .

నాలోని రచయిత ఈ ఆలోచనల్ని తొందరగానే నొక్కేశాడు. రిక్షా అతని మాటల్లో మధ్యతరగతికి ఓ గొప్ప సందేశమున్నదనిపించింది. మధ్యతరగతి వాళ్ళు ఏ సంపాదనా లేకుండా ఏళ్ళతరబడి ఉండిపోతారు. కారణం ఎలాగో అలాగ ఇంతో అంతో తిండీ బట్టా దొరికే ఆధారముండడం. అదే సదుపాయం అట్టడుగు వర్గానికి లేదు. అందుకే వాళ్ళు కాయకష్టం చేసి తమ కాళ్ళమీద తాము నిలబడగల్గుతున్నారు ఓ వయసొచ్చేక పిల్లల్నింట్లోంచి గెంటేసి మీ దారిన మీరు బ్రతకండి అంటె నిరుద్యోగ సమస్యకు పరిష్కారం లభిస్తుందా ? సమస్యకు పరిష్కారం లభించినా లభించకపోయినా ఇందులో మధ్యతరగతి నిరుద్యోగులు సిగ్గుపడవలసిన అంశం ఉన్నదని నాకు తోచింది.

అట్టడుగు వర్గం ప్రజల గురించి నాకు తెలుసుకునే అవకాశం అట్టే లేదు. ఒక్క రిక్షావాళ్ళు మాత్రమే నాకు దొరుకుతారు. నాకు తగిలిన వాళ్ళనుబట్టి వాళ్ళలో చైతన్యం వస్తున్నదనే నాకు అనిపిస్తోంది. అలాంటప్పుడు నేనొక వింత ప్రయోగం చేశాను.

ఓ రోజున నేనూ, శ్రీమతి రిక్షాలో సినిమా టాకీసుకి వెళ్ళాం. రెండున్నర ఇవ్వాలి. రిక్షా థియేటర్ చేరేక — "బాబూ — నాలుగు రూపాయలివ్వండి. సినిమా అయే టైముకి వచ్చి మీకు డబ్బులిచ్చేస్తాను. అర్జంట్‌గా బియ్యం కొని ఇంట్లో ఇవ్వాలి" అన్నాడు రిక్షా అతను

శ్రీమతి వద్దని నాకు గోకి చెప్పింది. నేను మాత్రం రిక్షా అతను కోరిక ప్రకారం డబ్బిచ్చి — "సినిమా అయిపోగానే వచ్చేయాలి. మేము నీకు బాగా గుర్తుంటామా ?" అన్నాను.

"అదేంటి బాబూ — మీకు చాలాసార్లు రిక్షా కట్టాను. మీరు నాకు బాగా గుర్తు. 'అడగ్గానే నన్ను నమ్మి డబ్బులిచ్చారు. మిమ్మల్ని మోసంచేసి నేను బాగుపడతానా ?" అన్నాడు రిక్షా అతను.

అతను బాగుపడినా పడకపోయినా — ఆ రూపాయన్నరతో నేను చెడిపోను

"సినిమాకంటె గొప్ప సస్పెన్స్. అతనొస్తాడో రాడో చూడాలి" అన్నాను.

శ్రీమతికి నా వ్యవహారం నచ్చలేదు-"తెలుగు సినిమా సస్పెన్సులాగుంది మీరు చెప్పేది. అతనింకా మళ్ళీ మీ కళ్ళబడతాడనే అనుకుంటున్నారా ?" అంది.

సినిమా చూస్తూ నేనీ విషయం మరచిపోయాను. కానీ సినిమాలో విషాద సన్నివేశం వచ్చినపుడల్లా శ్రీమతికి నా తెలివి తక్కువతనమూ, ఆ రూపాయిన్నరా గుర్తుకొచ్చి బాధపడేది. సినిమా నిండా విషాద సన్నివేశాలుండడం వల్ల ఆమె సినిమా పొడుగునా బాధపడుతూనే ఉంది. రూపాయిన్నర ఎంత విలువైనదో దాంతో ఆమె ఏమేమి కొనవచ్చునో వివరాలు చెప్పింది. అప్పటికీ శ్రీమతితో అన్నాన్నేను — "నీకు మొన్న కొన్న చీరకు షాపువాడు రెండువందల పదిరూపాయలు ధర చెప్పి మాట తొంభై అయిదుకిచ్చాడు. ఆ చీరకు నూటతొంభై ఆరున్నరయిందనుకో — షాపువాడు రెండొందలంటే రెండొందలూ ఇచ్చి ఉండేవాళ్ళంగదా" అన్నాను

నా సూచన శ్రీమతికి నచ్చలేదు. రూపాయిన్నర ఎంత విలువలేనిదో చెబుతూ — ఆమె జాకట్టుకు మొన్న ఇచ్చిన కుట్టుకూలి పదిహేనురూపాయలని కూడా గుర్తు చేశాను. శ్రీమతి అవి వినకుండా — కేజీ బంగాళాదుంపలు, బ్లేడ్ల ప్యాకెట్, జత రిబ్బన్లలాంటివి గురించే ఆలోచిస్తూ అమితంగా బాధపడుతూండగా సినిమా అయిపోయింది.

రిక్షా అతను రాడని శ్రీమతి ఘంటాపథంగా చెప్పినా ఏ మూలో ఆమెలో ఆశ మిణుకు మిణుకుమంటోందనడానికి చిహ్నం, ఆమె ఆత్రుతగా అటూ ఇటూ చూడడం. నేనా రూపాయిన్నర కెప్పుడో నీళ్ళొదిలేశాను. శ్రీమతినే గమనిస్తూ ఆనందిస్తున్న నన్నూ, శ్రీమతినీ రిక్షా అతను హఠాత్తుగా థ్రిల్ చేశాడు.

అతను రూపాయిన్నర నా చేతికి అందించగానే శ్రీమతి ముఖంలో పశ్చాత్తాప భావం నాకు స్పష్టంగా కనబడింది. నేనా డబ్బు జేబులో వేసుకుంటూ, "వృద్ధిలోకి వస్తావోయ్" అని అతన్ని మెచ్చుకున్నాను.

అతను నాకేసి నిరుత్సాహంగా చూసి "మీకు ఆవు — పులి కథ తెలుసా బాబూ !" అన్నాడు.

ఆవు, పులి అసలు కథేకాకుండా, బీనాదేవి రాసిన కథకూడా తెలుసు నాకు. రిక్షా అతని దగ్గర బీనాదేవి పేరు చెప్పడమెందుకూ అని, "తెలుసోయ్, నువ్వు అందులో ఆవుకంటె గొప్పవాడివి" అన్నాను.

"కానీ మీరు..." అని రిక్షా అతను ఆగిపోయాడు. అతనేమనదల్చుకున్నాడో నాకు తెలుసు. చటుక్కున జేబులోంచి రెండ్రూపాయల నోటు అతని చేతిలో పెట్టి — "నేనిప్పుడు పులికంటే గొప్పకదా !" అని ముందడుగు వేశాను.

"మరో అర్ధరూపాయ నష్టం" అంది శ్రీమతి నాతో అడుగు కలుపుతూ.

"ఏం ఫరవాలేదు. నీ చీర ఖరీదు ఇంకా నూటతొంభై ఏడే అయింది. కానీ రెండొందలు చేరలేదు" అన్నాను.

"అయిందేదో అయిపోయింది కానీ ఇంకెప్పుడూ రిక్షావాళ్ళతో చనువుగానూ, సఖ్యంగానూ ఉండకండి. నా కంటికి వాళ్ళంతా పులులుగానూ — మీరు ఆవులాగానూ కనిపిస్తున్నారు" అంది శ్రీమతి.

కాస్త ఆలోచిస్తే నిజమేనేమోననిపించింది. తర్వాతనుంచీ శ్రీమతి చెప్పినట్లే నడుచుకున్నాను రిక్షావాళ్ళ విషయంలో.






# నెస్టమ్ శిశువు జీర్ణానికి మంచిది

మీ పసిపాపకోసం
11 విటమిన్‌లు
ఇనుముగల
బియ్యంతో
తయారయిన
ఒకే ఒక పదార్థం.






ప్రకృతి సిద్ధమైన పద్ధతులలో మీ పాపని పెంచండి. ఇవ్వ గలిగినంత కాలం పాపకి చనుపాలు యివ్వండి—మీరు ఇవ్వగలిగిన పుష్టికరమూ, సున్నితమూ అయిన ఆహారం అదే.

పాపకి 4 నెలలు వచ్చేసరికి ఎక్కువ పోషక పదార్థాలు కావాలి. ఘన పదార్థాలు తీసుకోడానికి పాప సిద్ధంగా వుంటుంది. నెస్టమ్ గురించి, పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి. నెస్టమ్ బియ్యంతో తయారు చేయబడింది—ఎంతో సులభంగా జీర్ణమయ్యే సీరియల్.

నెస్టమ్ బేబీ సీరియల్ రైస—పాల నుంచి ఘన పదార్థాలకి సున్నితమైన మార్పు.

## నెస్టమ్®
### బేబీ సీరియల్ రైస్

పాల నుంచి ఘన పదార్థాలకి సున్నితమైన మార్పు

తయారు చేసే పద్ధతి :



ముందుగా మరిగిన వెచ్చని పాలు



పోయండి. నెస్టమ్ చేర్చండి.



కలపండి. తినిపించుటకు తయారు.

NESTLÉ®

SAA/FSL/N/2257 TEL

( గత సంచిక తరువాయి )






















[ఇంకా ఉంది]




## 2 7 1982 శుక్రవారం మొదలు
## 8-7-1982 గురువారం వరకు

మేషం:—చాల విధాల మీకు మేలు జరిగే సూచనగలిగిన ధనాదాయం గల, అప్పులు వసూలు కాగల, భారీ వ్యాపారం రాణించ గల పరిస్థితులు గల వారం. ఆరోగ్యంలో ఏ మాత్రం ఇబ్బంది రాదు. స్త్రీలకు : కుటుంబానందం, ఉద్యోగ ప్రగతి చెప్పదగిన వారం.

వృషభం : మీకు మేలు చేయాలని కొందరి ప్రయత్నం. అలాంటి పరిస్థితులు సమకూడితే స్వీకరించండి. వ్యాపారం చేసే వారికి మేలున్నది. క్రయ విక్రయాలలో లాభించే వారం. ఉద్యోగం చేసే లాగైతే, 'ప్రమోషన్' కొందరకు లభించ వచ్చు. స్త్రీలకు : వస్త్ర సేకరణకు, నగలు కొనుటకు అవకాశం గల వారం.

మిధునం : కొన్ని వారాలకన్నా ఈ వారంలో, సుఖం, ఆనందం, ఆదాయం, కళారంగావకాశాలు, సుగమంగా వ్యాపారం జరిగే మార్గం ఏర్పడే అవకాశాలున్నాయని గ్రహించండి. శ్రమిస్తే మేలుంటుంది. స్త్రీలకు : అధిక విద్యావకాశాలుండగలవు.

కర్కాటకం : మీకు కోర్టు వ్యవహారాలుంటే సుకరంగా నెరవేరగలవనే వార్త వినగలరు. ఉద్యోగంలో కొందరకు ప్రగతి కనిపిస్తుంది. గ్రహించ చండి. కొందరు నూతన వ్యాపారంలో భాగస్వామ్యులయ్యే అవకాశం గలవారం. స్త్రీలకు : శుభ కార్య వ్యవహారాలలో జోక్యం ఉండవచ్చు.

సింహం : తగాదాలు, తంటాలు, చుట్టు ప్రక్కల వారితో ఇబ్బందులు ఏర్పడే అవకాశం గలవారం. కొందరు నూతనంగా ఉద్యోగ ప్రయత్నాలు చేస్తే లాభించేవారమే. స్త్రీలకు : వృత్తి, ఉద్యోగాలందు సదవకాశాలు వుంటాయి. ఆభరణాలు సేకరించే అవకాశం గల వారం.

కన్య : ఇంకా ఇబ్బందులు, ధనం అందక పోవటం, ఇవ్వవలసిన వారికి ఇవ్వవలసిన పరిస్థితులు తొలగి పోలేదు. ఆరోగ్యం కూడా అభివృద్ధి చెందే మార్గం కూడా కనిపించలేదు. దానికి తోడుకుటుంబ సభ్యులతో చెప్పరాని బాధ కలుగవచ్చు. స్త్రీలకు : అధికాదాయం ఆశించరాదు. 'ప్రమోషను' లభించే సమయంగాదు. అధికంగా ఖర్చు మాత్రం చెప్ప వీలున్నది.

తుల : 'శనిగ్రహ బాధ' తప్పలేదనిపించే సంఘటనలు ఉండగలవు. అప్పుల వారి బెడద అధికమవుతుంది. ఆదాయం లేక పోవటంతో చికాకు ఏర్పడుతుంది. ప్రయాణాలు ఆగిపోయే పరిస్థితులు ఉంటాయి. స్త్రీలకు : ఆనందానికి లోటు. అధికారుల మూలాన ఇబ్బంది కనిపిస్తుంది.

వృశ్చికం : బంధువుల నుండి గాని, అయినవారి నుండి గాని, మిత్రుల నుండిగాని, శుభ వార్తాశ్రవణంగల వారం. ఉత్తరాల మూలాన కొన్నివిషయాలు తెలిసికోగలరు. స్త్రీలకు: సర్వ విధాల ఆనందదాయకం. అభిమానుల ఆదరణ, నూతన వస్తుసేకరణ, ఇత్యాది మంచి ఫలితాలు ఉంటాయి.

ధనుస్సు : మీరు భారీ వ్యాపారం చేసేవారైతే ఇంకా పైకి పోయే మార్గమున్నది. కొందరకు నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడవచ్చు. అందు మూలాన లాభం చేకూరవచ్చు. గమనించి, శ్రమించండి. స్త్రీలకు : నూతన వస్తు సేకరణకు, విలువగల వస్త్రాలు కొనేఅవకాశం, విందు భోజనావకాశం సంభవం.

మకరం : ఈ వారంలో మీకు కావలసినంత పైకం చేతికి అందనున్నది. చాలరోజులుగా అందని ధనం సమయానికి అందగలదు. ఆశించిన వ్యక్తి తటస్థపడి క్రయ విక్రయులలో అనుకూలత చేకూరే మార్గం ఉన్నది. స్త్రీలకు : బంధువుల రాక, విందు భోజనాలకు అవకాశం గలవారం.

కుంభం : చాలకాలంగా విబేధపడిన మిత్రులను కలిసికోగలరు. వారి మూలాన అనేక విషయాలు తెలిసికోగలరు. ఉద్యోగం కొరకు యత్నించే వారికి మంచి అవకాశాలుండగలవు. స్త్రీలకు : నూతన విషయాలు గ్రహించుటకు అవకాశం, అందవలసిన డబ్బు అందుతుందని గ్రహించాలి.

మీనం : చాల విధాల మీకు మేలు చేకూరనున్నది. రావలసిన ధనం అందే అవకాశం ఉన్నది. వ్యాపారం చేసేలాగైతే సదవకాశాలు లభించగలవు. భూముల విషయంలో ఏదో పరిష్కారం జరిగిపోగల వారమే. స్త్రీలకు : ఉన్నత విద్యావకాశాలు,సీట్లకు ప్రయత్నిస్తే. అనగా విద్యారంగాన ఉపయోగమైన వారం అని గ్రహించాలి.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి*






"ఈయన మా ప్రొఫెసర్, కృష్ణ దేవరాయ యూనివర్శిటీ నుంచొచ్చారు" అంటూ పరిచయం చేశాడు ఇంగ్లీష్ లెక్చరర్ శ్యాం ప్రసాద్

"నమస్కారమమ్మా" పొలైట్‌గా నవ్వుతూ లోపలికొచ్చాడు ప్రొఫెసర్ విజయ భాస్కరరెడ్డి.

"రండి రండి" అంటూ ఆహ్వానించింది వీణ

"మీ వారేరి ?" అన్నాడు శ్యాంప్రసాద్.

"ఆఫీస్ కెళ్ళారు."

"మీ గురించి శ్యాంప్రసాద్‌గారు చెప్తూ ఉంటారండీ ... మీరు రావటం చాలా సంతోషంగా ఉంది" టిఫిన్ ప్లేటు, కాఫీ పాట్, కప్పులు టీపాయ్ మీద – అమరుస్తూ అన్నది వీణ ప్రొఫెసర్‌తో.

"ఇప్పుడు టిఫినొద్దమ్మా" మొహమాటంగా అన్నాడు విజయ భాస్కరరెడ్డి.

"ఫర్లేదు, తీసుకోండి. లైట్ టిఫిన్. ప్లీజ్..." టీపాయ్ వాళ్ళ ముందుకు తోసి తనో కుర్చీ లాక్కుని కూర్చుంది వీణ.

"మీ గురించి కూడా 'శ్యాం' చాలాసార్లు చెప్పాడు. ప్రత్యక్షంగా కాకున్నా, పరోక్షంగా మీరు నాకు తెలిసినమాట ! మీకు చదువు మీదున్న ఇంట్రెస్ట్ స్వంతంగా చదువుకుని డిగ్రీలో ఫస్ట్‌క్లాస్ తెచ్చుకోటం ... ఇంకా మీ ఇతర టాలెంట్స్, అన్నట్లు...కాన్వెంట్ కూడా రన్ చేస్తున్నార్ట గదూ ? మంచిపని చేస్తున్నారు. అసలు మనిషెప్పుడూ ఐడిల్‌గా ఉండకూడదండీ, అందులో, లేడీస్ మరీను... సరైన యాక్టివేషన్ లేకపోతే ప్రతి చిన్న సమస్యకూ వాళ్ళే కారకులౌతారు" అన్నాడు ప్రొఫెసర్ ఆదర్శకమైన స్టైల్‌లో ఆడి ఆగి మాట్లాడుతూ.

సిగ్గుగా నవ్వి "ఎక్కడ దిగారు మీరు?" టాపిక్ మారుస్తూ అడిగింది వీణ.

"స్టూడెంట్స్ ఇనాగురల్ ఫంక్షన్‌కి నన్ను ఛీఫ్ గెస్ట్‌గా ఆహ్వానించారండీ. చిత్రమేమిటంటే ... నన్ను ఆహ్వానించటానికి మా యూనివర్సిటీకొచ్చిన స్టూడెంట్స్‌లో ఒక్కరూ నన్ను రిసీవ్ చేసుకోటానికి స్టేషన్‌కి రాలేదు. కాలేజీకొచ్చి నన్ను నేనే ప్రిన్సిపాల్‌కు పరిచయం చేసుకున్నాను. వాళ్ళిచ్చిన 'రూమ్' అనబడే ఆ టిక్కీలో ఉండలేక వెతుక్కుంటూ శ్యాం ప్రసాద్ ఇంటికెళ్ళాను ఇక్కడ నా క్లాస్‌మేట్స్, నా స్టూడెంట్స్ లెక్చరర్స్‌గా ఉన్నారు. ఎవరూ ... ఎవరూ నన్ను కనీసం 'టీకి' కూడా ఆహ్వానించలేదు. అంటే ... ఐమీన్ వాళ్ళింట్లో తప్పక టీ తాగి తీరాలని కాదు, పరిచయస్తుల్ని టీకి పిలవటం మర్యాద లక్షణం గదా కొంచం అమర్యాద జరిగినట్లు ఫీలయ్యాననుకోండి ఇది వెనుకబడ్డ ప్రాంతం గదా, సో, వాళ్ళూ నన్ను జ్ఞాపకాల్లో మంచి వెనక్కి తోసేసుంటారు ఆటోమాటిగ్గా" ఛలోక్తిగా నవ్వుతూ అన్నాడు ప్రొఫెసర్

ఆ నవ్వు వెనకాల బాధను, ఆ కళ్ళలోని ఆశాభంగాన్ని అర్థంగా చదివింది వీణ

వాతావరణం కొంచెం బరువుగా అనిపిస్తోంది.

"మీ రిద్దరూ ఇక్కడే భోజనం చెయ్యండి.

క్షణంలో ప్రిపేర్ చేస్తాను" ఆ బిరావును చెదరగొడుతూ లేచింది వీణ.

"నోనో నేనిప్పుడు బ్రైన్ వెళ్ళిపోతున్నాను"

"అదేం? ఫంక్షన్ లేదా?" అన్నది వీణ.

"క్యాన్సిలయింది" అన్నాడు శ్యాంప్రసాద్.

"ఎందుకని?"

"ఉదయం స్టూడెంట్స్ తన్నుకున్నారు. ఎలక్షన్‌లో ఓడినవాళ్ళకీ - గెల్చినవాళ్ళకీ మధ్య ఈ ఉడాయిలు మామూలే. ఎవడో ఎక్కడో ఏదో రైజ్ చేస్తాడు ఇంక అది కాలేజీ అంతా క్షణాలో వ్యాపిస్తుంది.

ఉదయం ఇంత గోల జరిగింది వాతావరణంలో టెన్షనింకా తగ్గలేదు ఈ రాత్రికి ఫంక్షన్ అరేంజ్ చేస్తే అది జరగదు సరిగదా ఇంకా గొడవలు చెలరేగుతాయని ప్రిన్సిపాల్ ఫంక్షన్ క్యాన్సిల్ చేశాడు" అన్నాడు శ్యాంప్రసాద్

"ఇలా ఫెయిలయ్యి అర్ధాంతరంగా వెనక్కు వెళ్ళిపోవటం ఇదే మొదలు నాకు.

ఈ స్టూడెంట్స్‌కు సభ్యతా సంస్కారా లెప్పుడలవడతాయో!" అన్నాడు ప్రొఫెసర్ నిట్టూరుస్తూ.

"నా మొహం! ఇక్కడయితే ఇంకో వంద సంవత్సరాల తర్వాత కూడా అలాంటి మార్పు రాదు" ఖచ్చితంగా అన్నాడు శ్యాంప్రసాద్

"వెళ్ళొస్తానండీ. మీ ఇద్దరూ పిల్లల్ని తీసుకుని మా ఇంటికి రండి" మనస్ఫూర్తిగా ఆహ్వానించాడు విజయ భాస్కరరెడ్డి.

"అలాగేనండీ, ఎప్పుడొచ్చినా, మీరూ మరిపోకుండా రావాలి" అన్నది వీణ.

"ష్యూర్ ష్యూర్' అంటూ లేచాడు ప్రొఫెసరు.

* * *

"రేపు మా ప్రొఫెసరు మళ్ళీ వస్తున్నారు" అన్నాడు శ్యాంప్రసాద్.

"దేనికి?" అన్నాడు వీణ భర్త గిరిధర్.

"అదే, ఆ రోజు క్యాన్సిలైన ఫంక్షన్ రేపు జరగబోతోంది,కానీ...ఈయన రాకుండా ఉండవలసింది. ఆ రోజు సరిగ్గా రిసీవ్ చేసుకోలేదు ... అనుకున్న ఫంక్షన్ క్యాన్సిల్ చేశారు ఆయన ఒక మామూలు వ్యక్తి కాదు గదా, సరదాగా పిలిపించి సారీ పొమ్మన్నా పట్టించుకోకుండా ఉండటానికి. దీన్నాయన సీరియస్‌గా తీసుకోవలసింది. మా కాలేజీలో లెక్చరర్సు 'ఒకసారి అలాంటి అవమానం జరిగాక ఇంక ఈ కాలేజీకి ఏ పూలూ రాడు' అన్నారు.

ప్రిన్సిపాల్ ఔలిగ్రాం ఇస్తే, ఆయన వస్తున్నానని ఔలిగ్రాం కొట్టాట్ట! ఫూల్ లాగా ఈయనే వస్తున్నాడు అంటూ నవ్వుతారు. అఫ్‌కోర్స్! ఆయన టాలెంట్ చూస్తే వాళ్ళ నోళ్ళు మూతబడతాయనుకోండి" అన్నాడు శ్యాంప్రసాద్.

తన ప్రొఫెసర్ని వాళలా తీసేసినట్టు మాట్లాడుతున్నారనే బాధ ఆయన మాటల్లో స్పష్టంగా కన్పిస్తోంది.

"ఆయన రాకలో ఏ అంతరార్థం లేకుండా ఉండదు" అన్నది వీణ.

* * *

"హలో! బావున్నారా? నెల రోజులకే మీ ఊరు మళ్ళీ వచ్చాను" అన్నాడు ప్రొఫెసర్ విజయభాస్కరరెడ్డి.

"నిన్న శ్యాంప్రసాద్ చెప్పారు, ఈ రోజు మీ రొస్తారని. మేం ఎక్స్పెక్టు చేస్తూనే వున్నాం" అన్నది వీణ నవ్వులో ఆహ్వానాన్ని కలగలుపుతూ.

**దుర్భాషితం**

తనివి తృప్తి
తృష్ణలో లేవు,
మృగతృష్ణలో ఉన్నవి
నీళ్ళు కానే కావు!
- కలికిరి వి. అబ్దుల్ ఖాదర్

"ఇంతకు ముందే నాకు డబ్బిచ్చేశారండీ కాలేజీవాళ్ళు.డబ్బు తీసుకుని...ఏ పర్పస్‌కోసం నన్ను పిలిపించారో దాన్ని పూర్తి చెయ్యకుండా వుండటానికి మనసొప్పలేదు నాకు. నాకు కొన్ని ప్రిన్సిపల్స్ వున్నాయి.

ఏనీ హౌ! ఇక్కడ నా రాక గురించి కొందరు చీప్‌గా అంచనా వేసుకునిఉండొచ్చు. ఐ డోంట్ కేర్! ఇనాగురల్ ఫంక్షన్‌కి నన్ను పిలిచారు. అఫ్‌కోర్స్ అది ఫెయిలయిందనుకోండి నా స్థానంలో ఇంకోరొచ్చి దాన్ని పూర్తి చెయ్యటం నా కిష్టంలేదు. నా స్థానంలో నేనే వుండాలనే వుద్దేశ్యంతో మళ్ళీ వాళ్ళు ఆహ్వానించగానే వచ్చాను" అన్నాడు ప్రొఫెసర్.

"సాయంత్రం ఫంక్షనుకి మీరూ, గిరిధర్ గారూ రండి" అన్నాడు శ్యాంప్రసాద్.

"మళ్ళీ ఏం గొడవలు జరగవు గదా" సందేహంగా అన్నది వీణ.

"అదేం వుండదు లెండి. పార్టీల్లో వగైరాలు నిన్ననే అయిపోయాయి కాబట్టి. ఇహ ఇంకీరోజు ఏం వుండదు."

"తప్పకుండా రండి మీరు తిరిగి వచ్చేటప్పుడు మిమ్మల్ని మేం డ్రాప్‌చేసి వెడతాం" అన్నాడు ప్రొఫెసర్.

* * *

"ఎక్కడికి? కాలేజీకి వెడుతున్నారా?" అని అడిగింది వీణ ఫ్రెండ్ లక్ష్మి.

'ఔను, రాకూడదూ?" అన్నది వీణ.

"ష్యూర్.నాకు చాలా ఇష్టం ఇలాంటివి" అన్నది లక్ష్మి.

"మీరు ముందెళ్ళండి ఓ అరగంట పోయాక నేను నా వాహనం మీద వస్తాను" అన్నాడు గిరిధర్

వీణ, లక్ష్మి ఇంకో ముగ్గురమ్మాయిలు కలిసి ఆరున్నరకు కాలేజీ ఆవరణలో ప్రవేశించారు

"ఓరి దేముడో! మనం తప్ప ఇంకెవరూ లేడీస్ రానట్టుందే" భయాన్ని వెలిబుచ్చుతూ అన్నది వీణ

"మనల్నెవరూ కొరుక్కుతినరు గానీ పద, ఫోజులు కొట్టక" అన్నది లక్ష్మి.

"ప్రసూనా! నువ్వు కొంచెం ఇటు తిరిగి మమ్మల్ని రండి రండీ అని ఆహ్వానించు. బొత్తిగా ఎవ్వరూ ఆహ్వానించకపోతే ఆదోలా ఉంది" అన్నది వీణ దూరంగా గుంపులుగా నిలబడ్డ అమ్మాయిలకు వినపడకుండా.

ప్రసూన అనబడే అమ్మాయి హఠాత్తుగా ఎదురు తిరిగి "రండి రండి మేడమ్! మీ రాకవల్ల మా కాలేజీ పావనమైంది నిజంగా నా భాగ్యమేమని వర్ణింతును!" అన్నది నాటకీయంగా.

అంతా గొల్లున నవ్వారు.

ఆఫీస్ రూమ్ ముందున్న కారిడార్ లోనుంచి శ్యాం ప్రసాద్,ప్రొఫెసరు వీళ్ళనిచూసి ముందుకు వస్తూ "రండి మీకు సీట్లు చూపిస్తాం" అన్నారు

'మూశారా మని ప్రతిభ' అన్నట్టు మూతి మీద చెయ్యి వెయ్యబోయిన వీణ సడన్‌గా ప్రొఫెసర్ వెనక్కి తిరిగి చూడటంతో ఖంగారుగా గబుక్కున చెయ్యి తీసేసుకుంది.

చాటుగా నవ్వుకున్నాడు విజయభాస్కర రెడ్డి. రెండు వరుసలుగా వేసి వున్నాయి

కుర్చీలు. ఒక వరసలో కొందరు లెక్చరర్లు వున్నారు, రెండో వరుసలో కూర్చున్నారు వీణావాళ్ళు. కొంచెంసేపయ్యాక మెల్లగా వెనక్కి తిరిగి చూసింది వీణ

గిరిధర్ మొదటి వరుసలో మధ్యగా కూర్చుని వున్నాడు. వచ్చానులే అన్నట్లు సౌంజ్ఞ చేశాడు

ఫంక్షన్ స్టార్టయింది

ప్రొఫెసర్ విజయభాస్కరరెడ్డి, స్టూడెంట్స్ యూనియన్ ప్రెసిడెంటు, సెక్రటరీ, కాలేజీ కమిటీ ప్రెసిడెంటు, ప్రిన్సిపాల్, మెజీషియన్ మాణిక్‌లాల్ వగైరాలు స్టేజీమీదకు ఆహ్వానించబడ్డారు.

శ్యాంప్రసాద్ మైకు ముందుకొచ్చి ప్రొఫెసర్ని ఆడియన్స్‌కి పరిచయం చేశాడు

ప్రొఫెసర్ స్పీచ్ మొదలయింది.

స్టూడెంట్సు పాల్గొనదగిన యాక్టివిటీస్ గురించి, యూనియన్ గురించి, యూనియన్ తరపున వాళ్ళు సాధించవలసినవి, అవి సాధించేందుకు శాంతియుతంగా అవలంబించవలసిన విధానాలు, ఈనాటి విద్యా విధానం, స్టూడెంట్స్ అనుసరించవలసిన పద్ధతులు మొదలైనవాటి గురించి ఉపన్యసించారు ప్రొఫెసరు.

అనవసరమైన విషయాలన్నీ ఎత్తుకుని బోరెత్తించకుండా, తనకు చాలా విషయాలు తెలుసునని, ఆ తెలిసిందంతా జనం నెత్తిని రుద్దెయ్యాలని తపనపడకుండా నీట్‌గా స్పీచ్ ముగించాడు. కొందరు ఆగి ఆగి తడుముకుంటూ ఇంగ్లీష్ మాట్లాడుతుంటే ఒంటిమీద వాలిన ఈగల్ని తోలుకుంటున్నట్టుంటుంది. ఆ భాష మీదున్న మోజు కూడా చచ్చిపోతుంది.

ప్రొఫెసర్ వాయిస్, ఉచ్చారణ గంభీరంగా అందంగా ఆకట్టుకునేలా ఉంది. ఆయన కంఠంలో నుంచి ఇంగ్లీష్ జలపాతంలా జారి పడుతోంది.

ఆయన స్పీచ్ ఇస్తున్నంతసేపూ అక్కడ పిన్‌డ్రాప్ సైలెన్స్!

ఆ తర్వాత విద్యార్థి నాయకులు, కమిటీ ప్రెసిడెంటు మొదలైన వాళ్ళు కొంతసేపు ప్రసంగించారు. అప్పుడు మెజీషియన్ స్టేజీ మీదకొచ్చి ఒక్కొక్క ఐటమ్ ప్రదర్శించడం ప్రారంభించాడు.

స్టూడెంట్సంతా ఉత్సాహంగా ముందు కొచ్చెయ్యటం మొదలెట్టారు.

ప్రిన్సిపాల్ వచ్చి "మీ కుర్చీలు ఈ ప్రక్క వేయిస్తానమ్మా. అక్కడొద్దు" అంటూ వీణా వాళ్ళను లేపి, స్టేజికి కుడిపక్కగా వేయించాడు కుర్చీలు.

మెజీషియన్ జోక్స్ వేసి నవ్విస్తున్నాడు. స్టూడెంట్స్ నవ్వితే, అంతకు రెట్టింపుగా తనూ నవ్వుతున్నాడు. వాళ్ళు సైలెంట్‌గా ఉంటే చిన్నబుచ్చుకుంటున్నాడు. మొత్తానికి ప్రదర్శన రసవత్తరంగా సాగుతున్నట్టుంది. ఇంకో అరగంటలో పూర్తవబోతోంది.

"టైమైపోతోంది ట్రైనుకు" వాచీ చూసుకుంటూ లేచాడు విజయభాస్కరరెడ్డి.

కొందరు ఆయన్ను అనుసరించారు.

ఇంతలో వెనుక నుంచి టప్ మన్న శబ్దం వినిపించింది. అందరూ గగ్గోలుగా లేచి తలా ఒక వైపు నుంచీ పరుగులు తియ్యటం ప్రారంభించారు. ఏం జరిగిందో తెలీదు ... ఎవరూ ఏంచెప్పటంలేదు. అందరూ మీద కొచ్చేస్తున్నారు. అప్రయత్నంగా ఆడవాళ్ళు కూడా లేచి ఎడమవైపుకు పరుగెత్తారు.

చుట్టూ జనం, మధ్యలో ఆడవాళ్ళు.

ఇప్పుడు కరెంటు పోతే ?

భయంతో గుండె గొంతులో కొచ్చినట్లయింది వీణకు తన రెస్పాన్సిబులిటీ మీద ఈ ఆడవాళ్ళను తీసుకొచ్చింది. తనకే కాదు, ఎవరికేమైనా తనదే బాధ్యత

ఇంత జనంలో గిరిధర్ ఎటువేపున్నాడో తెలియటల్లేదు. నిలబడి చూడటానికి వీల్లేదు. ఏడుపు ఉప్పెనలా వస్తోంది వీణకు.

"సోడా సీసాలు విసిరేస్తున్నారు పరుగెత్తండి" అన్నారెవరో.

తప్పిపోయిన చిన్నపిల్ల తల్లి కోసం వెతుక్కున్నట్టు భయంగా, ఆర్తిగా చూస్తోంది - వీణ తెలిసిన ముఖాల కోసం ... బయటకెళ్ళే దారి కోసం.

ఎటు వెడితే ఏం జరుగుతుందో తెలీదు. ఈ అనుభవం కొత్త ఆమెకు.

ఎకనామిక్స్ లెక్చరర్ శ్రావణకుమార్ హఠాత్తుగా కనిపించాడు వీణకు తనవేపే వస్తున్నాడు. ఒక్క ఊపులో ఆయన దగ్గరకు పరుగెత్తింది వీణ! "శ్రావణకుమార్ గారూ ! ముందు మమ్మల్ని బయటకు పంపండీ. ప్లీజ్" కంగారు, దుఃఖం గొంతులో సుళ్ళు తిరుగుతున్నాయామెకు. ఆడవాళ్ళంతా ఆయన్ను చుట్టుముట్టారు.

శ్రావణకుమార్ వాళ్ళను వెంటపెట్టుకుని కాలేజీ బిల్డింగ్స్ దాటించి బయటకు తీసుకొచ్చాడు.

రోడ్డుమీద కూడా జనం.

"అసలెవరు విసిరారు సోడా సీసాలు? ఎందుకు?" అన్నది లక్ష్మి.

"వీళ్ళు ఎరేంజ్ చేసుకున్న ఫంక్షన్ ఏ విఘ్నం లేకుండా జరగటం అవతల పార్టీ వాళ్ళకు అవమానం. అందుకని పొంచివుండి చేసిన పనిది. స్టూడెంట్స్‌లో రెండు పార్టీలున్నాయిక్కడ." అన్నాడు శ్రావణకుమార్ నిర్లిప్తంగా.

వెనుక నుంచి నురగలు కక్కుకుంటూ

# ప్రొఫెసర్

వచ్చాడు గిరిధర్ "అమ్మయ్య! క్షేమంగా బయట పడ్డారు గదా!" అంటూ శ్రావణ కుమార్‌తో చెయ్యి కలిపాడు సంతోషంగా, కృతజ్ఞతగా. దార్లో ఒక ప్రయివేటు హాస్పటల్ దగ్గర కొందరు గుంపుగా వున్నారు.

"ఏమయింది ?" అక్కడ ఆగుతూ అడిగాడు గిరిధర్

"ఆ సోడాసీసా 'ప్రొఫెసర్ విజయభాస్కర రెడ్డి'కి తగిలింది తలమీద పెద్ద గాయం తగిలింది. కుట్లేస్తున్నారు" అన్నారు వాళ్ళు.

"మై గడ్!" అప్రయత్నంగా అన్నది వీణ.

ఆ డాక్టర్ తెలిసినవాడవటంతో కుట్లెయ్యటం పూర్తయ్యాక గిరిధర్ వాళ్ళను విజిట్ చేశాడు.

"ఎక్కువసేపు మాటాడించకండి" అన్నాడు డాక్టరు.

తలకు బాండేజీతో నీరసంగా బెడ్‌మీద పడుకున్న ప్రొఫెసర్ని చూస్తూ దవించిపోయారందరూ. తమ కాలేజీకి అతిథిగా ఆహ్వానించిన వ్యక్తిని సరైన పరిస్థితులలో సగౌరవంగా పంపలేకపోయినందుకు చింతిస్తూ, చిన్నబోయిన ముఖంతో అక్కడే వున్నాడు ప్రిన్సిపాల్

"ఇంతసేపూ ఆయన చెప్పిందంతా గంగలో కలిసిపోయింది! అతిథిగా పిలిపించిన పెద్దమనిషిని గౌరవంగా పంపాలనే విషయంలో అందరికీ బాధ్యత ఉంటుందన్న జ్ఞానంలేదు వాళ్ళకి అయన స్పీచిస్తుంటే ఏదో వినటానికి బాగుందిలే అని విన్నారుగాని దాని భావం మనసుకు పట్టించుకున్నారా? ఆయన పిస్సియారిటీకి మంచి బహుమతి ఇచ్చారు" వాపోతూ కోపంగా అన్నాడు శ్యాంప్రసాద్.

"కొన్ని కొన్ని చోట్ల నిజాయితీకి ప్రతిఫలం ఇలాగే వుంటుంది" అస్పష్టంగా నవ్వుతూ అన్నాడు విజయభాస్కరరెడ్డి.

నీళ్ళునిండిన వీణ కళ్ళవేపు చూస్తూ "డోంట్ వర్రీ మిసెస్ వీణా. అయామ్ ఆల్‌రైట్" నీరసంగా అన్నాడు ప్రొఫెసర్.

మనస్సంతా దేనినట్లవుతుంటే యింక అక్కడుండలేక బయటికొచ్చేసింది వీణ ●

# హక్కుల కోసం ప్రభుత్వంపై ధ్వజమెత్తిన ఆదివాసులు!

ఒరిస్సా రాష్ట్రం నుంచి ఖర్కై నది బీహార్ రాష్ట్రంలోకి సింగ్‌భమ్ జిల్లాలో ప్రవేశిస్తుందట. ఆ చోట ఇచ అనే గ్రామంవద్ద 131 కోట్ల రూపాయల ఖర్చుతో భారత ప్రభుత్వ సమ్మతి సహాయాలతో బీహారు ప్రభుత్వం ఓ పెద్ద ఆనకట్ట కట్ట నిర్ణయించుకుని, తత్సంబంధమైన పనులు ఆరంభించిందట. దీనివల్ల 21వేల ఎకరములు బీహారులోనూ, 10,500 ఎకరములు ఒరిస్సాలోనూ సుక్షేత్రాలవడమేగాక, యీ ఆనకట్ట నుంచి వెళ్లే కాలువలవల్ల బీహారులో 58,700 ఒరిస్సాలో 1,52,100 ఎకరాలూ సాగుబడి అవుతాయని అంచనా అట. అంతేగాక, చుట్టు పక్కల రాష్ట్రాలలో యింకా కొన్నివేల ఎకరాలు సుక్షేత్రాలవుతాయట. కానీ, ఈ ఆనకట్ట కొన్నివేలఎకరాలను ఆక్రమించుకుని నిర్మాణమవాలట. కొన్ని వూళ్లే నామ రూపాలు లేకుండా పోతాయట. 21 గ్రామాలు సంపూర్ణంగానూ, 41 గ్రామాలు సహసహాలుగానూ రాష్ట్ర పటంనుంచి మటు మాయమవుతాయట. వ్యవసాయమే ముఖ్య జీవనాధారంగా ఉండే ఆ ఆదివాసులకు నష్ట పరిహారంగా ధనమిస్తే వారేం చేసుకుంటారనీ, వారిక్కావలసిన కొంపా గోడూ, పొలమూ కాస్తా ఈఆనకట్ట పొట్టన పెట్టుకుని డబ్బు ఇస్తే వారెక్కడకు వలస పోతారనీ ఆ ఆదివాసులలో ముఖ్యమయినవారు వాదిస్తూ ఈ పనిని ఆపడానికి నానా పనులు చేస్తున్నారట. ఈ ఆపే పని చేపట్టిన సంఘం పేరు ఖర్కై బంద్ సంఘర్ష సమితి అట. ఈ కొల్హాన్, పోరహాట్ ప్రాంతాలలో నివసించే జనుల తీరు తెన్నులు, మిగతా దేశంతో సరిపోల్చ వీల్లేదని, తమ హక్కుల కోసం వీరు సలిపే పోరాటాలు భయంకరమైనవనీ తలచి 1835లో బ్రిటిష్ ప్రభుత్వం "విల్కిన్సన్ రూల్' అని ఓ సూత్రాన్ని ప్రవేశపెట్టారట, దాని ప్రకారం ప్రభుత్వం అక్కడి జనుల సమ్మతి లేనిదే ఏవీ చేయరాదని శాసనమట. అది ఈనాడూ అలానే అమలు జరుగుతోందట. కానీ, ఇప్పుడు ప్రభుత్వం దీనిని నిర్లక్ష్యపెట్టి ఆనకట్ట కట్టడం సహించని ఆ ఆదివాసుల పెద్దలు ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ, "మీ పనులు మానుకోబోతే మా పనులారంభిస్తాము'' అని లిఖిత పూర్వకంగా తెలియబరుస్తూ ప్రభుత్వం ఆనకట్టగానీ,తత్సంబంధమైన పనులు గానీ, ఆపనులు చేయడానికిగానూ కావలసిన వస్తు సామగ్రి దాచుకోడానికి కట్టే టెంటు వంటి పనులుగానీ చేస్తే వాటిని ధ్వంసం, సర్వ నాశనం చేయుమని తమవారిని హెచ్చరించిందట. దాంతో అక్కడికి వచ్చిన ఇంజనీర్లనూ, వారినీ వీరు నానా బాధలు పెట్టనారంభించారట.



ఫిబ్రవరి26వ తేదీన బితా అనే చోట ముగ్గురు ఇంజనీర్లు సర్వే చేస్తున్నారట.అది23ఏళ్ల విద్యార్థి సిద్ధయాతియు అనే అతను ఉండే వూరట. అతనీ విధ్వంసకాండల నాయకులలో ఒకడట. ఆ ఇంజనీర్లను, ఇతను, ఇతని అనుయాయులు బంధించి, ఓ కొత్త చోటుకు పట్టుకుపోయారట. అక్కడ ఆడవారు వీరిని నగ్నంగా చేసి, చీపుళ్లతోనూ, కర్రలతోనూ చితికబాదారట. అంతేగాక, నగ్నంగా ఉన్న వారిని ఒంగోమని చెప్పి వారి పిర్రలకు, పురుషాంగాలకు చెలువా మాని రాశారట. ఈ మాని చాలా ఆమ్లం కలిగి ఉంటుందట. అది పడినచోటు చర్మం సర్వ నాశనమై ఇహ ఏ వైద్యానికి పనికి రావట. అటువంటి మానె వారికి రాశారట. అదృష్ట వశాత్తూ ఆ మాని బాగా నిలవదైనందువల్ల అంత ఫలితాన్ని ఇవ్వలేదుట. కర్రకు, గుడ్డ కట్టి, ఈ మానెలో ముంచి, వారి మల విసర్జనావయవంలో దోపారట! దాంతో ప్రభుత్వానికి పోలీసులకూ దిమ్మతిరిగిపోయిందట, వీరి నాయకులలో ప్రముఖుడైన రామ్‌నారాయన్ కాలుండియా అనే అతని వూరు ఇళయఘుర్‌కు ఏప్రిల్ నాలుగో తేదీ తెల్లవారుజామున బయలుదేరి వెళ్లారట.

ఆ సమయంలో ఇంట్లో భార్యతో నిద్రపోతున్న కాలుండియా తలుపు శబ్దం విని లేచి వెళ్లి తలుపు తీశాడట. అంతే . , పోలీసు బలగం ఒక్క ఉదుటున లోపలికి ప్రవేశించి, అతడ్నికూడా తొడమీద కాల్చి (పిస్టలు)గాయపరచి, అతని భార్య బైరాంగ్‌ను భయపెట్టి, ఓ మూల కూర్చో పెట్టారట. ఆమె భయంతో ఇల్లు వదిలి, ఆ చీకట్లో పారిపోయిందట. పోలీసులు అతని ఇల్లంతా ధ్వంసం చేసి, ఖరీదయిన వస్తు సామగ్రి జీపులో వడేసి, కాలుండియానూ జీపులో పడేసుకుని,బయలుదేరారట దారిలో ఆదివాసులు ఆ జీపులమీద రాళ్లు రువ్వి,అంతరాయం కల్పించడానికి విశ్వ విఫలయత్నం చేశారట.

అదే రోజు సాయంకాలం అయిదు గంటల ప్రాంతంలో నాలుగు పోలీసు జీపులు ఇళయఘుర్ గ్రామానికివచ్చాయట. దాంట్లో సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్, సబ్ డివిజనల్ మాజిస్ట్రేటు, ఎడిషనల్ డిప్యూటీ కమిషనర్, డి.ఎస్.పి. ఉన్నారట. వారు కాలుండియా భార్యనూ, అతని బంధు, మిత్రులనూ పిలిచి అతనింట్లోంచి పోలీసులు తీసుకుపోయిన వస్తువుల జాబితా అడిగారట. ఆనక కాలుండియాని ఆసుపత్రికి తీసుకువెళ్లి రూంలో వూరి ప్రజలు పోలీసులకు అంతరాయం కలిగించినందువల్ల అతను దారిలోనే చనిపోయాడనీ, శవం సాదర్ ఆసుపత్రిలో ఉన్నదనీ చెప్పారట.

ఆసుపత్రి నుంచి ఇంటికి తెచ్చిన అతని శవం భయంకరంగా కుళ్లిపోయి ఉన్నదట, అతని ఛాతీ కుడి భాగాన ఓ పెద్ద నరుకు గాయం ఉందట. కొంత చర్మం పీకేసినట్టుందట. చేతులకు సగం వేళ్లు లేవట. కళ్లుండాల్సిన చోట కన్నాలున్నాయట, పురుషావయం మటుమాయమయిందట.

ఖర్కై బంద్ సంఘర్ష సమితి జనరల్ సెక్రెటరీ ఈ కాలుండియా. ఈ సమితి ప్రభుత్వం కట్టే ఆ ఆనకట్టలకు అడ్డుగా నిలిచి భయంకరంగా దారుణకాండలను జరుపడంతో ఈ సర్వయాగమారంభమయిందట.



# స్నేహానికి నివాళి

- వీరపల్లె వీణావాణి



అది యూనివర్సిటీ ఉమెన్స్ హాస్టల్.

ఉదయం తొమ్మిదీ ముప్పావు కావస్తోంది. రిస్ట్‌వాచ్‌లో టైం చూసుకొన్న నేను, గబగబా బాత్‌రూం కెళ్ళి ముఖం కడుక్కొని వచ్చి టాయ్‌లెట్టై, బుక్స్ తీసుకొని కాలేజికి వెళదామని, రూంకు లాక్ వేసి గబగబా క్రిందికి వచ్చాను.

"రూపా! నీకు ఫోన్ వచ్చిందే" అంది ఎదురుగా వస్తున్న సునీత

"నాకు ఫోనా?" అంటూ నమ్మలేనట్టుగా చూశాను.

"అవును నీకే తొందరగా వెళ్ళు" అంటూ వెళ్ళిపోయింది సునీత.

నేను యూనివర్సిటీలో చేరి సంవత్సరం పైగా అయ్యింది నాకెప్పుడూ యింతవరకు ఫోన్ అంటూ రాలేదు. అసలు నాకు ఫోన్ చేసేవాళ్ళు ఎవరూ లేరు. ఎవరై ఉంటారబ్బా అని ఆలోచిస్తూ, ఫోన్ ఉండే ఆ హాలు లోపలికి అడుగెట్టాను. నేను అక్కడికి వెళ్ళే సరికే ఆ హాలులో మా క్లాస్‌మేట్స్ కలభాషిణి, వరలక్ష్మి కూర్చొని ఏదో








బులుసు వేంకటరమణయ్య

## రేపెలా ఉంటుందో?

విగ్రహం, ధనాన్ని సంపాదించేటప్పుడు - మర్నాడు ఎలా ఉంటుందో, దాని కోసం ఎందుకు శ్రమ పడాలి? అనే ఆలోచన లేకుండా - తాను శాశ్వతంగా ఉంటాననే విశ్వాసంతోనే ఉండాలనీ, ఇతరులకు ఇచ్చేటప్పుడు మాత్రం మరుక్షణంలోనే మృత్యువు రాగలదనే భయంతో వెంటనే ఇవ్వాలనీ పెద్దల సూక్తి ఉన్నది. ఈ నీతి ఎరగనివారు ఉండరు. కాని, దీనిని ఆచరణలో పెట్టే వారు చాలా అరుదు. దీనిని గురించి ఒక కథ ఉన్నది. అది నిజమా? అబద్ధమా? అనే చర్చతో తల పాడుచేసుకోకుండా దాని వల్ల తెలిసే విషయాన్ని మాత్రం ముఖ్యంగా మనం గ్రహించాలి.

ధర్మరాజు రాజ్యం పరిపాలిస్తున్న రోజులవి! ఒకనాడు ఒక పేద బ్రాహ్మణుడు తన కుమార్తె వివాహం కోసం ధనం యాచించడానికి ఆయన వద్దకు వచ్చాడు. అప్పుడు యుధిష్ఠిరుడు ఏదో తొందరపనిలో ఉన్నట్టున్నాడు. అందువల్ల "రేపు రండి, మీకు కావలసిన ధనాన్ని యివ్వగలను" అని చెప్పాడు. ఆ బ్రాహ్మణుడు మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

భీమసేనుడికి యీ సంగతి తెలిసింది. 'అన్నగారు ఇలా ఎందుకు చేశారు? ఆ బ్రాహ్మణుని వెంటనే తృప్తిపరచి పంపివేయవచ్చును కదా!" అని అనుకొని ఆయన పొరపాటు ఆయనకే అర్థమయ్యేటట్టు చెయ్యాలని నిశ్చయించాడు. వెంటనే నగరంలో ఉత్సవం ప్రకటించాడు. రాజమార్గాలు చందన జలసిక్తాలైనవి. నగరమంతటా ధ్వజపతాకలు ఎగురసాగినవి. మంచి దుస్తులతో అందరూ ఆనందంతో తిరుగసాగారు. "ఎందుకీ సందడి?" అని ధర్మరాజు ప్రశ్నించాడు. భీముడు "అన్నగారూ! రేపనేది ఎలా వుంటుందో చెప్పలేము. ఏ ఉపద్రవమయినా సంభవించవచ్చు, మానవ జీవితం క్షణభంగురం అంచేత. మనం ఉన్నప్పుడే ఉత్సవం చేసుకోవాలి. ఆనందం అనుభవించాలి. అందుకే ఈ ఏర్పాట్లు చేశాను" అని సమాధానమిచ్చాడు.

ధర్మరాజుకు తన తప్పు బోధపడింది. "తనకు బుద్ధి చెప్పడానికే తమ్ముడు మాటలతో కాకుండా చేతలతోనే హెచ్చరిక చేశాడు" అని అనుకున్నాడు.



పడేసా మని రెండడుగులు వేశాను. మళ్ళీ ఆ ముసలాయన నాకు ఎదురుగా వచ్చి నిలబడి వ్రాయబడిన మనియార్డరు ఫారంను, తన చేతిలో అడ్రసు రాయబడిన ఆ కాగితం ముక్కను రెండింటినీ నా చేతికి అందివ్వబోయాడు. నేను పశ్నారకంగా అతని వేపు చూశాను.

"ఈ కాగితం ముక్కలో రాయబడిన అడ్రసు తప్పులేకుండా మనియార్డర్ ఫారం మీద రాసుందో లేదో చూడండమ్మా" అంటూ వాటిని నా కందించాడాయన.

అతడు మనియార్డర్ చేస్తున్నది యాభై రూపాయలు.

ఆ కాగితం ముక్కలో వ్రాయబడిన అడ్రసు చూశాను. అందులో వి. రమణమూర్తి, ఫస్టియర్ బి. కాం., జవహర్ భారతి కాలేజి, కావలి, నెల్లూరు జిల్లా అని ఇంగ్లీషులో రాయబడి ఉంది. తర్వాత ఎం. ఓ. ఫారంలో అడ్రసు చూశాను.

అంతే... నిర్ఘాంతపోయాను నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను.

అక్కడ... ఫిలప్ చేయబడిన యం. ఓ. ఫారంలో 'టు' అడ్రస్ దగ్గర కలభాషిణీ హాస్టల్ అడ్రస్ శుభ్రంగా ఇంగ్లీషులో వ్రాయబడి వుంది. ఇది కలభాషిణి తన స్వహస్తాలతో చేసిన పని. ఆ యాభై రూపాయల కోసం ఎంతకు దిగజారిపోయింది కలభాషిణి! నర్మద గొలుసును అనసూయ ముట్టుకోకబోయినా, అనసూయే ఆ గొలుసును దొంగిలించి ఉంటుందని దొంగతనం చేసే తత్వం ఆ అమ్మాయికే ఉందని, దొంగతనాన్ని అసహ్యించుకొంటూ నా రూంలో అరగంట కితం మాట్లాడిన కలభాషిణి... ఇప్పుడు చేసిందేమిటి?

"ఈ ఫారంలో అడ్రసు కొంచెం తప్పుగా వ్రాయబడి వుంది యింకో ఫారం తీసుకోండి తప్పులేకుండా వ్రాసిస్తాను" అని చెప్పాను నేను ఆ ముసలాయనతో.

ఆయన మరో యం. ఓ. ఫారంను తీసుకొచ్చాడు.

జరిగిన విషయం ఆయనకు చెబితే... బహుశా చదువుకొనే పతి ఆడపిల్లమీద అతనికి ఏవగింపు కలగవచ్చునని... నేను ఆ విషయం చెప్పకుండా మౌనంగా ఆ ఫారంను ఫిలప్‌చేసి యిచ్చాను ఆయన కెళ్ళి... ఆ ఫారంతో పాటు డబ్బును కౌంటర్‌లో యివ్వడానికి నిలబడ్డాడు.

ఈ దౌర్భాగ్య వ్యవస్థలో. కలభాషిణి లాంటి వాళ్ళే ఎక్కువగా తయారైతే... పరాకాష్ఠనందుకొన్న నీచానికి నిఘళలు అర్పించినా మనం ఆశ్చర్యపడాల్సిన అవసరముండదు

### అంకితం

మరో జన్మంటూ ఉంటే, ఆ జన్మలో... ఏ చెల్లెలకు నేను తోడబుట్టిన వ్యక్తి కావాలనుకుంటున్నానో ఆ "ఒక్కగా నొక్క" చెల్లెలు మా 'శోభ'కు -

పీరపల్లె వీణావాణి

# వంటలు



## అరటిపండు పూరీలు

కావలసిన వస్తువులు : మైదాపిండి – 250 గ్రాములు, శెనగపిండి – 125 గ్రా, అరటిపండ్లు – మూడు, పచ్చిమిరపకాయలు – నాలుగు, జీలకఱ్ఱ – అర టీ స్పూను, మిరప్పొడి – ఒక టీ స్పూను, పసుప్పొడి – కొద్దిగ, ఉప్పు – తగినంత, నెయ్యి – ఒక టేబుల్ టీ స్పూను.

తయారు చేయు విధము : ముందుగా మైదాపిండిని, శెనగపిండిని బాగా జల్లించి ఒకటిగా పోసి కలపాలి దానికే మిరప్పొడి, పసుప్పొడి, జీలకఱ్ఱ, ఉప్పు వేసి బాగా కలపాలి తర్వాత పచ్చిమిర్చిని సన్నగా తరిగి వేయాలి. తర్వాత తగినంత నెయ్యి వేసి పూరీల పిండిలా కలుపుకోవాలి. ఇప్పుడు అరటిపండ్లకు పైపొట్టు తీసేసి మెత్తగా చేత్తోనే నలిపి ముద్దలా చేయాలి. ఈ ముద్దను మైదాపిండి ముద్దకు చేర్చి బాగా నలిపి చిన్న చిన్న వుండలు చేసుకుని కాస్త దళసరిగా పూరీలు వత్తాలి వీటిని మరుగుతున్న నూనెలోవేసి దోరగా వేయించితీయాలి.

– గార్ల సరస్వతి

## షీర్ ఖంద్

కావలసిన వస్తువులు : పెరుగు-2 కప్పులు, పంచదార-1కప్పు, జీడిపప్పు-10 లేక 15 పలుకులు, బాదం -5 లేక 6 పలుకులు, కిస్‌మిస్ – 15 పళ్ళు, యాలకులు-2.

ఇది తయారుచేయటానికి ఒకరోజు ముందుగా చిక్కటి పాలు కొని బాగా కాచి తోడువేయాలి. ఆ పెరుగును ఒక పల్చటి గుడ్డలో కట్టి వ్రేలాడదీయాలి. ఒక రెండు గంటలసేపు అలాగే ఉంచితే నీళ్ళు గనక ఉంటే క్రిందకు దిగి గుడ్డలో పొడి పొడిగ పెరుగు మిగిలిపోతుంది. దీనిని ఒక ప్లేటులోకి తీసుకోవాలి. పంచదారను మెత్తగా నూరి ఇందులోకలిపేయాలి. తీపి ఇష్టమైన వారు ఇంకా కొద్దిగ ఎక్కువైన కలుపుకోవచ్చు. దీనికి యాలకులపొడి చేర్చాలి. జీడిపప్పు, బాదం, కిస్‌మిస్‌లను నేతిలో వేయించి ( కొద్దిగ ఎర్రబడేలాగ ) పైన చల్లాలి, ఇది చాలా రుచిగ ఉంటుంది.

– యం. జరీనా

## మామిడి జామ్

కావలసిన వస్తువులు : మామిడిపళ్ళ రసము – రెండు గ్లాసులు, పంచదార – రెండున్నర గ్లాసులు, ఏలకులు కొద్దిగా.

తయారుచేయు విధము : ఒక గిన్నెలోకి మామిడిపళ్ల రసం తీసి వుంచాలి ముందుగా పంచదార తీగపాకం పట్టాలి. తీగె పాకం రాగానే, మామిడిపళ్ళ రసాన్ని అందులోవేసి, బాగా కలియబెట్టాలి ఏలకులపొడిని అందులో వేయాలి మామిడిపళ్ళ రసం పంచదార పాకంలో బాగా ఉడకాలి ఈ మిశ్రమం మరీ అంత గట్టిపడకుండా, మరీ పల్చగా కాకుండా వుండాలి. అపుడు ఆ మిశ్రమం... చల్లారిన తర్వాత వెడల్పాటి మూతగల సీసాలోకి తీసుకోవాలి. ఈ మామిడి జామ్ రొట్టెల్లోకి తీసుకుంటే చాలా బాగుంటుంది

– షాజాద్

## రవ్వ బర్ఫీ

కావలసిన వస్తువులు : రవ్వ – 1 కప్పు, మైదా–1కప్పు, నెయ్యి–1కప్పు, పంచదార–1¾కప్పులు,జీడిపప్పు-కొంచెం యాలకులు – 3, ఎండు కొబ్బరికోరు–కొంచెం, కేసరి రంగు–చిటికెడు.

తయారుచేయు విధానము : ముందు రవ్వని, మైదాని నేతిలో విడివిడిగా వేయించాలి. తరువాత రెంటిని కలిపి పెట్టుకోవాలి. జీడిపప్పును గూడ నేతిలో (బ్రౌన్ కలర్‌వచ్చే) దాక వేయించాలి. వేయించిన జీడిపప్పును బాగా చిన్న చిన్న ముక్కలు చేసుకొని, దానికి ఎండుకొబ్బరి కోరు, యాలకులపొడి కలిపి వేరుగా ఉంచుకోవాలి. పంచదారలో కొంచెం నీరు పోసి కేసరి రంగును వేసి స్టౌపై పెట్టి కలుపుతూ ఉండాలి. సన్నని తీగపాకం వచ్చిన తరువాత కలిపి పెట్టుకున్న రవ్వ, మైదా మిశ్రమాన్ని వేయాలి. దీనిని బాగా కలుపుతూ నెయ్యి పొయ్యాలి. 5 నిముషాల తరువాత బుసబుసమని పొంగువస్తుంది. అప్పుడుదాన్ని నెయ్యి రాసిన ప్లేటులోపోసి ఎత్తువల్లాలు లేకుండా సమంగా చేయాలి. ముందుగా చేసి ఉంచిన జీడిపప్పు ముక్కల మిశ్రమాన్ని వెంటనే దీనిపై చల్లాలి. కొంచెం వేడిగా ఉన్నప్పుడే ముక్కలుగా కట్‌చేయాలి. చల్లారాక ముక్కలు విడదీసుకోవాలి.ఇది చాలా రోజులు నిల్వ ఉంటుంది.

– జి. శశికళ *

యాత్రకెళ్ళి 'పాత్ర' వేయాలంటారు! ఎందుకండీ!!

ఏం మిగలక పోయినా కనీసం 'పాత్రైనా' మిగులుతుందని!!



# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**తెలుగుదేశం వారపత్రిక :**

శ్రీ ఎన్. టి. రామారావు కొత్తగా స్థాపించిన ప్రాంతీయ రాజకీయ పార్టీ ఆశయాల ప్రచారానికై మే 27 న తెలుగు దేశం అనే వారపత్రిక ఆవిష్కరణ జరిగింది. స్వాతంత్ర్య సమర సమయంలో దేశంలోని పత్రికల స్వాతంత్ర్యసముపార్జన కోసం పాటు పడ్డాయి. నేడు తిండీ, బట్టా, గూడూ కావాలని పోరా[డే] వారితో పాటు పోరాడవలసిన అవసరం ఏర్పడిం[ద]ని తెలుగు దేశం పార్టీ నాయకుడు శ్రీ నాదెండ్ల భాస్కరరావు ప్రారంభోత్సవ సమయములో అన్నారు. ఆవిష్కరణ ఉత్సవం రామకృష్ణ స్టూడియోస్‌లో జరిగింది. శ్రీ ఎన్. టి. రామారావు పత్రికను ఆవిష్కరిస్తూ దేశ భవిష్యత్తు యువకుల పై ఆధారపడిందని, తవ వారు ఎన్ని కష్టాలు వచ్చినా ఎదుర్కొని లక్ష్యం సాధిస్తారని అన్నారు. ఎట్టి అవాంతరాలు వచ్చినా తట్టుకొని లక్ష్యం సాధించడం ధీరోదాత్త లక్షణమని ఈ వారపత్రిక సంస్థ మీద నమ్మకంతోను, ప్రజల సమస్యలకు పరిష్కారం అన్వేషించే ఉత్సాహంతోను కృషి చేయాలని శ్రీ రామారావు ఉద్బోధించారు.

**శ్రీ షేక్ ఖాసిం :**

రాష్ట్ర విభజన కారణంగానో, ఉద్యోగ నిర్వహణ కారణంగానో అన్య రాష్ట్రాలలో ఉండవలసి రావడం వల్ల తమ భాష కలుషితమవుతుందేమోనని, తమ సంస్కృతి ఎక్కడ విస్మృత మవుతుందోనని అంగలార్చే లక్షలాది తెలుగు వారికి ప్రతీక శ్రీ షేక్ ఖాసిం. 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అనేసూక్తిని ఎప్పటికప్పుడు మననం చేసుకొనడానికిదోహదకారి శ్రీ షేక్‌ఖాసిం. నిజానికి భాష కన్నా ప్రాంతమే ఏకత్వ భావనకు పుట్టినిస్తుందేమోనని పిస్తుంది నా మట్టుకునాకు. భాషకన్నా జన్మభూమే బలవత్తరమైన అనుబంధం. నలభయి ఏళ్ళ క్రితం లాహోర్‌లో కొంతమంది వివిధ మతస్థులు, వివిధ భాషల వారు అయిన తెలుగు ప్రాంతపు వ్యాపారస్థులను చూచాను. మీది ఏ వూరు అంటే, మాది ఆంధ్ర అనేవారు. వారిలో కొందరు ముస్లిములు, మరి కొందరు మార్వాడీలూను. 'బాన ఏదైనా వుండోక్కనీ, మాది వతన్ ఆంధ్ర' అనే అనేవారు. కనుక భాషకన్నామనను బంధించేది దేశమే. శ్రీ ఖాసిం కృష్ణా జిల్లా నందిగామలో జన్మించారు. అక్కడే స్కూల్ ఫైనలుతర్వాత తమ మేనమామ మొగలాయిలో ఇంజనీరుగా వున్నందున ఆయనను ఆశ్రయించి ఏదోనౌకరీ సంపాదించారు. ప్రైవేటుగా అప్పర్ సబార్డినేట్ ఇంజనీరింగ్ ప్యాసయి తెలంగాణా జిల్లాలలో పని చేసి రాయచూరుకు తబాదలా (బదిలీ) అయినారు. ఇంతలో భాషా రాష్ట్రాలు, ఏర్పడడం రాయచూరు కర్నాటకలో కలవడం జరిగాయి. కనుక కర్నాటక ప్రభుత్వ సేవలో జూనియర్ ఇంజనీరుగా ఉండి పోయారు. ఉద్యోగమేమీ పెద్దది కాదు. ఆయన తెలుగు భాషా భక్తి, భావుకత గొప్పవి. రాయచూరు గొప్ప చారిత్రక స్థలం కదా! దాని ప్రభావం కూడా ఆయనపై ప్రసరించింది. పరిసర ప్రకృతికి ముగ్ధులై తెలుగులో గేయాలు రచించారు.

> గుడియయినా గోపురమైనా
> మందిరమైనా మసీదు అయినా
> మనుషులే కదా కట్టింది
> దేవుణ్ణి నిలుచోబెట్టింది
> నరుని భక్తికే నారాయణుడు
> శిథిలాలయమైనా పృథులాలయమైనా
> నిజరూపంలో నిలిచాడు
> మట్టి బొమ్మలో ఇమిడాడు''

అని మత సామరస్యానికి పాటుబడుతున్నారు. పిలిచినా, పిలవక పోయినా తెలుగు నాడులో జరిగే రచయితల సభలకు వెళ్తారు. ఉత్సాహంతో తమ గేయాలు వినిపిస్తారు. సభ్యులు ఆదరించినా పరవశులవుతారు. 1975 లో హైదరాబాదులో జరిగిన ప్రథమ ప్రపంచతెలుగు మహాసభలో రాష్ట్రేతరాంధ్ర ప్రతినిధిగా పాల్గొన్నారు. ప్రత్యేక సంచిక 'వాణి' లో ఆయన కవితాఖండిక కూడ ప్రచురితమయినది. ఈ సంవత్సరం మార్చి నెలలోజరిగిన ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనంలో పాల్గొని సన్మానితులయ్యారు. ఆస్థాన కవి డాక్టర్ దాశరథి శ్రీ ఖాసింను "మీ పద్యాలు హృదయహిమాద్రి శిఖరం నుండి దూకిన గంగాఝరి. నా గుండెల్లో దాచుకుంటాను.' అని ప్రశంసించార[ు]. ఈ ప్రశంసతో శ్రీ ఖాసిం పులకించి య[...]. శ్రీ ఖాసిం మధురగాయకులు. తా[ము] రచించిన రెండువందల పై చిలుకు గేయాలకు సొంత బాణిలో స్వరకల్పన చేశారు. చక్కగా పాడి ఆనందింపచేస్తారు. ఆంధ్ర ప్రజలు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తనకు అన్ని విధాల ఇతోధిక ప్రోత్సాహం ఇవ్వగలదని నిరంతరం ఆశిస్తుంటారు. ప్రస్తుతం ఆయన కర్నాటక రాష్ట్రంలోని గుల్బర్గా జిల్లా అప్పర్ కృష్ణా ప్రాజెక్టులో జూనియర్ ఇంజనీరు.



శ్రీ షేక్ ఖాసిం

**మూత్రపిండాల మార్పిడి ఉస్మానియా ప్రతిభ**

మూత్రపిండాల మార్పిడికి దాదాపు లక్ష రూపాయలు ఖర్చవుతాయి కనుక సామాన్యుడే కాక మధ్య తరగతి వాడు కూడ అలాటి చికిత్సకు నోచుకోలేడు. ఏటా దాదాపు 100మంది మూత్ర పిండాల వ్యాధితో బాధ పడుతున్నవారు ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో చే[రు]తారు. అలాటి వారికి ఆ ఆస్పత్రిలోని నెఫ్రాలజీ విభాగం ఆరోగ్యకరమైన మూత్ర పిండాలు లభించడాన్ని బట్టి చికిత్స చేస్తున్నది. ఈ విభాగం వైద్యులు డాక్టర్ గోపాల్‌కిషన్, డాక్టర్ రంగనాథరావు గార్లతో శ్రద్ధతో ఈ చికిత్స జరుపుతున్నారు. ఈ విధంగా ఉస్మానియా జనరల్ ఆస్పత్రి మే 16 న శ్రీ మహమ్మద్ ఇబ్రహిం అనే 32 సంవత్సరాల యువకునికి మూత్ర పిండం అమర్చి రికార్డు సృష్టించింది. శ్రీ ఇబ్రహిం ముంతాజా కళాశాలలో లేబరేటరీ టెక్నీషియనుగా పని చేస్తున్నారు. ఈయన తమ్ముడు శ్రీ మహ్మద్ ఇషాక్ తన మూత్ర పిండం దానం చేశాడు. ఆస్పత్రిలోమూత్ర పిండాల వ్యాధి చికిత్సకై చేరే రోగులలో సగం మందికి మూత్ర పిండాల మారిడి అవసరమని, దాదాపు 40 లక్షల రూపాయలు ఖర్చు చేస్తే మూత్ర పిండాలమార్పిడికి అవసరమైన ఏర్పాటు చేయవచ్చని డాక్టర్‌గోపాల్ కిషన్, డాక్టర్ రంగనాథరావు అంటున్నారు.

# హైదరాబాద్ నోట్ బుక్

## 100 కోట్ల రూపాయల భూమి ఆక్రమణ :

జంటనగరాలలో భూమి దురాక్రమణ ఉదంతాలు నానాటికీ వెల్లడవుతున్నాయి. తీగ కదిలిస్తే డొంకంతా కదలిన సామెతగా బడాబడా ఘరానా వాళ్లే రంగంలో దిగారు. ఈ వ్యవహారం ఇందిరా కాంగ్రెస్ అంతర్గత వ్యవహారం కాదని, దొంగలెవరో తెలుసుకొనేహక్కు ప్రజలకుంది గనుక, న్యాయ విచారణ జరగాలని భారతీయ జనతా పార్టీ నాయకుడు శ్రీ ఎం. వెంకయ్య నాయుడు అన్నారు. పత్రికలు ఈ విషయమై ఎంతగా వ్రాసినా అధికార పక్షం మెదలకుండా వుంటే, దానంతట అదే సద్దుమణుగుతుందని అధికార పక్షం భావిస్తున్నట్లు తోస్తున్నదని శ్రీ నాయుడు అనుమానిస్తున్నారు. రాష్ట్రంలో భూముల దురాక్రమణ దాదాపు నూరు కోట్ల రూపాయల మేరకు జరిగిందని దీని దర్యాప్తుకు రాష్ట్ర ప్రభుత్వం నియమించిన ఏక సభ్య సుశీల్‌కుమార్ సంఘానికి మారుగ హైకోర్టు న్యాయమూర్తితో దర్యాప్తు జరిపించాలని జనతా పార్లమెంటు సభ్యుడు శ్రీ బాబుల్‌రెడ్డి సూచించారు. ఇంత పెద్ద ఎత్తున జరిగిన దురాక్రమణలో కేవలం ఇబ్రహింఖాన్ పై ఆరోపణలు విచారించినంత మాత్రాన ప్రయోజనం లేదని, న్యాయ విచారణ జరిగితే రాజకీయ నాయకుల ఇతర ప్రముఖుల దురాక్రమణలు కూడా బయట పడతాయని ఆయన అన్నారు. ఈ దురాక్రమణలో అధికార పార్టీ వారే భాగస్వాములు కావడంవల్ల న్యాయ విచారణకు ముఖ్యమంత్రిని ఆదేశించడానికి ప్రధాని సంకోచపడుతున్నదని జనతానాయకుడు శ్రీ జైపాల్‌రెడ్డి ఆరోపించారు.

## ఉపశ్రుతి :

వచన కవితా పితామహుడు శ్రీ కుందుర్తి ఆంజనేయులు కుమార్తె వివాహం జూన్ 3వ తేదీన మలక్‌పేట కాలనీలో జరిగినప్పుడు శ్రీ కాళోజీ నారాయణరావు వివాహ వేదికకు సమీపంలో కూర్చున్నారు. ఆయన చుట్టూ ముత్తయిదువులే ఎక్కువగా వుండడంసంభవించింది. అది చూచి మిత్రులు శ్రీ అబ్బూరి వరద సహజ హాస్య ధోరణిలో "ఏమిటి కాళోజీ ఆడవాళ్ల మధ్య కూర్చున్నారెందుకు ?" అన్నారు. కాళోజీ ఈ కారాంత స్త్రీ లింగం కామోసు! అన్నారు డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ. ఏమండోయ్, మీ పేరు స్త్రీలింగమట! అని శ్రీ కాళోజీని హెచ్చరించారు మరెవరో. డెబ్బయి ఏళ్లు పైబడినప్పుడు అన్ని లింగాలూ ఒక్కటే— అని మీసాల మధ్య నవ్వారు శ్రీ కాళోజీ. ●





ఆంధ్రప్రదేశ్ సచివాలయ సాంస్కృతిక సంఘం హైదరాబాదులో సాంస్కృతిక వారోత్సవాలు నిర్వహించిన సందర్భంలో నాటక రచయిత, నటుడు, దర్శకుడు "మధురశ్రీ" (శ్రీ కె. వీరరాజు)ని సన్మానించారు. "సాహితీప్రియ" వారు తయారు చేసిన మధురశ్రీ సన్మాన సంచికను సినీనటుడు శ్రీ జె. వి. సోమయాజులు ఆవిష్కరించారు. శ్రీ జె. వీరాస్వామి శ్రీ వీరరాజుకి సన్మాన పత్రం సమర్పిస్తున్న దృశ్యం.






ఇటీవల వెల్లూరులో రంగప్రవేశ నృత్యాన్ని ప్రదర్శించిన బేబీ ఉమా ముద్దుబాల

## అక్కినేనికి సన్మానం

నటసామ్రాట్ డా. అక్కినేని నాగేశ్వరరావుని నిజామాబాద్‌లో ఏకైక ఎ. ఎన్. ఆర్. కల్చరల్ అసోసియేషన్ సభ్యులు అభిమానులు, ఇటీవల స్థానికంగా నిర్మించిన "లలితా మహల్" థియేటర్ ప్రారంభోత్సవానికై విచ్చేసిన శుభసమయంలో ఘనంగా సన్మానించారు. సన్మాన సందర్భంలో అభిమాన సంఘం కార్యదర్శి శ్రీ శంకర్, ప్రధాన కార్య నిర్వాహకులు శ్రీ మోహన్ కళా ప్రపూర్ణ అక్కినేనిని పుష్పమాలలతో ముంచెత్తి, అసోసియేషన్ ఆర్టిస్టు శ్రీ స్పైబ గీచిన నిలువెత్తు అక్కినేని తైలవర్ణ చిత్ర పటాన్ని బహూకరించారు.

నిజామాబాద్‌లోని ప్రముఖ కవి, రచయిత, వ్యాఖ్యాత, అసోసియేషన్ ఉపాధ్యక్షులు శ్రీ వి. పి. చందన్‌రావ్ తాము వ్రాసిన సన్మాన పత్రాన్నిచదివి విన్పించారు.

తనకు జరిపిన సన్మానానికి డాక్టర్ అక్కినేని కృతజ్ఞతలు తెలియజేస్తూ, సహజ చమత్కారాలతో చలన చిత్ర జీవిత సత్యసత్యాన్ని వివరిస్తూ ఉపన్యసించారు.

## ఆంధ్ర లలిత కళా సమితి

"ఆంధ్ర లలిత కళాసమితి, దక్షిణ మధ్యరైల్వే సికింద్రాబాద్) వారు మే 28న రైల్వే నిలయం ఆడిటోరియంలో శ్రీ గండ్లూరి దత్తాత్రేయశర్మ అష్టావధాన కార్యక్రమాన్ని నిర్వహించారు.

సమితి ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ధర్మారావు స్వాగతం చెప్పారు. ఆచార్య దివాకర్ల వెంకటావధాని కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. శ్రీ దేవారెడ్డి వెంకటరెడ్డిగారు అవధాన పరిచయం చేశారు.

పృచ్ఛకులుగా ఆచార్య దివాకర్ల వెంకటావధాని, శ్రీ పరాంకుశం కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య, శ్రీ వి. వెంకటేశ్వర్లు, శ్రీ రఘుపతి, శ్రీ ఆర్. సత్యనారాయణ శ్రీ ఎం. ఆర్. మూర్తి, శ్రీ దేవారెడ్డి వెంకటరెడ్డి డా. ఎం. కులశేఖరరావు, శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య పాల్గొని అవధాన కార్యక్రమాన్ని ఎంతో విశిష్టరీతిలో నడిపించారు.

సమితి అధ్యక్షులు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం శ్రీ దత్తాత్రేయశర్మని, కవులను సన్మానించారు. శ్రీ సమ్మెట సుబ్బారావు వందన సమర్పణ చేశారు.

## ఇలా ఎంతకాలం ?

కవితా సంకలనం రచన శ్రీ తేజస్విత. 34 పేజీలు వెల : 5 రూపాయలు. ప్రతులకు శ్రీ డి. లక్ష్మీనారాయణ (రచయిత), 10—139, బెల్లంమండీవీధి, కడప—516001.

## బాలి కార్టూన్‌లు

ప్రముఖ చిత్రకారుడు శ్రీ బాలి వేసిన కార్టూన్‌లతో నిండిఉన్న ఈ 128 పేజీల పుస్తకం కార్టూన్ ప్రియులకి మంచి కాలక్షేపంగాఉంటుంది. వెల : 8 రూపాయలు. ప్రతులకు : న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

## ఇంద్రసింహాసనం

నవల రచన : డా. సి. ఆనందరామం. 244 పేజీలు, వెల13 రూపాయలు. ప్రతులకు : న్యూ స్టూడెంట్స్ బుక్‌సెంటర్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

## కల నుండి ఇలకు - కాకి బంగారం

జంట నవలలు రచన : డా. సి. ఆనందరామం 148+76 పేజీలు వెల 12రూపాయలు ప్రతులకు: న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

## వెలుగుబాట

నవల. రచన : డా. సి. ఆనందరామం. 198 పేజీలు వెల 10 రూపాయలు. ప్రతులకు : న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరురోడ్డు విజయవాడ—2.

## పదివేల గోపికలు ఒక రాధిక

నవల. రచన : డా. సి. ఆనంధరామం, 244 పేజీలు వెల 15 రూపాయలు. ప్రతులకు : న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

## ఈ నాటి శకుంతల

నవల : రచన : డా. సి. ఆనందారామం. 278 పేజీలు : వెల 15 రూపాయలు. ప్రతులకు : న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరురోడ్డు విజయవాడ—2.




ఇటీవల రాయలసీమ జానపద కళాసమితి (ప్రొద్దుటూరు) తరఫున సంస్థ గౌరవాధ్యక్షులు శ్రీ జాటూరు రమణయ్య, నాటక అకాడమి సభ్యులు శ్రీ అరవేటి శ్రీనివాసులుని సన్మానిస్తున్న దృశ్యం.

# ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

## కథలు

4.6.82 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం సుమలత చాలా బాగుంది. 'అనురాగదేవత నీవు, విధివిపరీతం' రెండు కథలు మాకెంతో నచ్చాయి.

పొలాస రాజరత్నం, పి. రాజేశ్వర్ రాజు,
(వేములవాడ)

* * *

చిరునవ్వులు చిందిస్తు ఆంధ్రపత్రిక పాఠకులకు దర్శన మిచ్చిన 'సుమలత' ముఖచిత్రం ఎంతో ముగ్ధమనోహరంగా ఉంది. 'నీకు పెళ్లి నాకు శిక్షా' కథ ఎంతో బాగుంది. కథ పాఠకుల హృదయాలను అమితంగా ఆకర్షించింది.

కందిగట్ల ప్రభాకర్ (జనగావ్)

* * *

నటి సుమలత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా వుంది. 'అరాచకీయం, విధి విపరీతం, నీకుపెళ్లి—నాకుశిక్షా ?' కథలు చాలా బాగున్నాయి.

పి. వి. రామనాథరావు, రేణుకా భవాని (మధిర)

* * *

4.6.82 తేదీ "సుమలత" ముఖచిత్రంగా వెలువడిన పత్రిక ముగ్ధ మనోహరంగా వుంది. 'అనురాగదేవత నీవు" "విధి విపరీతం" కథలు మాకెంతగానో నచ్చాయి.

కడియాల సురేష్‌బాబు, కడియాల సుభశ్రీ—
(మంగళగిరి)

28.5.82 సంచికలోని కథలు చాలా ఇంట్రెస్టింగ్‌గా ఉన్నాయి. జి. భానుగారు రచించిన "కనువిప్పు" చాలా బాగుంది రచయితకి ధన్యవాదాలు.

పి. రామమోహన్ (సిద్దిపేట)

* * *

28.5.82 నాటి సంచికలోని కథలలో "ది బెగ్గర్స్" బాగుంది. 'రాయి' కథ చదివి ఒక విధమైన అనుభూతి చెందాను. కెవిస్వీ గారికి ధన్యవాదాలు.

బిరుదరాజు సతీష్‌కుమార్ భట్ (కాజీపేట)

* * *

28.5.82న వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి శాంతికృష్ణ ముగ్ధ మనోహరంగా ఉన్నది. కథలు 'కనువిప్పు, కంప్లైంటు రాయరూ, దిబెగ్గర్స్' చాలా బాగున్నాయి.

కాట్రగడ్డ వెంకటరామలక్ష్మయ్య (మోటూరు)

* * *

28.5.82 నాటి ఆంధ్రపత్రిక అందించిన కథలన్నీ ఒకవత్తయితే'ది బెగ్గర్స్' కథ ఒక ఎత్తు. కథ పేరు ఇంగ్లీషు పేరులో ఉన్నా చదువుకోడానికి ఎంతో ఇంట్రెస్ట్‌గా ఉంది.

కె. ప్రభాకర్ జనగామ)

* * *

28.5.82 వ తేదీ పత్రిక ముఖచిత్రం శాంతి కృష్ణ చూడ చక్కగా ఉంది. కథలో "కెవిస్వీ" రాయి మిర్రర్ ది బెగ్గర్స్ సూపర్బ్.

కె. ప్రదీప్‌కుమార్ (ఏలూరు)

* * *

28.5.82 సంచికలోని కథలలో కెవిస్వీ గారి "రాయి" కథ చాలా బాగుంది.

విజేంద్రనాథ్ ప్రసాద్ (ఆదోని)

* * *

"శాంతికృష్ణ" ముఖచిత్రం ఈ వారం పత్రికకు పచ్చతోరణాలు తొడిగి సింగారించి నట్టుంది. కథలు నాల్గింటిలోను "ది బెగ్గర్స్" సమాజ స్థాయిని ప్రతిబింబించింది. పర్దా ఆచారం విషయు వివరణ బావుంది.

పి. సూరిబాబు, చంటిబాబు (హైద్రాబాద్)

* * *

28.5.82న పత్రికలో ప్రచురించిన కథలలో 'రాయి' కథ చాలా బాగుంది. ఇది మా అందరి హృదయాలలో నాటుకున్నది. ఈ కథ వ్రాసిన కేవిస్వీ గారికి ధన్యవాదాలు.

డి. రమేష్ (కె. డి. పేట) ●



Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.



"గోల్కొండ అబ్బులు"లో కృష్ణంరాజు, జయప్రద, అల్లు రామలింగయ్య